"హింస ఒక్కొక్కప్పుడు అనివార్యం కావచ్చు. కానీ ఒక పద్ధతి ప్రకారం హింస ప్రయోగించే వ్యూహాలు ఒకప్పుడేమైనా మేలు సాధించాయేమో గానీ, ఈనాటి ఆయుధ సంపత్తి చేయగల విధ్వంసం ఎంతటిదంటే ఆ రోజులు గడచిపోయాయని అనుకోవాలి. ఈనాటి ఆయుధ సంపద స్వాభావికంగానే నిర్విచక్షణమైనది. ఒక బాణంవేసి ఒకరిని మాత్రమే చంపవచ్చు. బాంబుపెట్టిగానీ, మందుపాతర పేల్చిగానీ ఒకరిని మాత్రమే చంపడం సాధ్యం కాదు. మిగిలిన ప్రాణాలు పోవడం 'అనివార్యం' అని ఆధునిక హింసామార్గాలను సమర్థించే వారు అంటుంటారు. అనివార్యమేమీ కాదు, ఈనాటి ఆయుధాలు అట్లాంటివి.

ఈ విచక్షణారాహిత్యం మన నైతిక విచక్షణను సులభంగా చంపేయగలదు. బాణాలు, గొడ్డళ్లు వాడిన రోజులలో మనుషుల నైతికత ఆయుధాల అదుపులోకి పోలేదేమోగానీ (నాకు తెలీదు), మన కంటే చాలా బలమైన ఆయుధాలతో మన బలాన్ని చాలా పెంచుకున్నా మనుకోవడం తెలివితక్కువతనం. మన నైతికత మనకు తెలియకుండానే ఆయుధాల అదుపులోకి పోగలదు. అవి మనకిచ్చే బలం ముందు మామూలు మనుషులు నిలవరు, నిలవలేరు. మన మాట చాలా తేలికగా చెల్లుబాటవుతుంది. సమస్యలు - మన సమస్యలే కాదు, మనల్ని ఆశ్రయించే వాళ్ల సమస్యలు కూడ - సులభంగా పరిష్కారమయి పోతాయి. కనీసం పరిష్కారమయి పోయినట్లు కనిపిస్తాయి.

అందువల్ల హింసతోనే సమాజాన్ని పరిపాలించాలని చూసినా, హింసతోనే దానిని మార్చాలని చూసినా అనైతిక పర్యవసానాలే ప్రధానంగా ఉంటాయి."

*- కె. బాలగోపాల్*

*బాలగోపాల్ జననం-బళ్ళారి (కర్ణాటక)లో. తండ్రి కందాళ పార్థనాథశర్మ, తల్లి నాగమణి. జర్నలిస్ట్ వేమన వసంతలక్ష్మి జీవిత సహచరి. చదివింది గణితంలో ఎమ్.ఎస్.సి, పి.హెచ్‌డి. (ఆర్.ఇ.సి.-వరంగల్), తర్వాత ఎల్.ఎల్‌బి (బెంగుళూరు యూనివర్సిటీ). కాకతీయ యూనివర్సిటీలో గణితశాస్త్ర అధ్యాపకుడు (1981-1985). ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘంలోనూ (1981-1998), ఆ తర్వాత చివరివరకూ మానవహక్కుల వేదికలోనూ పని చేశారు. లాయర్‌గా ప్రాక్టీస్ చేశారు. చాలాకాలం విరసం సభ్యుడు. ప్రజాబంధు అనే ముసుగు సంస్థ 1989లో కిడ్నాప్ చేసింది. అనేక స్వతంత్ర రచనలతో పాటు, చిన్న పత్రికలలో కూడా కాలమ్స్ రాశారు. ఇంగ్లీషులో ఇ.పి.డబ్ల్యు, ఇంకా ఇతర మాగజైన్లలోనూ, అనేక తెలుగు పత్రికల్లోనూ వ్యాసాలు రాశారు. బాలగోపాల్ పర్‌స్పెక్టివ్స్ వ్యవస్థాపక సభ్యుడు.*

జననం : 10.06.1952 మరణం : 08.10.2009

బాలగోపాల్ రచనల కోసం : www.balagopal.org

# నక్సలైట్ ఉద్యమం

## వెలుగునీడలు

**కె. బాలగోపాల్**




పర్‌స్పెక్టివ్స్

సామాజిక శాస్త్రం / సాహిత్యం

హైదరాబాద్

2017

for E book : www.kinige.com

ISBN-978-93-81172-12-4

ప్రచురణ సంఖ్య : **55**



**నక్సలైట్ ఉద్యమం**

వెలుగునీడలు

(వ్యాసాలు)

[Reflections on the
Naxalite Movement - K. Balagopal]

ప్రథమ ముద్రణ : మే 2017

రచన : **కె. బాలగోపాల్**

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :
**నవోదయ బుక్ హౌస్**
ఆర్యసమాజ్ ఎదురు వీధి
కాచిగూడ చౌరాస్తా,
హైదరాబాద్-500 027
ఫోన్ నెం. 040-24652387

పబ్లిషర్స్ :
**ప ర్ స్పె క్టి వ్స్**
సామాజిక శాస్త్రం / సాహిత్యం
ప్లాట్ నెం 305
ఇ.నెం. 2-2-647/182/ఎ3
హిమశివ అపార్ట్‌మెంట్స్
బాగ్ అంబర్‌పేట్
హైదరాబాద్-500 013
సెల్ : 8332934548

వెల : **₹ 200/-**

ప్రింట్ సపోర్ట్ :
**వేమన వసంతలక్ష్మి**
మన్నం బ్రహ్మయ్య

కవర్ డిజైన్ :
నవ్య
హైదరాబాద్

లేఅవుట్ & కంపోజింగ్ :
నవ్య
హైదరాబాద్

ముద్రణ :
**చరిత ఇంప్రెషన్స్**
ఆజామాబాద్,
హైదరాబాద్-500 020
ఫోన్ : 040-27678411

# ఈ పుస్తక ప్రయోజనం

బాలగోపాల్ రాసిన అన్ని రచనలను ప్రచురించాలన్న ప్రయత్నం చాలా వరకూ పూర్తి అవుతున్నది. దీనికి కొంత మంది వ్యక్తులు, కొన్ని సంస్థలు - ముఖ్యంగా మానవ హక్కుల వేదిక - చాలావరకు దోహదపడింది. ఈ మొత్తం కృషిలో పర్‌స్పెక్టివ్స్ కూడా కొంత బాధ్యత తీసుకుని ఏటా ఒక పుస్తకాన్ని ప్రచురిస్తూ ఉంది. బాలగోపాల్ పర్‌స్పెక్టివ్స్ సంస్థలో క్రియాశీలక సభ్యుడు మాత్రమే కాక సంస్థ లక్ష్య ప్రకటనను రూపొందించినవాడు.

ఉమ్మడి రాష్ట్ర చరిత్రలో 1980వ దశకం చాలా సంక్షుభిత కాలం. వెంగళరావుతో ప్రారంభమైన అణచివేత ఎన్‌టిఆర్ పాలనలోనూ, ఆ తర్వాత కూడా కొత్త రూపాలను సంతరించుకుని ఆట, మాట, పాట బంద్ దాకా పోయింది. ఈ సంక్షుభిత కాలపు ప్రసవ వేదన నుండి పుట్టి తన ఆచరణను, ఆలోచనను, మేధోశక్తిని, కఠినమైన వాస్తవాలను మేళవించి సమాజానికి ఒక కొత్త చూపునివ్వడానికి అహోరాత్రులు కష్టపడ్డ అరుదైన ఉద్యమకారుడు బాలగోపాల్. పౌరహక్కుల ఉద్యమంలో చేరిన కొద్ది కాలానికే సంస్థ ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలు చేపట్టి సంస్థ అవగాహనకు, ఆచరణకు ఒక కొత్త ఊపునివ్వడమే కాక పౌరహక్కుల ఉద్యమానికి అంతకుముందు లేని తాత్విక పునాదులను వెతికే క్రమంలో బహుశ దేశంలో ఎక్కడా జరగనంత తీవ్రమైన విస్తృతమైన చర్చ పౌరహక్కుల సంఘంలో ఒక దశాబ్ది కాలం పాటు జరిగేలా చూశాడు.

బాలగోపాల్ మొత్తం ఆలోచనా క్రమాన్ని వడబోస్తే మానవ సమాజ ప్రగతికి, ఉద్యమాలకు, విప్లవపోరాటాలకు ఒక నైతిక, తాత్విక పునాది ఉండాలని, ఆ పునాది విస్తృతమయ్యే క్రమంలోనే సామాజిక సంబంధాలలో ఉన్నతమైన మానవీయ విలువలు వ్యవస్థీకృతం కావాలని ఆయన ప్రగాఢంగా వాంఛించినట్టు అర్థమవుతుంది. ఈ విలువల విస్తరణకు కావలసిన భౌతిక పునాది మార్పును సంపూర్ణంగా సమర్థిస్తూనే ఆ మార్పు కోసం జరుగుతున్న అన్ని ప్రయత్నాలు కూడా మానవ చైతన్యాన్ని పెంచే దిశగా ఉండాలని, భౌతిక పునాదిలో మార్పు దానికదే మానవ చైతన్యాన్ని పెంచదని, అది ఒక మేరకు మానవ చైతన్యాన్ని ప్రభావితం చేసినా ఆ ప్రభావం ఉన్నత విలువల వ్యవస్థీకరణకు దోహదపడకపోతే వచ్చిన మార్పు స్థిరపడదని, అది స్థిరపడకపోతే సమాజ ప్రగతి ఆటుపోటులకు గురై మనం సాధించుకోవాలన్న లేదా సాధించుకున్న ఉన్నత సమాజం ప్రమాదంలో పడుతుందని, ఆ చారిత్రక అనుభవం సోషలిస్టు సమాజాల పతనం మనకు అందించిందని ఆయన అవగాహన. ఈ పుస్తకంలోని వ్యాసాలను ఈ చట్రం నుండి అర్థం చేసుకొని విశ్లేషించవలసిన అవసరం ఉందని పర్‌స్పెక్టివ్స్ భావిస్తున్నది.

ఈ ప్రచురణలోని కొన్ని వ్యాసాలు వివాదాస్పదమైన విషయం తెలిసిందే. వాటి మీద చాలా చర్చ జరిగింది కూడ. కాని ఆయన అలా రాయడానికి కారణం వివాదాలను సృష్టించడం కాదు, ఆయా అంశాల మీద లోతుగా చర్చ జరిగితే ఆ చర్చా క్రమంలో ఒక ప్రజాస్వామిక సంస్కృతి ఏర్పడుతుందని, అటువంటి చర్చ మరింత పదునైన ఆలోచనలకు దారి తీస్తుందని ఆయన భావన. ఈ మొత్తం కృషి సామాజిక చైతన్యాన్ని ఉన్నతీకరిస్తుందని ఆయన విశ్వసించారని మేము అనుకుంటున్నాం. ఆయన ఎన్నడూ ఈ చర్చను తర్కానికి పెట్టలేదు. తర్కంలోకీ దిగలేదు. చేసిందల్లా గతితర్క కృషే. దానికి ఉదాహరణ ఆయన రాసిన 'చీకటి కోణాలు' వ్యాసమే. ఈ వ్యాసం చదివిన వారికెవరికైనా అది చాలా కటువుగా ఉందనిపిస్తుంది. విశ్వాసాల కొరకు, మార్పు కొరకు ప్రాణ త్యాగాలు చేస్తున్న విప్లవోద్యమాన్ని అంత కఠినమైన చట్రం నుండి చూడడం సబబేనా అని కూడా అనిపిస్తుంది.

ఒక్క 'చీకటి కోణాలే' కాదు ఇందులోని వ్యాసాలన్నీ చాలావరకు విప్లవ పార్టీల ఆచరణకు సంబంధించినవే. సైద్ధాంతిక అంశాలను చర్చించిన 'మనిషి-మార్క్సిజం' (పర్‌స్పెక్టివ్స్ ప్రచురణ అక్టోబర్ 2012) కి ఇది కొనసాగింపు కాబట్టి సహజంగానే ఇందులో ఆచరణకు సంబంధించిన అంశాల చర్చే ఎక్కువ ఉంది.

బాలగోపాల్ వాదనల్లో - రాజ్యవ్యవస్థ ఒక రాజ్యాంగాన్ని రూపొందించుకొని ఆ ప్రమాణాల మీద పని చేస్తానని ప్రజలకు ఆశ్వాసాన్నిచ్చింది. అందుకే పౌరహక్కుల ఉద్యమాలైనా, ఇతరులెవరైనా రాజ్యాన్ని ప్రశ్నించేప్పుడు ఆ లీగల్ చట్రం నుండే దాన్ని ప్రశ్నిస్తారు. దాని నిజాయతీని రాజ్యంగ విలువల గీటురాయి మీద పరీక్షిస్తుంటారు. రాజ్యం దిగజారిపోతున్నది అని మనమంటే దాని అర్థం అది తనకు తాను నిర్దేశించుకున్న ప్రమాణాలను ఉల్లంఘిస్తున్నదని. అంటే రాజ్యపు విశ్వసనీయత ఆ విలువల లేదా ప్రమాణాల ఆచరణ మీద ఆధారపడి ఉందని. అలాగే ప్రత్యామ్నాయ సమాజం కొరకు లేదా ప్రజల రాజ్యాధికారం కొరకు జరిగే పోరాటాల నుండి పోరాట క్రమంలోనే కొత్త విలువల సృష్టి జరిగి, అవి క్రమేణా అభివృద్ధి చెందుతూ ప్రత్యామ్నాయ సమాజానికి కావలసిన భూమిక ఏర్పాటుకు దారితీయాలి. ఆ మార్పు నిరంతర ప్రక్రియలా సాగి కొత్త విలువల వ్యవస్థీకరణ జరిగితే, దాని ఫలితంగా సమాజం, సామాజిక సంబంధాలు ఉన్నతీకరించబడితే, మనుషుల నిత్యజీవిత శైలి, సమష్టితత్వం, ఇతర మనుషుల పట్ల దృక్పథం ప్రజాస్వామికంగా మారి ప్రజాస్వామ్య సంస్కృతి విరాజిల్లుతుందని, లేకపోతే రాజ్యం - అది సోషలిస్టు రాజ్యమైనా విలువల వ్యవస్థీకరణను సాధించలేదనే బలమైన అభిప్రాయం బాలగోపాల్ రచనల్లో, విశ్లేషణలో కనిపిస్తుంది.

తన అనుభవం నుండి, అవగాహన నుండి, నిరంతర పరిశీలన నుండి తాను అభివృద్ధి చేసుకున్న ప్రాపంచిక దృక్పథంతో పాటు, ఆయా సమస్యలను పరిశీలించాల్సిన శాస్త్రీయ చట్రం నుండే ఏ సామాజిక అంశాన్నైనా విశ్లేషించాడు. అది దళిత బహుజనుల పట్ల విప్లవోద్యమం తీసుకున్న వైఖరి గాని, సమాజంలోని కుల సంబంధాలు గాని, రాయలసీమ ఫ్యాక్షనలిజం గాని, శాంతి చర్చలు గాని - ఏ అంశంలోనైనా తాను ఉపయోగించే కొలమానంలో సాధ్యమైనంత వరకు తేడా లేకుండా జాగ్రత్తలు తీసుకున్నాడు. అందుకే ఆయన విశ్లేషణలో ఎక్కువ వైరుధ్యాలు కనిపించవు. అంతేకాదు, తన దృక్పథంలో లేదా తన ప్రమాణాల్లో మార్పు వచ్చినప్పుడల్లా తాను గతంలో చేసిన విశ్లేషణకు నిజాయతీగా వివరణ ఇచ్చుకొని ఆ మార్పు ఎందుకు వచ్చిందో కూడా వివరిస్తూ తన రచనలను కొనసాగించాడు. నిజానికీ తన ప్రజాజీవన ప్రారంభంలో ఆయన విప్లవోద్యమానికి సంపూర్ణ సైద్ధాంతిక, నైతిక మద్దతును అందించాడు. పౌరహక్కుల ఉద్యమంలో భాగంగా నిజనిర్ధారణలకు ఎంత ప్రాణాపాయం ఉన్నా వెళ్లాడు. కొన్ని సందర్భాల్లో చాలా సాహసోపేతంగా కూడ వెళ్లాడు. అయితే ఆ నిజాలను సేకరించే క్రమంలోనే

విప్లవోద్యమ పరిమితులను, వాళ్ల చర్యలను, నిర్ణయాలను, పద్ధతులను కూడా ఆయన పరిశీలించాడనేది మాలో చాలామందిమి గమనించలేదు. రాజ్యం చేసే దుర్మార్గానికి సంబంధించిన వాస్తవాలను ఎంతో సమగ్రంగా వివరించే బాలగోపాల్ వాటితో పాటు ఉద్యమాలు చేస్తున్న లేదా చేస్తున్నారనుకున్న పొరపాట్లను కూడా రికార్డు చేయడం నాలాంటి వాళ్లకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. 'చీకటి కోణాలు' వ్యాసంలో ఆయన ఇచ్చిన ఉదాహరణలు కేవలం తన మైండ్‌లోనే జ్ఞాపకం పెట్టుకున్నాడా లేక ఆ వివరాలను తన డైరీలో రాసుకున్నాడా అనేది తెలుసుకోవలసిన అంశమే.

విప్లవోద్యమం నుండి బయటకు వచ్చి సరెండరైన కొందరు ముఖ్యులు చేసిన దుర్మార్గాలు, అక్రమాలు, హత్యలు బాలగోపాల్‌కు దిగ్భ్రాంతినే కాదు చాలా ఆందోళనను కలిగించాయి. ప్రధాన స్రవంతిలో దుర్మార్గులు, గూండాలు, హంతకులు ఎప్పుడూ ఉంటారు. వాళ్ళు చేసే నేరాలు చేస్తూనే ఉంటారు. వారందరు కూడా ఈ సామాజిక నిర్మాణం నుండే పుట్టుకువస్తారు. నేరమయమైన అటువంటి సమాజం పట్ల కలిగే విముఖతే విప్లవోద్యమాలకు బీజాలు వేసి మనుషులను ప్రత్యామ్నాయ సమాజ నిర్మాణానికి సిద్ధం చేస్తుంది. ఈ నేరాలు కేవలం కొందరు వ్యక్తులు ఎన్నుకున్న మార్గం మాత్రమే కాదని, వాటి వేళ్లు సామాజిక ఆర్థిక నిర్మాణంలో ఉంటాయని, ఆ నిర్మాణాన్ని మౌలికంగా మారిస్తే తప్ప నేర రహిత సమాజం సాధ్యం కాదని, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఇది వర్గ సమాజ లక్షణమని, వర్గరహిత సమాజమే ఇప్పుడు మనం ఎదుర్కొంటున్న చాలా సవాళ్లకు జవాబు అని విప్లవకారులు విశ్వసిస్తారు. ఆ సంపూర్ణ విశ్వాసంతోనే వారు తమ ప్రాణాలను పణంగా పెట్టి పోరాటానికి పూనుకుంటారు. అలా ఉద్యమాలలోకి వెళ్లిన కొందరు భిన్న కారణాల వలన తిరిగి 'ప్రధాన స్రవంతి'లోకి వచ్చినపుడు, బయటే ఉండి నేరాలకు పాల్పడుతున్న వారికంటే క్రూరంగా మారడం, చాలా సునాయాసంగా మనుషులను ముఖ్యంగా ఉద్యమాలలో భాగస్వాములై నిజాయితీతో బ్రతుకుతున్న వాళ్లను, సమాజం పట్ల బాధ్యతతో ప్రవర్తిస్తున్న వాళ్లను హత్య చేయడం, సమాజాన్ని టెర్రరైజ్ చేయడం ఎలా అర్థం చేసుకోవాలన్న ప్రశ్న అందరినీ వేధించినట్లే బాలగోపాల్‌ను కూడా వేధించింది. సరెండరైన వాళ్లు ఇలా మారడానికి బయట సమాజం, రాజ్యం కారణమని మనందరికీ తెలిసినా, విప్లవోద్యమ చైతన్యీకరణ ప్రక్రియలో ఏమైనా లోటుపాట్లున్నాయా అన్న ప్రశ్నను బాలగోపాల్ మన ముందుకు తెచ్చాడు. సుక్మా జిల్లా కలెక్టర్‌ను మావోయిస్టు పార్టీ అదుపులోకి తీసుకున్నప్పుడు

బస్తర్‌లోని ఒక ప్రధాన విప్లవోద్యమ నాయకుడిని నేను ఈ ప్రశ్న అడిగితే "సరెండరైన వాళ్లను అమానుషంగా మార్చడంలో పోలీసు యంత్రాంగం కృతకృత్యులయ్యింది" అన్నాడు. వాళ్లు అంత అమానుషంగా మారితే తప్ప పోలీసులకు సంతృప్తి ఉండదని కూడా అన్నాడు. ఈ జవాబు బాలగోపాల్‌ను సంతృప్తి పరిచేదో లేదో నాకు తెలియదు కాని ఈ సమస్యను చాలా లోతుగా పరిశీలించవలసిన అవసరం విప్లవోద్యమానికుందని మాత్రం బాలగోపాల్ భావించాడు.

మొత్తం బాలగోపాల్ ఆలోచన, ఆచరణ క్రమంలో లేదా ఏ అంశాన్నైనా చర్చకు పెట్టినపుడు రాజ్యం లేదా పోలీసు యంత్రాంగం పట్ల ఏ సందర్భంలోను ఆయనకు సదభిప్రాయం లేదనేది స్పష్టమే. ఇంగ్లీషులో బెనిఫిట్ ఆఫ్ డౌట్ అంటామే, అలాంటిది సైతం ఎక్కడా కనిపించదు. విప్లవోద్యమాల మీద విమర్శ పెట్టినప్పుడు ఒక రకమైన కన్‌సర్న్ కనిపిస్తుంది కాని రాజ్యం మీద, పోలీసుల మీద పెట్టే విమర్శ మాత్రం నిష్కర్షగా, నిర్భయంగా ఉండేది. పోలీసు ఉన్నతాధికారులను సైతం పేరుపేరునా ఎండగట్టడం, ప్రజల ఎదుట వాళ్లను దోషులుగా నిలబెట్టడం బాలగోపాల్ చేసిన కృషిలో చాలా గొప్పది. అందుకే పోలీసులకు బాలగోపాల్ అంటే విపరీతమైన ఆగ్రహం ఉండేది. ఆ ఆగ్రహం వల్లే ఆయన మీద భౌతిక దాడులు చేయడమే కాక ఆయనను అంతం చేయాలని కూడా చూశారు. ఐదుగురు పౌరహక్కుల సంఘం నాయకుల్ని ఆ విధంగా అంతం చేశారు కూడా. బాలగోపాల్ విషయంలోనూ మా అందరికీ ఆ భయం ఉండేది. కాని ఆయనకు మాత్రం పూర్తి సంసిద్ధత ఉండేది. మేధోపరమైన సాహసమే కాక భౌతికపరమైన మొండి ధైర్యం కూడా ఉండేది. పులి బోనులో తల పెట్టడం ఆయనకే సాధ్యమయింది. ఈ మొత్తం వ్యాసాలలో ఆయన రాజ్యాన్ని గురించి ఎక్కడా ఒక మంచిమాట అన్నట్లు కనిపించదు. అది ఆయన పౌరహక్కుల భావన నుండి వచ్చిన రాజీలేని అవగాహన.

ఈ పుస్తకంలోని మరో రెండు అంశాల గురించి కూడా ప్రస్తావించడం అవసరం. ఒకటి, కులపరమైన సంబంధాలు; రెండు, శాంతి చర్చలు. కులపరమైన సంబంధాలు ఉపరితల సమస్యగా చూడకూడదనేది బాలగోపాల్ దృక్పథంలో ఒక ప్రధాన అంశం. ఈ సంబంధాలు మారడం సమాజ ప్రగతికి చాలా అవసరమని ఆయన పలు సందర్భాల్లో మాట్లాడడమే కాక చాలా విస్తృతంగా ఆ అంశాన్ని గురించి వివరించి, విశ్లేషించాడు. ఈ సంబంధాలను మార్చడంలో సాయుధ పోరాటం ఎలాంటి పాత్ర నిర్వహిస్తుంది అన్న ప్రశ్న అడుగుతూ దీనికి సాంస్కృతిక

పరమైన కృషి చాలా పెద్దఎత్తున అవసరమని ఆయన భావించాడు. శాంతి చర్చల మీద ఆయన ప్రతిస్పందన విమర్శనాత్మకంగా ప్రారంభమైనా క్రమంగా అది మారుతూ వచ్చింది. విప్లవోద్యమం రాజ్యంతో ఏం చర్చిస్తుంది, విప్లవమంటేనే సమగ్ర మార్పు అయినప్పుడు రాజీతో కూడిన విప్లవం ఎలా సాధ్యం అనే ప్రశ్నతో ప్రారంభమై, శాంతి చర్చలలో ఆసక్తిని పెంచుకుంటూ ఈ చర్చల నుండి మనం ఏం ఆశించవచ్చో, ఏ అంశాలు చర్చిస్తే ప్రయోజనముంటుందో సూచిస్తూ వ్యాసాలు రాసాడు. పర్సనల్‌గా కలిసినపుడు చాలా సలహాలు సూచనలు చేసేవాడు. చర్చల వలన ఆయుధ పాత్ర తగ్గి, ప్రజల జీవన్మరణ సమస్యలు చర్చకు వస్తే ప్రయోజనంగా ఉంటుందని చాలా ఆశాజనకమైన వ్యాసాలు రాసాడు. నిజానికి శాంతిచర్చలలో తమ తరపున పాల్గొనే మధ్యవర్తులలో ఒకరుగా బాలగోపాల్ పేరును కూడా పీపుల్స్ వార్ పార్టీ సూచించింది. బాలగోపాల్ ఎంత విమర్శ పెట్టినా, పార్టీ చర్యల పట్ల ఎంత నిష్కర్షగా మాట్లాడినా ఆయన నిజాయితీ పట్ల, నిబద్ధత పట్ల ఆ పార్టీకుండే గౌరవం మధ్యవర్తిగా ఆయనను ఎన్నుకొనడంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. అయితే వారి సూచనని బాలగోపాల్ చాలా సున్నితంగానే తిరస్కరించాడు. బాలగోపాల్ మరణం తర్వాత మావోయిస్టు పార్టీ ఇచ్చిన నివాళిలో కూడా ఆయన పట్ల ఆ గౌరవమే కనిపించింది. ఆయనలో పోస్ట్‌మాడర్న్ ధోరణి పెరిగింది అన్న ఒక్క వ్యాఖ్య మినహాయిస్తే బాలగోపాల్ నిర్వహించిన పాత్ర సామాజిక ప్రయోజకత గురించి, ఆయన ప్రజాస్వామ్య కృషి గురించి నిష్పక్షపాతంగా అంచనావేసి ఆయనకు నివాళి అర్పించింది.

సమాజాన్ని మార్చే బాధ్యత తనమీద వేసుకున్న విప్లవోద్యమం సంయమనాన్ని పాటించాలని, సమాజాన్ని సమగ్రంగా అర్థం చేసుకొని తమ ఆచరణను విలువల పునాదుల మీద నిలపాలని బాలగోపాల్ బలంగా నమ్మాడు. వారు ఏ పొరపాట్లు చేసినా సమాజ ప్రగతి దెబ్బతింటుందన్న ఆందోళన, ఒక కన్‌సర్న్ ఆయన అన్ని రచనల్లో చూడవచ్చు. ఈ వ్యాసాలలో ఆయన విప్లవోద్యమం మీద ఎన్నో విమర్శలు పెట్టి ఉండవచ్చు కాని ఇవి విప్లవోద్యమ వ్యతిరేక వ్యాసాలు కావు. విమర్శ వేరు వ్యతిరేకత వేరు. అందుకే ఆయన 'చీకటి కోణాలు' వ్యాసం చివర్లో రాసిన మాటలు చాలా విలువైనవి. యాభయ్యేళ్ళ నక్సల్బరీ ఉద్యమ సందర్భంలో కూడా గుర్తు చేసుకోదగ్గవి.

*"ముప్పై సంవత్సరాల నక్సల్బరీ అనుభవాన్ని సమీక్షించుకోవడ మంటే విప్లవోద్యమాన్ని అమూర్తంగా ఊహించుకొని చర్చించుకోవడం*

కాదు. ఎం.ఎల్. పార్టీలు ఎంచుకొన్న పంథా, దానిని అమలు చేస్తున్న పద్ధతి వాస్తవంలో ఎట్లాగున్నాయో తెలుసుకోవడం అవసరం. అది సమాజంలో లేవదీసిన కొత్త ఆలోచనలనూ, విలువలనే కాదు, దాని చీకటి కోణాలనూ వాటి సామాజిక పర్యవసానాలనూ కూడా అర్థం చేసుకోవడం అవసరం. నా వ్యాఖ్యలతో అందరూ అంగీకరించకపోవచ్చు. కాని విషయాలను ఉన్నదున్నట్టుగా చూడడం అవసరం. ఇది కేవలం ఆ పార్టీ అవసరం కాదు, వారి అనుయాయుల అవసరం కాదు, ప్రజల అవసరం కూడా. ఎందుకంటే ఎవరు ఒప్పుకున్నా ఒప్పుకోకున్నా నక్సలిజం ఈ రోజు ప్రజాజీవితం పైన బలమైన ప్రభావం ఉన్న రాజకీయ శక్తి కాబట్టి."

**– జి. హరగోపాల్**

పర్‌స్పెక్టివ్స్

# ఇందులో


| | | |
|---|---|---|
| | ఈ పుస్తక ప్రయోజనం ... జి. హరగోపాల్ | 7 |
| 1. | తిరిగి తిరిగొచ్చింది | 17 |
| 2. | పీపుల్స్ ఎన్‌కౌంటర్ | 26 |
| 3. | విప్లవ హింస - హక్కుల దృక్పథం | 39 |
| 4. | తెలంగాణలో వంద గొంతులు వినిపించాలి | 56 |
| 5. | చీకటికోణాలు | 61 |
| 6. | వేంపెంట గురించి ఇంకొంచెం | 150 |
| 7. | ఫ్యాక్షన్లు - ప్రజా ఉద్యమాలు | 154 |
| 8. | ఈ హత్యలు ఆపండి | 161 |
| 9. | ఒక అబ్రహాం కథ | 165 |
| 10. | వీరయ్య మరణం | 169 |
| 11. | నిషేధాల నుండి తెలంగాణకు విముక్తి ఎప్పుడు? | 174 |
| 12. | నియోగి సంస్మరణ | 178 |
| 13. | ప్రాణం 'ఖరీదు' వారికెంతో వీరికీ అంతే | 182 |
| 14. | విషాద వలయం | 187 |
| 15. | చర్చలు ఎవరికి అవసరం? | 191 |
| 16. | లైసెన్స్డ్ హంతకుల ప్రమాదం | 195 |
| 17. | పాత ప్రశ్నలే మరొకసారి | 198 |
| 18. | ఇది మనందరి సమస్య కూడ | 202 |
| 19. | భ్రమలే అయితే వాటి వెంట పరుగులు తీయడం దేనికి? | 206 |

20. రాజకీయ స్వేచ్ఛ పత్రికలకు ఉంటే చాలునా? 210
21. ఇది చేతకాని ప్రభుత్వమా? లేకపోతే నీతిలేని ప్రభుత్వమా? 214
22. ప్రజలు మాత్రమే త్యాగాలెందుకు చేయాలి? 219
23. కరువు, కరువు పనులు, కరువు దాడులు 223
24. పిల్లికి చెలగాటం 227
25. విననివారికి హితోక్తులు 231
26. చర్చలకు కూర్చునే ముందు...
భూమి సమస్యను అధ్యయనం చేయండి 235
27. చర్చల గురించి ఇంకొంచెం... 239
28. స్వరణ్‌జిత్ సేన్‌గారి దువ్వెన 243
29. 'కోవర్టులు' ఆగేనా? 247
30. దంతెవాడ దమనకాండ ఇంకెంత కాలం? 251
31. ఛత్తీస్‌గఢ్: హితవు చెప్పగల బుద్ధిజీవుల కోసం... 259
32. బస్తర్ మారణకాండ ఇప్పట్లో ఆగేనా? 263
33. నక్సలైట్ ఉద్యమం భవిష్యత్తే కాదు...
ప్రజా ఉద్యమాల భవిష్యత్తు ఏమిటి? 267
34. అధికారం, అహంకారం, అవకాశవాదం... 272
35. శ్రీకాకుళ ఉద్యమం: భవిష్యత్‌పై చర్చను రేకెత్తించింది 276
36. నక్సలైట్ ఉద్యమం 279
37. ప్రజాస్వామ్య పునాదులపైనే సోషలిజం 290
38. లాల్‌గఢ్: ఎవరి బాధ్యత ఎంత? 294
39. ఈ వేట ఆపమని నినదిద్దాం 298
40. ప్రజాస్వామికంగానే జవాబు చెప్పండి 302

# తిరిగి తిరిగొచ్చింది

మళ్ళీ మొదలయిన నిర్బంధం మీద ఇది రిపోర్టు కాదు. ఎందరిని చంపారో ఎట్లా చంపారో వివరించే పట్టిక కాదు. రిపోర్టులు రాసుకున్న తరువాత, పట్టికలు తయారుచేసుకున్న తరువాత, ప్రజాస్వామిక వాదులంతా అన్ని విషయాలూ విడమరచి చెప్పినా చివరికి చెన్నారెడ్డి ఇట్లా చేసాడే అని కొంత మనస్తాపం చెందిన తరువాత గడచిన సంవత్సర కాలం చరిత్రను నెమరువేసుకొని ఆలోచించడం అవసరం.

పాలకవర్గాలకు నీతి లేకపోయినా కనీసం ఇంగితం ఉంటుందని ఆశిస్తాం. ప్రజల క్షేమాన్ని కాకపోయినా కనీసం తమ క్షేమాన్నయినా కాంక్షిస్తారని భావిస్తాం. కాని వాళ్లు స్వల్పకాల ప్రయోజనాలే తప్ప దీర్ఘకాల శ్రేయస్సును గురించి ఆలోచించే స్థితిలో లేరని అర్థం చేసుకోవడానికి కొంత కాలం పడుతుంది. పాలక వర్గాలలోని వివిధ ముఠాలను సమానంగా సంతృప్తిపరచడం వాళ్ల ఐక్యతకే అవసరం అని ఏ అణాకాణీ పత్రికా సంపాదకుడయినా చెప్పగలడు. అయితే అధికారానికి వచ్చిన తొమ్మిది నెలల తరువాత కూడ చెన్నారెడ్డి తన ప్రభుత్వంలోని అన్ని లాభదాయకమయిన శాఖలనూ తన దగ్గరే ఉంచుకున్నాడు. ఎక్సైజ్, అడవులు, రెవెన్యూ, హోం - అన్నీ తనవే. జనార్దన రెడ్డినీ శ్రీనివాసులు రెడ్డినీ విడతలు విడతలుగా అవమాన పరుస్తాడు. 'కల్లోలం' ఉందనయినా కరీంనగర్‌ను గుర్తించడు. రాజశేఖరరెడ్డి ఉన్నాడని కసికొద్దీ కడపను గుర్తించడు.

ఇది దోపిడీ రాజ్యం మాత్రమే కాదు. దీర్ఘకాల ప్రాతిపదికగానీ దానికి అవసరమయిన సంయమనంగానీ లేకుండ ఎక్కడికక్కడ ఎంత దొరికితే అంత కబళించే రాజ్యం. తన అంతర్గత క్షేమం గురించి సహితం ముందుచూపు లేని పాలన. ఇక ప్రజా ఉద్యమాల విషయంలో దీనికి ముందుచూపు రమ్మంటే ఎక్కడి నుండి వస్తుంది? అయినా 'కర్మణ్యేవాధికారస్తే' అని నమ్మిన జాతి కాబట్టి చెప్తూనే ఉంటాం. నీ మంచి కోసమే, నీ శాంతిభద్రతల కోసమే, నీ పరిపాలన యోగక్షేమాలను దృష్టిలో పెట్టుకునే చెప్తున్నామని చెప్తాం (వినకపోతే నువ్వే చెడిపోతావని చెప్తాం). మనసులో మట్టుకు వినకపోతే వాడు చెడినా చెడకున్నా ప్రజలు మరొక పర్యాయం హింసకు గురవుతారన్న భయం ఉంటుంది. నిజానికి అందుకోసమే చెప్తాం. నీ మంచి కోసమేనని నచ్చజెప్పి ప్రజలకు మేలు చేద్దామని ఆశిస్తాం. మనం తెలివయిన వాళ్లమనుకుంటే వాడికి మట్టుకు తెలివి లేదా?

'స్వేచ్ఛను దుర్వినియోగం చేశారు' అంటాడు. అందుకని పిల్లవాడు సైకిల్ పాడు చేస్తే తీసేసుకున్నట్టు దాన్ని తీసేసుకున్నాడట. 'మరి నువ్వు సద్వినియోగం చేస్తున్నావా' అని అడగకూడదు. వాడు తన స్వేచ్ఛను పుట్టుకతో పొందాడు కాబోలు! ప్రజలు మాత్రం వాడి నుండి భిక్షగా పొందారు! 'నేను మీటింగ్‌లు పెట్టుకోనిస్తే నన్నే తిడతారా?' అంటాడు. ప్రజలు మాత్రం 'మేము వోట్లు వేస్తే మమ్మల్నే చంపుతావా' అనకూడదు. చంపడం రాజధర్మం. 'నా దగ్గర లైసెన్స్ తీసుకోకుండ తుపాకులు కొంటారా?' అంటాడు. 'మరి నువ్వు మమ్మల్ని చంపేవాళ్లకు లైసెన్స్‌లు ఇస్తావు గానీ మాకు ఇయ్యవు కదా' అని అడగకూడదు. ఆస్తులు ఉండేవాళ్లకు ఆత్మరక్షణ గానీ దిక్కుమాలిన వాళ్లకు కూడనా? 'మీ అవసరాల కోసం మా వాళ్లనుండి డబ్బులు వసూలు చేసుకుంటారా?' అంటాడు. 'మరి మావాళ్ల దగ్గర లేవు కదా' అనకూడదు, 'మీ దగ్గరుండేదంతా మాదే కదా' అని కూడ అనకూడదు. అది అధిక ప్రసంగం అవుతుంది. 'పోనీ కదా అని ఎన్‌కౌంటర్లు ఆపేస్తే మా వాళ్ల భూములు ఆక్రమించి మీ వాళ్లకు పంచుతారా' అంటాడు. 'మరి మా వాళ్ల భూములు కబ్జా చేసుకొని మీలో మీరు పంచుకోవడం లేదా' అని ఎదురుప్రశ్న వేసే అవకాశం మీకుండదు. ఈ లోపల మిమ్మల్ని 'టాడా' కింద జైల్లో పెడతాడు. 'మీరే కోర్టులు పెట్టి న్యాయ నిర్ణేతలూ ధర్మ నిర్దేశకులూ అవుతారా' అంటాడు. 'సమాంతర ప్రభుత్వాలు నడుపుతారా' అంటాడు. 'మీలో ఈ పని చేయని వాళ్లెవరయినా ఉన్నారా' మీరు అని అడగకూడదు. చిత్తూరులో చెంగారెడ్డి, తాడిపత్రిలో దివాకరరెడ్డి, పులివెందులలో రాజశేఖరరెడ్డి, నరసరావుపేటలో కృష్ణారెడ్డి - వీళ్లు నడుపుతున్నవి సమాంతర ప్రభుత్వాలు కావా అని అడగకూడదు.

తాము ధనవంతుల ప్రయోజనాల కోసం చేసే పనులే వాళ్లు పేదవాళ్ల ప్రయోజనాల కోసం చేపడితే అది 'స్వేచ్ఛను దుర్వినియోగం చేయడం' అవుతుంది. అప్పుడు 'స్వేచ్ఛ' అనే మాటకు అర్థం ఏమిటో కూడ మనకు అర్థం అవుతుంది.

వాడికి ఏవో కారణాలు దొరకవని కాదు. ప్రజా ఉద్యమాలు సరళ రేఖలో నడవవు. ప్రజా చైతన్యం ఎగుడుదిగుళ్లు లేకుండా సాఫీగా ఎదగదు. బలవంతులూ, ధనవంతులూ చలాయించే అధికారాన్ని పేదలు చేజిక్కించుకోవడంతో సరిపోదు. దృక్పథంలో విలువలలో సమగ్రమయిన మార్పు రావడానికి కొంత కాలం పడుతుంది. వర్గ దృక్పథం అనేది ఒక్క భూమి సంబంధాలకే కాదు, సమాజంలోని అన్ని విషయాలకూ వర్తిస్తుంది. అన్ని సామాజిక విలువలకూ వర్తిస్తుంది. భూమి విషయంలో వర్గ దృక్పథం ఏర్పడినంత సులభంగా ఇతర విషయాలలో ఏర్పడదు. నేరము, శిక్ష, కుటుంబ సంబంధాలు, లైంగిక నీతి, ప్రజల మధ్య వైరుధ్యాలు - అన్ని విషయాలలోనూ సరయిన ప్రజాస్వామిక దృక్పథం ఏర్పడడం అనేది కొంత ప్రయాస మీద జరుగుతుందిగానీ దానంతటది జరగదు. ఈ సమాజంలో పుట్టి పెరిగిన వారిలో ఈ సమాజం నిర్దేశించిన విలువలే ప్రబలంగా ఉంటాయి. జీవితానుభవంతో కొన్ని విలువలను తిరస్కరించినా మిగిలినవి పోవడానికి చాలా పోరాట అనుభవం, రాజకీయ పరిణతి అవసరం అవుతాయి. అట్టడుగు వర్గాలలో పుట్టిన వారిలో వర్గకసి పెల్లుబికినంత వేగంగా విశాల ప్రజాస్వామిక దృక్పథం ఏర్పడదు. అది ఒక క్రమంలోనే జరగగలదు.

అంతేకాదు. శతాబ్దాలుగా అణచివేతకు గురయి 'అధికారం' నుండి వెలివేయబడ్డవాళ్లు అధికారపీఠం మీద తిరుగుబాటు చేసి దాన్ని బద్దలు గొట్టి కొంతమేరకు అధికారాన్ని చేజిక్కించుకున్నప్పుడు దానితో బాటు అధికార సంస్కృతిని కూడ స్వంతం చేసుకునే ప్రమాదం ఉంది. దీనిని నివారించే ప్రయత్నం ప్రజా ఉద్యమాలలో ఒక ముఖ్యమయిన అంతర్గత పోరాటం.

అధికారానికి కొన్ని సంకేతాలుంటాయి. ఆ సంకేతాలే అధికారాన్ని సూచిస్తాయి. సంకేతమే అధికారం అనుకునేంతగా అవి ప్రామాణికతను పొందుతాయి. ఏ అధికారమయినా ఒక చారిత్రక క్రమంలో ఏర్పడుతుంది కాబట్టి ఆ చారిత్రక క్రమంలో పుట్టిన ఉన్నత విలువలూ లక్షణాలూ ఆ అధికార సంస్కృతిలో చోటు చేసుకుంటాయి. వాటితో బాటు అధికారం అనే దానికి సర్వత్రా ఉండే అణచివేత లక్షణం, ఒక్కొక్క అధికార రూపానికి ప్రత్యేకంగా ఉండే నీచమయిన లక్షణాలు కూడ ఆ సంస్కృతిలో ఉంటాయి. అయితే సాధారణంగా

అధికార సంస్కృతిలోని ఉన్నత విలువలు కాక నీచమయిన విలువలే దానికి సంకేతాలవుతాయి. ఆధిపత్యం అనేది మౌలికంగా అప్రజాస్వామికం కావడం దీనికి కారణం కావచ్చు. రాజ్యాధికారం అనే దానిలో ప్రజా సంక్షేమానికి సంబంధించిన ఎన్ని విలువలున్నా బలప్రయోగమే దానికి సంకేతం అవుతుంది, మిలిటరీ యూనిఫారమే దానికి సూచిక అవుతుంది. మగపెత్తనపు విలువ అయిన 'మగతనం' అనేదానికి ధైర్య సాహసాలకంటే మొరటుదనమూ తిరుగుబోతుతనమూ ఎక్కువగా ప్రమాణాలవుతాయి. బ్రాహ్మణీకం ప్రథమ పురుషార్థాన్ని గురించి ఎంత మాట్లాడినా ఎదుటివారిని నీచంగా చూసే అహంభావమూ శుష్కపాండిత్యమూ దాని ప్రధాన లక్షణాలవుతాయి. ఫ్యూడల్ దొరతనం ఎంత కళాపోషణ చేసినా, నా మాటకు ఎదురులేదనే నియంతృత్వ వైఖరే దానికి సంకేతం అవుతుంది.

అణచివేతకు వ్యతిరేకంగా తిరగబడేవాళ్లు ఆధిపత్యాన్ని బద్దలుకొడుతూ, అదే సమయంలో ఆధిపత్యానికి ఉండే ఈ సంకేతాలను తరచుగా స్వంతం చేసుకుంటారు. వాళ్ల మనసులలో అదే విజయానికి చిహ్నం అవుతుంది, ప్రమాణం అవుతుంది. ఒక అందమయిన కట్టడంగా తప్ప ఇతరత్రా విలువలేని ఎర్రకోట చారిత్రక కారణాలవల్ల భారతదేశంలో రాజ్యాధికారానికి సంకేతం అయింది. ఆ ఎర్రకోటను స్వంతం చేసుకొని దానిమీద తమ స్వంత జెండా ఎగరవేయడం భారత రాజ్యాధికారం మీద విజయానికి చిహ్నంగా కమ్యూనిస్టుల నుండి ఎన్టీ రామారావు దాక తమ ప్రచార సాహిత్యంలో రాస్తూ ఉన్నారు. ఇది నిరపాయకరమయిన ఉదాహరణే గానీ, ఆ సంకేతం ఒక దుర్మార్గపు ఆచారమో విలువో అయినప్పుడు అది ప్రమాదకరంగా పరిణమించగలదు. ఈ ప్రమాదాన్ని గుర్తించడం, నివారించడం అవసరం. ప్రజాకోర్టులలోని నేర విచారణ పద్ధతులు, అక్కడ వాళ్ళు వేసే శిక్షలు భూస్వాముల పంచాయితీల నమూనాలో ఉన్నాయని కొన్ని ప్రాంతాల నుండి వస్తూన్న విమర్శను ఈ దృష్టితో సీరియస్‌గా పరిగణించి సవరించుకోవడం తప్పనిసరి కర్తవ్యం. ఇది ప్రజా ఉద్యమాల అంతర్గత సమస్య. ఇవి ఉద్యమ క్రమంలో పరిష్కారం కావలసిన పొరబాట్లు. చెన్నారెడ్డికి మట్టుకు ఇదంతా 'దుర్వినియోగం' అనే ప్రచారానికి మందుగుండుగా ఉపయోగపడుతుంది. ఉపయోగిస్తాడు.

ఏ ప్రచారమయినా చేసేవాడి కంటే మోసేవాళ్ల మీద, వినేవాళ్ల మీద ఎక్కువగా ఆధారపడి ఉంటుంది. మోయడానికి తగినంత మంది సిద్ధంగా ఉంటేనే చేసే ప్రచారం అనాయాసంగా విజయవంతం అవుతుంది. ఎంతమంది సిద్ధంగా ఉన్నారో గత మూడు నాలుగు నెలల సంఘటనలు రుజువు చేశాయి. పాలక

వర్గాల ప్రయోజనాలను సిద్ధాంతీకరించే ప్రచారాన్ని తమ స్వంత పనిగా భావించి మోసుకు వెళ్లేవాళ్లు సమాజంలో చాలామంది ఉంటారు. ప్రొఫెసర్లు, పత్రికా విలేకర్లు, సంపాదకులు, కథకులు, సినిమా స్క్రిప్ట్ రచయితలు, రాజకీయపార్టీల ప్రచారకులు - ఇటువంటి మేధావులు సమాజంలో అసంఖ్యాకంగా ఉంటారు. ఇక వినే వాళ్లంటారా, ఈ మేధావులు చెప్పేదంతా నిజమేనని తరతరాలుగా నమ్ముతున్న వాళ్లు కొందరు, తమ స్వంత ప్రయోజనాల దృష్ట్యా నమ్మేవాళ్లు కొందరు, ప్రజా ఉద్యమాల ఫలితంగా సాంప్రదాయిక సామాజిక విలువలు తలక్రిందులు కావడాన్ని సహించలేని వాళ్లు కొందరు, తమలోని నిరాశా దౌర్బల్యం వల్ల దుష్ప్రచారాన్నే త్వరగా నమ్మేవాళ్లు కొందరు - మొత్తానికి ప్రజా ఉద్యమాలకు వ్యతిరేకంగా జరిగే ప్రచారాన్ని నమ్మడానికి సిద్ధపడేవాళ్లు చాలామందే ఉంటారు. అది శరవేగంగా సమాజంలో పాకిపోతుంది. మౌలికమయిన సమస్యలను లేవదీసే సామాజిక ఉద్యమమేదయినా మన జీవితాన్ని అనేక విధాల కుదిపేసి, మనల్ని రకరకాల మానసిక సామాజిక ఇబ్బందులకు గురిచేస్తుంది. అందుకే పాలకులలో ఎంతటి అవినీతినయినా, అక్రమ ప్రవర్తననయినా క్షమించే వాళ్లం ఉద్యమాలలో దొర్లే చిన్న పొరబాట్లను సహితం క్షమించం. వ్యవస్థ సుస్థిరతకూ మన మానసిక శాంతికీ లంకె వుంది. వ్యవస్థను కాపాడే శక్తులలో ఇది ఒకటి. భూస్వాముల పంచాయితీలలోనూ, పోలీసుల నేర విచారణలోనూ ఎన్నో అన్యాయాలు నిత్యం చూస్తూ ఉంటాము. అవి అన్యాయాలేనని ఒప్పుకున్నా అవి వ్యవస్థలో భాగం కాబట్టి మనకు పెద్దగా ఆందోళన కలిగించవు. దళిత వర్గాల వాళ్లు, అందులోనూ ఇప్పుడిప్పుడే యుక్తవయస్కులవుతున్న వాళ్లు పంచాయితీలు నిర్వహించడం మన సాంస్కృతిక విలువలనే తలక్రిందులు చేసే విషయం కాబట్టి ఆ పంచాయితీలు పూర్తిగా సవ్యంగా ఉంటే తప్ప సహించం. విప్లవకారుల మీద చాలా సత్ప్రవర్తనాభారం పెడతాం. విప్లవం అంటే మనకు ఉండే మానసిక అసహనానికి ఇది తార్కాణం. రాజకీయ సంసిద్ధత ఉండేవాళ్లలోనూ ఈ మానసిక అసహనం చాలా ఉంటుంది. ప్రజాకోర్టుల వల్ల పెత్తనాన్నీ ప్రాబల్యాన్నీ ఆదాయాన్నీ కోల్పోతున్న భూస్వాములూ రాజకీయనాయకులూ పోలీసులూ దీనిని ఉపయోగించుకొని తమ దుష్ప్రచారాన్ని ముందుకు తీసుకుపోతారు.

నిజామాబాద్ జిల్లా మదనపల్లిలో ఎస్.పి రఘువీర్ ప్రసాద్ మీనా ఆధ్వర్యంలో 1990 జూన్ 11 తెల్లవారుజామున ప్రసాద్, నరసమ్మ, స్వామి అనే ముగ్గురు హతమార్చబడ్డారు. అయ్యో పాపం అని ఎవరైనా అనే లోపలే ప్రసాద్

ప్రజాకోర్టులు నిర్వహించిన తీరును మీనా ప్రచారంలో పెడతాడు. అతను ప్రయోగించిన హింసా పద్ధతులను అభివర్ణిస్తాడు. పత్రికలు దీనినంతా రాస్తాయి. ప్రసాద్‌ను చంపేయగానే పల్లెలన్నీ హాయిగా ఊపిరి పీల్చుకుంటున్నాయని రాస్తాయి. అందరూ దాన్ని చదివి స్వేచ్ఛను ఇంతగా దుర్వినియోగం చేస్తే 'ఎన్‌కౌంటర్లు' జరగక ఏమవుతుందని పెదవి చప్పరిస్తారు. కానీ నరసమ్మనూ స్వామినీ ఎందుకు చంపావని ఎవ్వరూ మీనాను అడగరు. అసలు ఒక పోలీస్ అధికారి ఒక వ్యక్తిని చంపేసి, 'ఇప్పుడు ప్రజలంతా హాయిగా గాలి పీల్చుకుంటున్నారు' అని ప్రకటిస్తే దానిని ప్రచురించడమే ఘోరమయితే, మరొక ఇద్దరిని ఎందుకు చంపావని ఎవ్వరూ అడగలేకపోవడం దానికి పదిరెట్లు ఘోరం. నరసమ్మ గురించి ఎవరూ చెడుగా ఏమీ చెప్పడం లేదు. స్వామి గురించి అయితే ఇంకా నాలుగు మంచి మాటలే చెప్తారు. ప్రసాదు గురించి కూడ. ప్రసాదు అదే ఊళ్లో భూస్వామి భూమిలోని కలప కొట్టించి ఊరందరికీ పంచాడంట. భూస్వామి గోదాములోని ధాన్యాన్ని కూడ ఊరందరికీ పంచాడంట. అది విప్లవకార్యక్రమం కాదని విమర్శించే వాళ్లు ఉంటారుగానీ 'స్వేచ్ఛను దుర్వినియోగం చేయడం' అని మీనా కూడ అనలేడు. అయినా ఇదేదీ ప్రచారం కాదు.

ఒకసారి ఆ ప్రచారం చేసిన తరువాత మరొక రెండు ఎన్‌కౌంటర్లు దాకా అదే సరిపోతుంది. తిప్పాపూర్‌లో జూలై 23వ తేదీన అదే రఘువీర్ ప్రసాద్ మీనా స్వయంగా పక్కనుండి యాదగిరి, నర్సాగౌడ్, బాలిరెడ్డి, గాలిరెడ్డి అనే నలుగురిని పట్టపగలు ఇళ్లనుండి బయటికి లాగి కాల్చేసాడు. అందులో నర్సాగౌడ్ 16 సంవత్సరాల పసివాడు. పొద్దున్నే పోలీసులు గ్రామాన్ని చుట్టుముట్టి ఇళ్లన్నిటికీ గొళ్లెం పెట్టి రోడ్లోకి వచ్చిన వాళ్లను ఊరి మధ్య కూర్చోబెట్టి జీపుకు మైకు కట్టి 8 మంది పేర్లు ప్రకటిస్తూ వాళ్లందరినీ లొంగిపొమ్మంటూ ప్రకటన చేసారు. పశువుల కొట్టంలో దాక్కున్న బాలిరెడ్డినీ, బాలిరెడ్డిని ఎందుకు అరెస్టు చేశారని అడగడానికి రోడ్లోకి వచ్చిన అన్న గాలిరెడ్డినీ, రోడ్లోనే దొరికిన నర్సాగౌడ్‌నూ పశువుల కొట్టంలోనే ఊరందరూ వింటూండగానే కాల్చేసారు. మిగిలిన వాళ్ల కోసం ఇల్లిల్లూ వెతికారు. దొరికితే చంపేస్తారని భయపడి గడ్డివాములో దాక్కున్న యాదగిరిని పట్టుకొని గడ్డిలోనే కాల్చేశారు. ఆగస్ట్ 10వ తేదీన మెదక్ జిల్లా నాగాపురానికి చెందిన గద్దె సిద్ధయ్యనూ మన్నె యాదగిరినీ నిజామాబాద్ జిల్లా వెల్లుట్లలోని పోలీసు క్యాంపు దగ్గర కాల్చేశారు. పోలీసు క్యాంపుమీద వాళ్లు దాడి చేయడానికి సిద్ధమవుతుండగా ఎన్‌కౌంటర్ జరిగిందని అన్నారుగానీ వాళ్లు చూపిస్తున్న స్థలం నుండి బాంబు విసిరితే చెట్లకో తీగలకో తప్ప క్యాంపుకు తగలదు.

వీళ్లందరినీ ఎందుకు చంపవలసి వచ్చిందో మీనా చెప్పలేదు. వాళ్లు చేసిన 'దుర్వినియోగం' ఏమీ లేదు. ఉండనక్కరలేదు కూడ. అప్పటికే పత్రికలు ప్రజాకోర్టులలో జరిగిన తప్పులను తమ 'బాధ్యత'గా ప్రచారంలో పెట్టడం మొదలుపెట్టాయి. ఆ తప్పులు జరిగిన ఊళ్లకూ ఎన్‌కౌంటర్లు జరిగిన ఊళ్లకూ సంబంధం ఏమీ ఉండనక్కరలేదు. అదే ఊళ్లలో ప్రజాకోర్టులలో ప్రజలకు న్యాయమూ జరిగి ఉండవచ్చును. అదంతా అనవసరం. ఇప్పుడిక నిజామాబాద్‌లో 'ఎన్‌కౌంటర్ల'కు అనుకూలమయిన భావ వాతావరణం ఏర్పడిపోయింది.

అనుకూలమయిన భావ వాతావరణం ఏర్పడకపోతే 'ఎన్‌కౌంటర్లు' చేయలేరని కాదు. ధర్మవరం దగ్గర కేశనాయక్‌నూ గోదావరిఖనిలో పిట్టల సత్తయ్యనూ ప్రత్యేకమయిన 'కారణం' ఏమీ లేకుండానే కాల్చేశారు. కేశనాయక్‌ను మే 8వ తేదీన ధర్మవరం ఎస్.ఐ ఓబులనాయనిపల్లి సమీపంలోని గుట్టమీదికి తరిమి కాల్పులు జరిపాడు. పిట్టల సత్తయ్యను గోదావరిఖనిలో తెల్లబట్టల పోలీసులు సాయంకాలం నమాజు సమయంలో రోడ్డు మీదే తరిమి కాల్చారు. ఈ రెండు హత్యలకూ 'ఆత్మరక్షణ' కథ మినహా వేరే నైతిక సమర్థన ఇవ్వాలని పోలీసులు ప్రయత్నం కూడ చేయలేదు. అక్కడ రాడికల్ కేశనాయక్‌కూ ఇక్కడ జన రక్షణ సమితి పిట్టల సత్తయ్యకూ మంచి పనులు చేసారన్న పేరే తప్ప చెడు చేసారన్న అభియోగం లేదు.

'ఆత్మరక్షణ' కథ కూడ అనవసరం అనుకున్న చోట విప్లవ గ్రూపుల మధ్య ఉన్న అవాంఛనీయమయిన కలహాలను వాడుకోవడానికి సహితం వెనకాడలేదు. ఈ పరస్పర దాడుల వలన ప్రజలకు నష్టంగానీ చెన్నారెడ్డి కొచ్చిన కష్టమేమిటో తెలీదు. ఏమీ లేకపోయినా వాడుకుంటూ ఉన్నాడు. మేము చంపడం మానేస్తే వాళ్లే చంపుకుంటున్నారు చూడండి అని హేళన చేసాడు. అంతటితో ఊరుకోక రెండు హత్యలను ఆ పేరుతో కప్పి పెట్టాలని చూసారు. అంతిరెడ్డి వరంగల్ జిల్లా ములుగు అడవి ప్రాంతంలో గిరిజనులకు రెండు దశాబ్దాలకు పైగా పరిచయం ఉన్న కమ్యూనిస్టు నాయకుడు. అటువంటి వ్యక్తిని హైదరాబాదులో జూన్ 6వ తేదీ రాత్రి అపహరించి 7వ తేదీన చంపేసి 9 ఉదయం కరీంనగర్‌లో పి.వి. నరసింహారావు స్వగ్రామమయిన వంగర గ్రామ శివారులో పారేసి, కొద్దిసేపు 'గుర్తు తెలియని శవం' అనీ, కొద్దిసేపు 'గ్రూపు తగాదాల్లో వేరే గ్రూపు వాళ్లు చంపి ఉంటారు' అనీ ప్రచారం చేశారు. అదే ములుగు దగ్గరున్న లక్ష్మీదేవిపేటలో ఆగస్ట్ 6 రాత్రి రవీందర్ రెడ్డి అనే పి.డి.యస్.యు విద్యార్థి సంఘం బాధ్యుడిని ఇంట్లో నుండి

నిద్రలేపి ఊరి బయటకు తీసుకుపోయి కాల్చేశారు. ములుగు సి.ఐ ప్రభాకరబాబు ఈ హంతక బృందానికి నాయకత్వం వహించాడని నమ్మడానికి ఆధారాలున్నాయి. అయినా జిల్లా ఎస్.పి నాగరాజు పొద్దున్నే వచ్చి 'ఫణిబాగ్చి గ్రూపువాళ్లు చంపి ఉంటారు' అని చెప్పి వెళ్లిపోయాడు.

'దుర్వినియోగం' అనే వాదనకు ప్రజాకోర్టులలో జరిగే బలప్రయోగం ఒక్కటేకాక భూస్వాముల మిగులు భూముల ఆక్రమణను కూడ ఒక సాకుగా వాడుకుంటూ ఉంది ప్రభుత్వం. వారిపై 'టాడా'ను విస్తృతంగా ప్రయోగిస్తూ ఉంది. ప్రభుత్వమే ఎన్నో ఏళ్ల క్రితం పంచుతానని చెప్పి చట్టాలు చేసి అమలు చేయక వదిలివేయగా ఆ పని ఇప్పుడు ప్రజలే చేసుకుంటుంటే దానిని టెర్రరిస్టు చర్యగా వర్ణించి వేల సంఖ్యలో గ్రామీణ పేదలనూ గిరిజనులనూ 'టాడా' కింద జైలుకు పంపటమే కాక, దీనిని కూడ 'దుర్వినియోగం' అనే పేరుమీద విజయవంతంగా సమర్థించుకో గలుగుతున్నారంటే వ్యవస్థకుండే ప్రచారబలం ఎంతటిదో అర్థం అవుతుంది. ప్రభుత్వం చేపట్టే చర్యలకు అనుకూలంగానయినా వ్యతిరేకంగానయినా ఒక భావ వాతావరణాన్ని కల్పించే కర్తవ్యాన్ని నిర్వర్తించే పట్టణ ప్రాంత మేధావి వర్గానికి గ్రామీణ భూస్వామ్య ధనిక రైతు వర్గంతో ఎంత సన్నిహిత సంబంధం ఉందంటే భూముల ఆక్రమణ న్యాయమయిన పోరాటమనీ, దాని మీద 'టాడా' ప్రయోగించడం దుర్మార్గమనీ చెప్పేవారు ఒక్కరూ మిగలలేదు. అక్కడక్కడ అత్యుత్సాహంతో భూస్వాములవేకాక మధ్యతరగతి రైతుల భూములను కూడ ఆక్రమించుకోవడం వల్ల కొంతా, భూములేకాక ఉద్యోగాలూ, వ్యాపారాలూ కూడ ఉన్నవాళ్లు భూములను మాత్రమే చూపించి తమను తాము మధ్యతరగతి రైతులుగా చలామణీ చేసుకునే అవకాశం ఉండడం వల్ల కొంతా 'దుర్వినియోగం' అనే వాదనకు తార్కాణాలు కొన్ని దొరికాయి. అయినా ఈ వాదనను సహితం దిగమింగి నిర్బంధాన్ని ఆమోదించడానికి సమాజం సిద్ధంగా ఉందంటే భూసమస్యను శాంతియుతంగా పరిష్కరించడం ఎంత అసాధ్యమో అర్థం అవుతుంది.

ప్రజా ఉద్యమాలు ప్రభుత్వాలకు సమస్యలుగా కనిపిస్తాయి. ఆ విధంగానే 'నక్సలైట్ సమస్య' అనే మాట పుట్టింది. సమస్యగా గుర్తించిన తరువాత ఇక దానిని పరిష్కరించాలి. అణచివేతే ఏకైక పరిష్కారంగా మారి ఇరవై ఏళ్లు - వెంగళరావు నుండి ఎన్టీ రామారావు దాకా - ప్రయత్నించారు. ఆ వ్యూహం ఉచ్చుగా మారి వాళ్ల మెడకే బిగుసుకునే సరికి ప్రత్యామ్నాయం కోసం అన్వేషణ ప్రారంభించారు. తమ మంచి కోసమే ప్రారంభించిన ఈ ప్రయత్నాన్నయినా

నిజాయితీగా కొనసాగిస్తారేమోనని ఆశించిన వాళ్లకు నిరాశే ఎదురయింది. 'చట్ట సమ్మతమయిన కార్యక్రమాలను అనుమతించడం, చట్ట వ్యతిరేకమయిన వాటిని న్యాయ సమ్మతంగా నిరోధించడం, గ్రామీణ పేదల జీవితాలను బాగుపరిచే పథకాలను చేపట్టడం' అనే త్రిసూత్ర పథకాన్ని తన విధానంగా చెన్నారెడ్డి ప్రకటించాడు. కాని ఆ త్రిసూత్రాలలో ఒక్కదానినీ అమలు చేయడం లేదు. చట్టసమ్మతమయిన బహిరంగ సభలు, ఊరేగింపులు అటుంచి కోర్టు విచారణలను సహితం జరగనివ్వడం లేదు. సి.ఐ మొగిలయ్య చేతినుండి 'మాయం' అయిన వసంత సుజాతల అదృశ్యం మీద హైకోర్టు ఆదేశించిన విచారణను తుపాకుల ప్రదర్శనతో భగ్నం చేయాలని ప్రయత్నించి, మళ్లీ హైకోర్టు జోక్యంతో విచారణను కరీంనగర్ నుండి హైదరాబాద్‌కు తరలించగా, ఇక లాభం లేదని సాక్ష్యాల సేకరణ కోసం తిరుగుతున్న సుభాష్‌ను ఆగస్ట్ 23 (1990) సాయంత్రం కొలిమికుంటలో అరెస్టు చేసి ఆగస్ట్ 24 ఉదయం కాల్చేశారు.

ఈ అతి తెలివి విధానం ఎక్కడికి దారితీస్తుందని చెన్నారెడ్డి భావిస్తున్నాడో తెలీదు. మళ్లీ పోలీసులూ మంత్రులూ పాతపాటే వినిపిస్తున్నారు. డి.జి.పి రొడ్డం ప్రభాకరరావుగారు ఈ మధ్య ఎక్కడో మాట్లాడుతూ 'ఆరునెలల కాలంలో నక్సలైట్లను అణచివేస్తాం' అన్నాడట. గతంలో ఇదే ప్రగల్భం పలికిన హోం మంత్రులు కొందరు అయ్యప్ప దీక్ష పుచ్చుకుంటే మరికొందరు రిటైర్‌మెంట్ పుచ్చుకున్నారు. ఈ వైఖరి ఫలితంగా రాష్ట్రంలోని పేద ప్రజానీకాన్ని మట్టుకు గత ఇరవై ఏళ్లలో భయంకరమైన హింసకు గురి చేశారు. ఇప్పుడు మరొక రౌండు ఆ పనే చేయాలని చూస్తున్నారు. అయితే గతంలో నడిచినంత సులభంగా ఈసారి ఆ పని జరుగుతుందనుకోవడం మూర్ఖత్వం అవుతుంది. ఏలినవారిలో 'ఇంటెలిజెన్స్' లోపించిందనుకోవాలా, లేకపోతే ఎంతమంది చస్తే ఏంలే అనుకుంటున్నారో?

*సృజన మాసపత్రిక*
*సెప్టెంబర్ 1990*

# పీపుల్స్ ఎన్‌కౌంటర్

'నక్సలైటు బెడద' పాలకవర్గాలు ప్రచారం చేస్తూన్న అవగాహనకే ఒక బెడదయి కూర్చుంది. నిజానికి అసలు బెడద కంటే ఈ బెడదే ఎక్కువయింది. పత్రికలలోనూ, ఇతర వేదికల నుండీ వ్యక్తమవుతున్న ఆందోళనకు మూలం ఇదే. నక్సలైట్ల గురించి ప్రజలకు తాము కలిగించదలచుకున్న అవగాహనను చక్కగా తయారు చేసుకున్నామని వాళ్లు అనుకున్నప్పుడల్లా చరిత్ర రెండడుగులు ముందుకుపోయి తిరిగి కొత్త అవగాహనను రూపొందించవలసిన అగత్యం ఏర్పడుతోంది. ప్రజల దృష్టికి నక్సలైట్లు కేవలం ఒక మిలిటెంట్ పోరాటశక్తిగా కాక ప్రత్యామ్నాయ రాజకీయశక్తిగా కనబడటం ఎక్కువయ్యేకొద్దీ ఈ బెడద మరింత ఎక్కువ అవుతుంది. నక్సలైట్ల గురించి చెడు అభిప్రాయం ప్రచారం చెయ్యాలి, కాని అది విశ్వసనీయంగా ఉండాలి, వారిని ప్రత్యామ్నాయ రాజకీయశక్తిగా చూడడానికి సిద్ధమవుతున్న ప్రజలు నమ్మేటట్లు ఉండాలి.

పాలకవర్గాలు నక్సలైట్ల గురించి ప్రచారం చేస్తున్న అభిప్రాయం కాలక్రమంలో సంకీర్ణమయిన మార్పులకు లోనవుతూ ఉంది. ఇదంతా ప్రయత్నపూర్వకంగా ఒక కమిటీ వేసుకుని చేస్తున్నారని అనుకోకూడదు. అలాగే పాలకవర్గాలకూ విప్లవకారులకూ మధ్యనున్న సంఘర్షణ ఒక మలుపు తిరిగినప్పుడల్లా పూర్తిగా కొత్త చిత్రాన్ని తయారు చేసుకుంటారనీ అనుకోకూడదు. అటువంటిదేం జరగలేదు. అయితే

ఒక్కొక్క దశలో కొన్ని కొత్త అభిప్రాయాలను, వాదనలను రూపొందిస్తున్నారు, ప్రచారం చేస్తున్నారు, మళ్లీ తిరస్కరిస్తున్నారు. ప్రతి దశలోను పాలకవర్గాలు ప్రచారం చేస్తున్న చిత్రంలో ఎంతో కొంత అసంబద్ధత ఉంటూనే ఉంది. పాలకవర్గ భావజాలాన్ని ఎవరూ తీరికూర్చి ప్రయత్న పూర్వకంగా తయారుచేయకపోవడం ఈ అసంబద్ధతకు మూలం కాదు. ఏ భావజాలాన్నీ ఎవరూ అట్లా తయారు చెయ్యరు. అంతమాత్రం చేత అసంబద్ధత భావజాలాల సహజ లక్షణమూ కాదు. అయినా నక్సలైట్ల గురించి పాలకవర్గాలు ప్రచారం చేస్తున్న భావజాలంలో ఎంతో కొంత అసంబద్ధత, సందిగ్ధం ఉన్నాయంటే దానికి రెండు కారణాలున్నాయి. ఒకటి - పాలకవర్గ రాజకీయాలే ఇవ్వాళ అనూహ్యంగా భ్రష్టుపట్టాయి. బీహార్ రాజకీయాల గురించి మామూలుగా ప్రచారంలో ఉండే కథలన్నీ ఇవ్వాళ ఆంధ్రలో జరుగుతున్నాయి. అందువల్ల నక్సలైట్ల హింసాకాండ గురించి వాపోవడం వాళ్లకు ఇప్పుడు పెద్దగా ప్రయోజనకరంగా లేదు. అయినా దానిని మానుకోలేకుండ ఉన్నారు. ఇదొక సందిగ్ధం. రెండు - నక్సలైట్ల రాజకీయాలు ఇవ్వాళ విశాల ప్రజానీకాన్ని ఆకర్షించే స్థితి ఏర్పడుతోంది. ఈ రెండవ మార్పు విప్లవపార్టీలకే పూర్తిగా అర్థమైనట్టు లేదు. అర్థమైతే వాళ్ల నిర్మాణ పద్ధతులలో, పని పద్ధతులలో చాలా మార్పులు రావాల్సి ఉంటుంది. అయితే అది ఇప్పటికి అప్రస్తుతం. కాని ఈ మార్పువల్ల పాలకవర్గాలకూ ప్రజలకూ మధ్యనున్న సంబంధంలోనూ, పాలకవర్గాల అంతర్గత సంబంధాలలోనూ సంక్షోభం ఏర్పడి పాలకవర్గ భావజాలం మీద చాలా ఒత్తిడి పడుతూ ఉంది. దీనివల్ల ప్రయత్నపూర్వకంగానో, కాకుండానో పాలకవర్గ భావజాలాన్ని రూపొందించే మేధావులు, రచయితలు, కళాకారులు, సిద్ధాంతవేత్తల మీద చాలా భారం పడుతూ ఉంది.

ఈ సంక్షోభాల, ఒత్తిడుల ఫలితాన్ని విశ్లేషించడానికి రామోజీరావు 'పీపుల్స్ ఎన్‌కౌంటర్' చక్కగా ఉపయోగపడుతుంది. ఆంధ్రరాష్ట్ర ప్రాంతీయ పాలకవర్గాల ప్రతినిధిగా తన రాజకీయ సైద్ధాంతిక కర్తవ్యాన్ని గురించి కచ్చితమైన అవగాహన ఉన్న వ్యక్తి రామోజీరావు. ఈ వర్గం సున్నితమైన ఏ కర్తవ్యాన్నయినా సులభంగా భ్రష్టు పట్టిస్తుంది కాని రామోజీరావు మటుకు తన కర్తవ్య నిర్వహణలో నేర్పు గల మనిషి. ఈ వర్గం నక్సలైట్ల గురించి ఏమనుకుంటుందో, ప్రజలు ఏమనుకోవాలని ఆశిస్తుందో సంక్లిష్టంగా కలగలిపి ఆయన తీసిన సినిమానే 'పీపుల్స్ ఎన్‌కౌంటర్'. ఇందులో రెండవ విషయమే ప్రత్యక్షంగా కనిపిస్తుంది. వర్గచైతన్యం గల పెత్తందార్లు చేసే రచనల్లోగాని, తీసే సినిమాల్లోగాని తాము ఏమనుకుంటున్నారో చెప్పరు,

మనం ఏమనుకోవాలో చెపుతారు. పీడితవర్గాల కళ మట్టుకే ఎప్పుడూ తన స్వంత అభిప్రాయాన్ని (అది సత్యంగాని, భ్రమగాని) వ్యక్తీకరిస్తుంది. మరొకరకంగా చెప్పాలంటే పెత్తందారీ వర్గాల కళలో నిజాయితీ ఎప్పుడూ ఉండదు. పీడిత వర్గాల కళ భ్రమాజనితమైనా నిజాయితీగా ఉంటుంది.

కళారూపంలో ఒక ఉద్యమాన్ని గురించి దురభిప్రాయాన్ని కలిగించడానికి రెండు మార్గాలుంటాయి. ఒకటి - తప్పుడు పోకడలను, పొరపాట్లను ఏరి వాటినే అసలు సరుకుగా చలామణీ చెయ్యడం. రెండు - పొరపాట్లను పక్కకు పెట్టి అసలు విషయాన్నే తీసుకుని దాని గురించి వ్యతిరేకత కలిగే విధంగా వ్యాఖ్యానించడం. తెలుగు దినపత్రికలలో నక్సలిజాన్ని గురించి జరిగే ప్రచారం మొదటికోవకు చెందింది. ఇందులో రామోజీరావుగారి 'ఈనాడు' ప్రధానపాత్ర వహిస్తూ ఉంది. తప్పుడు అవగాహనతో జరిగిన చర్యలను, అనవసరమైన హింసాకాండకు పాల్పడిన సంఘటనలను ఏరి ఇదే విప్లవం అంటున్నారు. అయితే ఈ సినిమాలో రామోజీరావు రెండవ పద్ధతిని అనుసరించారు. దినపత్రికలలా కాక ఈ సినిమా ప్రత్యక్షంగా ప్రచారం కోసం ఉద్దేశించినది. అందువల్లే ఈ మార్గాన్ని ఎంచుకున్నారని భావించాల్సి వస్తోంది. అయితే ఇదే పోలీసులకు కోపం తెప్పించింది. విప్లవ రాజకీయ ఆచరణలోని చెడును మాత్రమే చూపిస్తే వాళ్లు సంతోషించేవాళ్లు. ఆ పని చేయకుండా విప్లవాన్ని సీరియస్‌గా తీసుకొని రాజకీయ విశ్లేషణ ఇవ్వడం ద్వారా నక్సలైట్లకు అనవసరమైన ప్రతిష్ట కల్పించారని వాళ్లకు కోపం. అయితే వాళ్లకు అర్థంకానిదేమిటంటే ఈ ప్రతిష్ట ఇప్పటికే ప్రజల దృష్టిలో వాళ్లకు ఉంది. ఆ వాస్తవాన్ని గుర్తించడం మాత్రమే రామోజీరావు చేసిన పని. నిజానికి ఆ వాస్తవాన్ని గుర్తించారు కాబట్టే ఆయన ఈ సినిమా తీశారు.

హింసకు, అహింసకు మధ్యనున్న సంఘర్షణ ఈ సినిమాలోని ప్రధాన అంశం. ఒకప్పుడసలు 'నక్సలైటు సమస్య' గురించి పాలకవర్గాలు చేసే చర్చ మొత్తం ఈ ప్రాతిపదిక మీదే నడిచేది. ఆ చర్చలో సహజంగానే అహింస గెలిచేది. మన భారతీయ సంస్కృతికి, మానవత్వ విలువలకు, పార్లమెంటరీ ప్రజాస్వామ్య రాజకీయ సూత్రాలకు అనుగుణమైన మార్గం అహింసేనని వాదించేవారు. ఈ వాదనలో వాస్తవమున్నా లేకపోయినా వాదించడంలో ఒకప్పుడు ఎంతో కొంత నిజాయితీ ఉండేది. ప్రజల అసంతృప్తినీ, తమ అంతర్గత కలహాలనూ ఎదుర్కోవడానికి పెద్దఎత్తున ప్రత్యక్ష హింసాకాండకు పాల్పడవలసిన అవసరం రాదని మన దేశ పాలకవర్గాలవారు ఒకనాడు భావించారు. ఆ రోజులు పోయాయి.

అయినప్పటికీ పాలకవర్గాల ప్రచారకులు హింస, అహింసల చర్చను కొనసాగిస్తూనే ఉన్నారు. వాళ్ల రాజకీయ భ్రష్టత్వం వల్ల ప్రాప్తించిన దివాళాకోరుతనం దీనికి మూలం. అయితే రామోజీరావు ఈ చర్చను ఎట్లాగయినా కాపాడదామని దానికి రెండు అదనపు వాదనలు చేర్చారు. ఈ సినిమాలో అహింసకూ, నిర్మాత చెప్పదలచుకున్న అన్ని విషయాలకూ ప్రతినిధి జ్యోతి అనే డాక్టర్. నక్సలైట్లకు, పోలీసులకు భిన్నంగా ఈమెలో చాలా మానవీయత ఉంది. ఆకర్షణ ఉంది. ప్రేక్షకులను సులభంగా ఆకట్టుకునే వ్యక్తిత్వం ఉంది. జ్యోతి అహింసను నిర్ద్వంద్వంగా సమర్థిస్తుంది. విధి నిర్వహణ పేరిట ప్రాణాలు తీయడాన్ని సహించలేక పోలీసు అధికారి అయిన భర్తను వదిలిపెడుతుంది. ఆదర్శాల పేరిట ప్రాణాలు తీయడాన్ని సహించలేక నక్సలైటు అయిన తమ్ముడితో విభేదిస్తుంది. నిర్మాత హింసాహింసల గురించి తాను చెప్పదలచుకున్న అన్ని వాదనలను జ్యోతి ద్వారా చెప్పిస్తాడు. హింస నైతికంగా తప్పనే సాంప్రదాయక వాదనకు మరి రెండు వాదనలు జోడించాడు.

ఒకటి - న్యాయాన్ని సాధించడానికి హింస అనవసరమనేది. రెండు - హింసవల్ల ప్రజలమీద అనవసరంగా నిర్బంధం వస్తుందనేది. ఇందులో మొదటి వాదన జ్యోతి చేసినప్పుడల్లా ప్రేక్షకులు నవ్వడం ఈ సినిమా చూసినవాళ్లందరికీ ఎదురైన అనుభవం. జ్యోతి తరచుగా ప్రజాస్వామ్యాన్ని గురించి, హింసను గురించి నక్సలైట్లకు ఉపన్యాసాలిస్తుంది. హింసామార్గాన్ని వదిలిపెట్టి, ప్రజలను సమీకరించి, ఎన్నికల్లో నిలబడి అధికారాన్ని సాధించుకొమ్మని సవాలు చేస్తుంది. ఎన్నికల్లో గెలుస్తున్నది ప్రజాసమీకరణ ద్వారా కంటే సారాయి, డబ్బు, గూండా బలగాల సమీకరణ ద్వారా అనేది అందరికీ తెలిసిన వాస్తవం. కాబట్టి ప్రేక్షకులకు నవ్వు రావడంలో ఆశ్చర్యం లేదు. నిజానికి ప్రేక్షకులలో అమాయకులెవరయినా ఉండవచ్చును గాని నిర్మాతకు మాత్రం ఈ విషయం అందరికంటే బాగా తెలుసును. అయినా నమ్మించగలమేమో చూద్దామని తన ప్రయత్నం తాను చేశాడు. మనకు ఓపిక ఉండాలే గాని ప్రజల సమస్యలను ప్రజాస్వామికంగా చట్టబద్ధంగా పరిష్కరించడం సాధ్యమేననీ, ఆ సహనం ప్రజాస్వామ్యానికి మనం చెల్లించే మూల్యమనీ, సహనం లేనివాళ్లే తొందరగా పరిష్కారం దొరకాలని హింసకు పాల్పడతారనీ వాదిస్తాడు.

ఈ వాదనకు నిదర్శనంగా ఒక ఉదంతాన్ని సినిమాలో ప్రవేశపెడతాడు. గిరిజన ప్రాంతంలో నివసించే ఒక భూస్వామి గిరిజనుల భూములను స్వాధీనం

చేసుకోవడానికి ప్రయత్నిస్తాడు. వాళ్ళు ప్రతిఘటించేసరికి ఒక ఎత్తుగడ వేస్తాడు. పులుల అభయారణ్యం కోసం ఆ భూమి కావాలని ప్రభుత్వం నుండి ఒక ఆర్డరు తీసుకొచ్చి గిరిజనులను తొలగించే ప్రయత్నం చేస్తాడు. జ్యోతి నాయకత్వంలో గిరిజనులు శాంతియుతంగా ధర్నా చేస్తారు. పోలీసులు వాళ్ళమీద పడి విపరీతంగా కొడతారు. ఈ దశలో నక్సలైట్లు రంగప్రవేశం చేసి భయంకరమైన మారణా యుధాలతో పోలీసుల మీద దాడి చేసి తరిమేస్తారు. హింసాత్మకమైన ఈ జోక్యాన్ని జ్యోతి నిరసిస్తుంది. దానివల్ల గిరిజనుల మీద నిర్బంధం వస్తుందని వాదిస్తుంది. తాను చట్టబద్ధంగానే గిరిజనుల భూములను కాపాడతానని సవాలు చేస్తుంది. నక్సలైట్లు నవ్వుతారు (ప్రేక్షకులు కూడ నవ్వుతారు). ఆమె మొదటి ప్రయత్నాలకు అవినీతి అవరోధం ఎదురవుతుంది. లంచాలు మేసిన మినిస్టర్లు, అధికారులు అడ్డుపడతారు. ఈ విధంగా ఒక వాస్తవికమైన సమస్యను నిర్మాత ప్రవేశపెట్టాడు. దాని పరిష్కారాన్ని వాస్తవికంగా అన్వేషించి ఉంటే 'నక్సలైటు సమస్య' కొంతమేరకయినా అర్థమై ఉండేది. అయితే నిర్మాత సమస్యను చాలా అవాస్తవికంగా పరిష్కరిస్తాడు. జ్యోతి హైకోర్టులో రిట్ పిటిషన్ వేయగా హైకోర్టు దానికి స్పందించి ఆ ప్రాంతంలో పులులు సంచరించిన దాఖలాలేవీ లేవు కాబట్టి అభయారణ్యం కోసం ఆ గిరిజనుల భూములను స్వాధీనం చేసుకోవడానికి వీలులేదని, అధికారులను ఆటంకపరిచినందుకు గిరిజనులమీద పెట్టిన కేసులను కూడ కొట్టివేయాలని ఆర్డరు జారీచేస్తుంది. ఇది చాలా అవాస్తవికమైన ముగింపు. పేదలకు, పీడితులకు కోర్టుల ద్వారా న్యాయం సాధించటం అంత సులభమైతే రాజకీయ హింసా అహింసల చర్చ కేవలం సైద్ధాంతిక చర్చ అయివుండేది; ఒక రాజకీయ సమస్య అయివుండేది కాదు.

శ్రామిక ప్రజలకు రాజ్యాధికారం శాంతియుతంగా రాదని కమ్యూనిస్టు విప్లవకారులు నమ్మవచ్చునేమో గాని శ్రామిక ప్రజానీకం విప్లవహింసను అందుకోసం ఆమోదించరు. ప్రజలకు న్యాయం చేయవలసిన సంస్థలు (Institutions) ఏవీ సమర్థవంతంగా పనిచేయని పరిస్థితిలో సమస్యల పరిష్కారానికి ఒక ప్రత్యామ్నాయ మార్గంగా ఆమోదిస్తారు. రామోజీరావు పాలనా యంత్రాంగానికి చాలా సన్నిహితుడు. గిరిజనుల భూమి సమస్య గురించి ప్రభుత్వం దగ్గర, కోర్టుల దగ్గర వందల పిటిషన్లు మగ్గుతున్నాయని వారికి తెలియంది కాదు. అందులో చాలా కొద్ది పిటిషన్లు మాత్రమే గిరిజనులకు అనుకూలంగా పరిష్కారమయ్యాయనేది ఆయనకి తెలియంది కాదు. నక్సలైట్లు జోక్యం చేసుకున్నచోటే గిరిజనులను వారి భూముల నుండి తొలగించే

ప్రయత్నాలు ఆగాయని, ఈ రకంగా గిరిజనులు రాష్ట్రంలో 'చట్ట వ్యతిరేకంగా' అనుభవిస్తున్న అటవీ భూమి ఐదులక్షల ఎకరాల దాకా ఉందనేదీ వారికి తెలియంది కాదు. పేదలను, పీడితులను శాంతియుతంగా చట్టబద్ధంగా సమీకరించే ప్రయత్నం చేసినవారు ఎన్ని అవాంతరాల్ని ఎదుర్కొంటారో, ఎంత నిస్పృహ చెందుతారో అందరికీ తెలుసును. కోర్టులో పిటిషన్ వేస్తే సరిపోయేదానికి అనవసరంగా హింసకు పాల్పడుతున్నారని నిందించడం ప్రజల వివేచనను కించపరచడం తప్ప వేరే కాదు.

అదట్లాగుంచి ఇది ఎవరూ విశ్వసించగల వాదన కాదు. కాబట్టి నిర్మాత పైన చెప్పిన రెండవ వాదనను ప్రధాన వాదనగా ఉపయోగిస్తాడు. ఈ వాదనలో పై వాదన కంటే ఎక్కువ నిజాయితీ ఉందని కాదు గాని ఇది పూర్తిగా విశ్వసనీయతను ఇంకా కోల్పోలేదు కాబట్టి నిర్మాత లక్ష్యానికి పనికొస్తుంది. ఇది ఒక రకంగా చాలా తెలివైన వాదన. అహింస అనే వాదనను వ్యవస్థకు అనుకూలంగా, విప్లవకారులకు వ్యతిరేకంగా ఉపయోగించే బదులు ఇటు వ్యవస్థకూ అటు విప్లవకారులకూ వ్యతిరేకంగా 'ప్రజల' పక్షాన ఉపయోగిస్తాడు. "మీ హింసకూ, వారి హింసకూ మధ్యన మేము నలిగిపోతున్నాం" అని ప్రజలచేతే చెప్పిస్తాడు. ఈ వాదనను నిజానికి తెలుగు పత్రికారంగంలో రామోజీరావుగారి 'ఈనాడే' ఆవిష్కరించింది. మితిమీరిపోతున్న పోలీసు అత్యాచారాల గురించి ఇక మౌనంగా ఉండడం సాధ్యం కాని దశలో నక్సలైటు రాజకీయాలకు ప్రోత్సాహం ఇవ్వకుండా పోలీసు అత్యాచారాలను ఎట్లా ఎండగట్టాలా అన్న సందిగ్ధానికి ఈ వాదన ఒక సులువైన పరిష్కారాన్ని చూపించింది. తెలుగు దినపత్రికల్లో ఇది తరచుగా దర్శనమిస్తూ ఉంటుంది. నైతికంగా పతనమై రాక్షసంగా తయారైన పాలకవర్గంతోనూ, దయాదాక్షిణ్యాలు లేని కరడు గట్టిన నక్సలైట్లతోనూ ప్రజలు జరిపే ఎన్‌కౌంటర్ 'పీపుల్స్ ఎన్‌కౌంటర్'. ఈ రూపంలో మటుకే అహింస అనే వాదనకు ఇంకా ఏ మాత్రమైనా విశ్వసనీయత మిగిలి ఉంది.

అయితే నక్సలైట్లు హింసను ఎందుకు ఉపయోగిస్తారు? పోలీసులు ప్రజలను ఎందుకు హింసాత్మకంగా అణచివేస్తారు? 'నక్సలైటు సమస్య' గురించి చేసే ప్రచారంలో పాలకవర్గం ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పాలి. విప్లవకారులు దీనికో సమాధానం చెపుతారు - పెత్తందార్ల సాయుధ రాజ్యాన్ని కూలదోసి శ్రామిక ప్రజల రాజకీయ ఆధిపత్యాన్ని నెలకొల్పడానికి హింస అనివార్యమనేది వారి సమాధానం. అయితే పాలకవర్గాల ప్రచారం దీనిని ఎప్పుడూ చర్చించదు. ఒకప్పుడు కమ్యూనిస్టు పార్టీలో తిరిగిన రామోజీరావుకు ఈ సమాధానం తెలియకపోలేదు

కాని ఆయన కూడ చర్చించడు. మరొకవైపు విప్లవ హింస గురించి పోలీసుల అభిప్రాయం ఉంది. ఇందులో రెండు అంశాలున్నాయి. కొంతమందికి అధికారాన్ని, డబ్బును సమకూర్చి పెట్టే గుండాయిజానికి విప్లవం ఒక ముసుగనేది ఒక అభిప్రాయం. ఎన్నికలలో గెలవడం చేతకానివాళ్ళు గత్యంతరం లేక ఎంచుకున్న మార్గం అనేది రెండో అభిప్రాయం. నిర్మాతకు ఈ వాదనలు ఎంత నచ్చినా ప్రేక్షకుల విశ్వసనీయతను పొందవలసిన సినిమాకు అవి పనికి రావు. ఎందుకంటే ప్రజలకు విప్లవ హింసను గురించి తమ స్వంత అభిప్రాయం ఉంది. ప్రజలలో ఎక్కువగా ప్రచారంలో ఉన్న అభిప్రాయమేమిటంటే ప్రజాస్వామ్యంలోని అన్ని సంస్థలూ ధనవంతులకు, బలవంతులకు ఊడిగం చేస్తున్న స్థితిలో ప్రజలకు న్యాయం చేకూర్చేది విప్లవ హింస ఒక్కటేనని.

ఈ అభిప్రాయం ఇవ్వాళ మన సమాజంలో విస్తృతంగా ప్రచారంలో ఉంది. పత్రికా సంపాదకులకు, యజమానులకు ఎంత నచ్చకపోయినా వారి గ్రామీణ విలేఖరులే దీనిని ప్రచారం చెయ్యడంలో ముఖ్యపాత్ర వహించారు. రామోజీరావు ఈ సినిమాలో ఈ అభిప్రాయానికే ప్రాధాన్యం ఇస్తాడు. అయితే 'ప్రభుత్వ హింసకూ విప్లవకారుల హింసకూ మధ్యన నలిగిపోతున్న ప్రజలు' అనే మౌలికమైన అవగాహనలో అంతర్భాగంగానే ఈ వాదనను ప్రవేశపెడతాడు. అవినీతిపరులైన రాజకీయ నాయకులు, స్వార్థపరులైన అధికారులు మన ప్రజాస్వామ్యాన్ని దిగజార్చారు. నక్సలైట్లు ఈ అవకాశం చూసుకొని సమస్యలను వేగంగా నిర్దయగా పరిష్కరించే మార్గం చూపించి ప్రజలను ఆకట్టుకుంటున్నారు. అయితే ఆ క్రమంలో వాళ్ళు దిగజార్చిన ప్రజాస్వామ్యాన్ని వీళ్ళు పూర్తిగా ధ్వంసం చేసి అమాయకుల నెత్తుటితో తమ ఆధిపత్యానికి బాట వేసుకుంటున్నారు. ఇదీ ఈ సినిమా ప్రచారం చేసే అవగాహన. ఈ అవగాహనలో పోలీసు హింస నక్సలైట్ల వ్యూహానికి ఒక అనివార్యమైన ప్రతివ్యూహం అవుతుంది. ఏ వ్యవస్థయినా తన దౌర్బల్యాన్ని ఆసరా చేసుకుని తనను ధ్వంసం చేసే వారిని సహించలేదు కదా! అయితే పోలీసు హింస పట్ల ప్రజలకుండే తీవ్రమైన ద్వేషాన్ని రామోజీరావు విస్మరించలేదు. విస్మరిస్తే సినిమాకు విశ్వసనీయత ఉండదు. అందువల్ల ఈ సినిమాలో పోలీసుల చిత్రీకరణ చాలా నీచంగా ఉంది. ఎంత నీచంగా ఉందంటే రాష్ట్ర పోలీసు అధికారులకు సెన్సార్‌ల మీద చాలా కోపం వచ్చిందట కూడ. అయితే రాజకీయ హింస మీద ఇటు ప్రజలనూ, అటు పోలీసులనూ కూడ ఆకట్టుకునేటట్టు సినిమా తీయడం ఇవ్వాళ సాధ్యం కాదు. అయినా పోలీసు యంత్రాంగంలోని పతనాన్ని ఈ రకంగా

ఎంతగా చూపించినా మొత్తం రాజకీయ వ్యవస్థలో ఆ యంత్రాంగం నిర్వహిస్తున్న పాత్రను గురించి ప్రేక్షకులలో కలిగే అభిప్రాయానికి ఏమీ తేడా రాదు.

విప్లవ హింసను కేవలం ప్రజల తక్షణ సమస్యల పరిష్కారానికి ఒక సమర్థవంతమైన సాధనంగా మాత్రమే అర్థం చేసుకున్నా చర్చ ఇక్కడితో ఆగిపోవడానికి వీలు లేదు. ఇటు విప్లవ హింస, అటు పోలీసు హింస అంటే సరిపోదు. వ్యవస్థాగతమైన మూడో హింస ఒకటుంది. దీనిని గురించి మాట్లాడడం రామోజీరావు వాదనకు చాలా ప్రమాదకరం. అందుకే దానినొక అంశంగా ఆయన ఒప్పుకోడు. ప్రజలకు అనేక సమస్యలు ఉన్నాయని, అవినీతికి అక్రమ మార్గాలకు అలవాటు పడిన అధికార యంత్రాంగం, రాజకీయ నాయకులు వీటిని పరిష్కరించలేకపోతున్నారని - ఇంత మాత్రమే ఒప్పుకుంటాడు. ఆకలి, పేదరికం, అసమానత, అణచివేత ఇదంతా కూడ హింసేనని, ఈ హింస సామాజిక వ్యవస్థలో అంతర్గతమైందని ఆయన ఒప్పుకోడు. ఒప్పుకుంటే, విప్లవ హింస గురించి జరిగే చర్చ స్వరూపం మారిపోతుంది. ఈ వ్యవస్థ స్వర్గతుల్యం కాకపోవచ్చు గాని మౌలికంగా మంచిదేనని, జీవనయోగ్యమేనని, అయితే ఈ మధ్యకాలంలో అవినీతి, అణచివేత దురదృష్టవశాత్తూ పెరిగిపోతున్నాయని మాత్రమే ఒప్పుకుంటాడు. అంటే బుట్టలో కొన్ని పళ్ళు మాత్రమే కుళ్ళిపోయాయని ఒప్పుకుంటాడు. ఈ సినిమాలో వ్యవస్థకు ప్రతినిధులుగా ఒక క్రూరుడైన భూస్వామిని, అతనికి గులాములైన పోలీసు, అటవీశాఖ అధికారులను చూపిస్తాడు. ఆ భూస్వామి ఒక స్త్రీని లోబర్చుకుని తనకు గులాములైన ప్రభుత్వాధికారులను సంతృప్తిపరచమని బలవంతం చేస్తాడు (ఆమె చివరికి ఒక ప్రజాకోర్టులో అతనిమీద ఫిర్యాదు చేసి నక్సలైట్ల చేత అతనిని చంపిస్తుంది). ఈ కుళ్ళును దాచిపెట్టడానికి నిర్మాత ఎంతమాత్రం ప్రయత్నం చేయడు. అయితే ఈ నిర్మొహమాటం వెనక అంతకంటే బలమైన సంకల్పం ఉంది. ఇటువంటి దిగజారిన వ్యక్తులు ఎందరో ఉన్నారని ఒప్పుకుంటూనే, వ్యవస్థ నిర్మాణంలోనే హింస ఉందని మట్టుకు ఎట్టి పరిస్థితిలోనూ ఒప్పుకోకూడదనే సంకల్పం అది. ఈ రకమైన బూటకపు నిర్మొహమాటం ఈ మధ్యకాలంలో పాలకవర్గం తరచూ ప్రదర్శిస్తూ ఉంది. ఇంతకు మించి కొంచెం కూడ ఒప్పుకోవడానికి సిద్ధపడరు. వ్యవస్థే అన్యాయంగా, అసమంగా ఉందని మనం వాదించే ప్రయత్నం చేస్తే పోలెండ్ గురించి, రుమేనియా గురించి, తియాన్మెన్ స్క్వేర్ గురించి ఆవేశంగా వాదనకు దిగుతారు.

వ్యవస్థలో కొంతమాత్రమే కుళ్లు ఉందని, దానిని పరిష్కరించడానికి ఈ

వ్యవస్థ ఆమోదించిన సాధనాలే సరిపోతాయని వాదిస్తే విప్లవ హింసకు పునాది పోతుంది. చారిత్రక ఆవశ్యకత పోతుంది. అప్పుడది కొంతమంది వ్యక్తులు కేవలం స్వయం సంకల్పంతో ఎంచుకున్న రాజకీయ మార్గమవుతుంది. ఆ ఎంపికకు వాళ్ల సంకల్పమే తప్ప వేరే భూమిక ఉండదు. విప్లవానికి ఈ విధంగా భౌతిక ఆవశ్యకతను తొలగిస్తే విప్లవకారుల మీద, వారి వెనకవున్న ప్రజల మీద వ్యవస్థ ప్రయోగించే అణచివేత న్యాయమైన ప్రతిహింస అవుతుంది. సమర్థనీయమైన ఆత్మరక్షణ అవుతుంది. దానివల్ల ప్రజలకు హాని జరుగుతుందంటారా అది గర్హనీయమే. కాని దానికి బాధ్యులెవరో ఈ వాదనలో స్పష్టమే. హింసను మొదలుపెట్టింది విప్లవకారులే అని చెప్పడం కోసమే వ్యవస్థీకృత హింసను గురించి మాట్లాడినప్పుడల్లా తూర్పు యూరప్ గురించి ఆవేశంగా వాదనకు దిగుతారు.

విప్లవాన్ని కేవలం సంకల్ప మాత్రమైన చర్యగా మార్చేస్తే, చారిత్రక ఆవశ్యకతకు అతీతమైన నిర్ణయంగా మార్చేస్తే అది క్రూరంగాను, రొమాంటిక్‌గాను కనిపిస్తుంది. ఈ సినిమాలో విప్లవాన్ని చూపించిన పద్ధతిలోనూ అవే - రొమాంటిసిజం, క్రూరత్వం - ప్రధాన అంశాలు. నక్సలైట్లలో అత్యధిక శాతం గ్రామాలలో, గనులలో, బస్తీలలో, ఫ్యాక్టరీలలో, కాలేజీలలో ప్రజల మధ్య రహస్యంగానో, బహిరంగంగానో పనిచేసే సాధారణ మానవులు. కానీ ఈ సినిమాలోని నక్సలైట్లు అటువంటి సాధారణ మానవులు కారు. వీళ్ళు శాశ్వతంగా ప్రజలకు దూరంగా కొండకు అవతలివైపున నివసిస్తుంటారు. గిరిజనులకు వాళ్ళ అవసరం ఏర్పడినప్పుడు వాళ్లకు ఏదో మహత్తు ద్వారా తెలిసిపోతుంది. ఆకుపచ్చ యూనిఫారాలు వేసుకుని ఆటోమాటిక్ తుపాకులు పట్టుకుని కొండమీద నుండి నాట్యం చేసుకుంటూ దిగివస్తారు. గురి కూడ చూడకుండా తుపాకులు పేలుస్తారు. చంపవలసినంత మందిని చంపిన తర్వాత కొండ ఆవలివైపుకు వెళ్లిపోతారు. అప్పుడప్పుడు డాక్టర్ జ్యోతి ఇచ్చే సుదీర్ఘమైన ఉపన్యాసాలకు సమాధానంగా క్లుప్తంగా, తిరస్కారంగా రెండు మాటలు మాట్లాడతారు. జ్యోతిలోని మానవీయతకు, పోలీసుల నైతిక పతనానికి భిన్నంగా నక్సలైట్లది అమానవీయమైన కరుడుగట్టిన ఆత్మవిశ్వాసం. ఉదాహరణగా ఒక ఉదంతాన్ని చెప్పుకోవచ్చు. పోలీసులు ఒక నక్సలైటును బూటకపు ఎన్‌కౌంటర్‌లో చంపుతారు. శవాన్ని దహనం లేదా ఖననం చేసే బదులు అక్కడే ఉంచాలనీ, శవం కోసం ఇతర నక్సలైట్లు వస్తే పట్టుకోవాలనీ అనుకుంటారు. శవాన్ని ఒక చెట్టుమీద పెట్టి దాని చుట్టూ పోలీసులు కాపలా కాస్తారు. నిజజీవితంలో ఇటువంటి పరిస్థితిలో ఏ విప్లవకారులైనా శవాన్ని

చేజిక్కించుకునే ఆశ వదులుకుని వెళ్లిపోతారు. కానీ ఈ సినిమా నక్సలైట్లు అట్లా కాదు. చెట్టు కొమ్మ నుంచి చెట్టు కొమ్మకు రోప్‌వే కట్టి నడుముకు తాడుకట్టుకుని మీదినుండి దిగి శవాన్ని పోలీసుల తలలమీద నుంచి తన్నుకుపోతారు. రామోజీరావు ఇదంతా సాధ్యమని నమ్మేంత అమాయకుడా అనేది ప్రశ్న కాదు. పాలకవర్గ చైతన్యం సమృద్ధిగా ఉన్న వ్యక్తి తీసిన సినిమాలో నక్సలైట్లను ఈ రకంగా చూపించడంలో ఆంతర్యం ఏమిటన్నది ప్రశ్న. అమానవీయమైన సామర్థ్యం, కరుడుగట్టిన క్రూరత్వం మొదలైన లక్షణాల కలయికగా నక్సలిజాన్ని చిత్రీకరించడం ద్వారా ఇచ్చే సందేశం ఏమిటన్నది ప్రశ్న.

భౌతిక పునాది, చారిత్రక ఆవశ్యకత లేని విప్లవంలో ఒక చర్యకూ ఒక చర్యకూ సంబంధం ఉండదు. ఆ మొత్తానికీ అర్థం ఉండదు. తెలుగు దినపత్రికలు విప్లవ రాజకీయాలను ఈ రకంగానే చిత్రీకరిస్తున్నాయి. పరస్పర సంబంధం లేని అర్థరహితమైన రొమాంటిక్ చర్యలుగా, నిష్కారణమైన హింసాకాండగా వర్ణిస్తున్నాయి. ఈ చిత్రం వాస్తవాలను వక్రీకరిస్తోందని విప్లవకారులు ఆరోపించినపుడు తాము చూపించిందంతా వాస్తవమని గత రెండేళ్లుగా పత్రికలు చదువుతున్న వారందరికీ తెలుసునని రామోజీరావు సమాధానం చెప్పాడు. అది నిజమే. 'ఈనాడు'తో మొదలుపెట్టి తెలుగు దినపత్రికలన్నీ అలవాటు చేసుకున్న చిత్రీకరణను ఈ సినిమాలో ఆయన కొనసాగించాడు. గమ్యంలేని విడివిడి చర్యల కలయికగా విప్లవాన్ని చిత్రీకరించాడు. ఒక్కొక్కచోట ఇది ఎంత దూరం పోతుందంటే కథనం వదిలిపెట్టి బస్సులు తగలబెట్టిన దృశ్యాలు, ఇళ్లు పేల్చివేసిన దృశ్యాలు, ఇన్ఫార్మర్లను కాల్చివేసిన దృశ్యాలు కేవలం ఫోటోలుగా ఒకదాని తర్వాత ఒకటి చూపిస్తాడు. నక్సలిజం అంటే అర్థంలేని హింసాకాండ అనే సందేశాన్ని ఈ రకమైన చిత్రీకరణ బలంగా అందిస్తుంది. దీనిని ఎదుర్కోవడానికి పోలీసులు రంగప్రవేశం చేయక తప్పదని ప్రేక్షకులకు ఒకరు చెప్పకుండానే అనిపిస్తుంది. పోలీసులలో కొందరు (బహుశా అత్యధికులు) అవినీతిపరులు, క్రూరులు కావొచ్చు. అయినప్పటికీ మన సమాజాన్ని డైనమైట్లతో పేల్చివేస్తున్న ఈ గమ్యంలేని హింసాకాండకు లొంగడానికి వీల్లేదు (ప్రేక్షకుల సంకల్పం లేకుండానే ఈ సమాజం 'మన' సమాజంగా కనబడటం మొదలవుతుంది). పోలీసు వ్యవస్థను రామోజీరావు చాలా లజ్జాకరంగా చిత్రీకరించాడని పోలీసులకు కోపం వచ్చింది కాని, పోలీసు వ్యవస్థను ఆయన చూపించింది అన్యాయమైన సమాజాన్ని నిలబెట్టే ఒక సాయుధ యంత్రాంగంగా కాదు, 'మన' సమాజాన్ని దుండగుల నుండి కాపాడలేని అసమర్థ యంత్రాంగంగా

మాత్రమే. రాజకీయ నాయకుల విషయం కూడ అంతే. ఈ రకమైన రాజకీయ నాయకుల చేతుల్లో మన భవిష్యత్తును పెట్టగలమా అన్న ఆందోళన కలుగుతుందే తప్ప వీళ్లు సామాజిక అన్యాయానికీ, అణచివేతకూ రాజకీయ ప్రతినిధులన్న ఆగ్రహం కలగదు.

ఈ రకమైన చిత్రీకరణ సాధ్యం కావాలంటే కొన్ని వాస్తవాలు చెప్పకుండా ఉండడం అవసరం. చాలా ఆవేదనతో 'నక్సలైటు సమస్య'ని చిత్రీకరించానని చెప్పుకుంటూ ఉన్న రామోజీరావు అదే చేశాడు. తెలిసీ కొన్ని వాస్తవాలను చెప్పలేదు. ఒక ముఖ్యమైన ఉదాహరణ చెప్పాలంటే విప్లవోద్యమాన్ని ఎదుర్కోవడానికి రాజ్యాంగ యంత్రాంగం చాలా పకడ్బందీగా, పటిష్టంగా అన్ని రంగాలలోను హింసాకాండను ప్రయోగించిందన్న వాస్తవాన్ని ఈ సినిమాలో ఎక్కడా చెప్పదు. ఇంద్రవెల్లి సీను దీనికొక నిదర్శనం. ఆదిలాబాద్ గిరిజనులలో విస్తరిస్తూ ఉన్న విప్లవోద్యమ నిర్మాణాన్ని మొగ్గలోనే తుంచివేయడం కోసం ఉద్దేశపూర్వకంగా ప్రయోగించిన ఆ హింసాకాండను కాకతాళీయమైన కాల్పుల సంఘటనగా చూపిస్తాడు. తనపై అత్యాచారం చేసిన పోలీసు అధికారిని ఒక గిరిజన స్త్రీ చంపివేయగా తదుపరి చెలరేగిన కల్లోలాన్ని అణచడం కోసం పోలీసులు జరిపిన కాల్పులుగా చూపిస్తాడు. పోలీసు యంత్రాంగంలో అవినీతిపరులు, అసమర్థులు, పిరికివాళ్లు చాలామంది ఉన్నారు గాని అది ఈ సినిమాలో చూపించినంత పనికిమాలిన యంత్రాంగం ఏమీ కాదు. సాధారణ పోలీసు యంత్రాంగంలోనూ, ఊరూ పేరూ లేని తెల్లబట్టల గూండాలైన స్పెషల్ పోలీసులలోనూ సమర్థవంతంగా దమనకాండను అమలుచేసే నైపుణ్యం పుష్కలంగా ఉంది. ఇంటెలిజెన్స్ డిపార్ట్‌మెంట్‌కి ఇంటెలిజెన్స్ తక్కువేమీ లేదు. అయినా పోలీసులు 'నక్సలైటు సమస్య'ను పరిష్కరించలేక పోయారంటే అది వాళ్ల చేతకానితనం కాదు. ప్రపంచంలోని ఏ రాజకీయ సమస్యనూ ఎక్కడా పోలీసులు పరిష్కరించలేదు. ఎంతో కొంత క్రూరంగా, ఎంతో కొంత సమర్థంగా, ఎంతో కొంత తాత్కాలికంగా అణచడం మట్టుకే వాళ్లకు సాధ్యమవుతుంది. అందులో ఆంధ్ర రాష్ట్ర పోలీసులు వేరే ఎవరికీ తీసిపోలేదు. రాజకీయనాయకులైనా అంతే. వాళ్లు ఈ సమస్యను ఇప్పటిదాకా పరిష్కరించలేకపోయారంటే సామర్థ్యం లేక కాదు, సంకల్పం లేక కాదు, అది అసాధ్యం కావడమే దానికి కారణం.

అయితే ఇదంతా చెప్తే రాజ్యాంగ యంత్రమనేది ఒక అణచివేత యంత్రాంగమని చెప్పాల్సి ఉంటుంది. మన సామాజిక వ్యవస్థ అణచివేతమీద,

హింసమీద ఆధారపడిందని, రాజ్యాంగయంత్రం దాన్ని కాపాడే కవచమని ఒప్పుకోవాల్సి ఉంటుంది. అప్పుడు నక్సలైట్ల నిరసన చర్యలను ఒక లక్ష్యం, కారణం లేని హింసాకాండగా చిత్రించడం సాధ్యపడదు. నక్సలైటు ఉద్యమం ప్రారంభమైన తర్వాత రెండు దశాబ్దాలపాటు పోలీసుల అణచివేత ఎదురులేకుండా సాగిందని, దాని గురించి పత్రికలు ఏనాడూ రాయలేదని, 'ప్రజాభిప్రాయాన్ని' పట్టించుకోలేదని, కోర్టులు, వాటి హెబియస్ కార్పస్ అధికారమూ వారికి అడ్డురాలేదని, ప్రజాస్వామికంగా ఎంత నిరసన తెలిపినా ప్రభుత్వం పట్టించుకోలేదని అప్పుడు చెప్పాల్సి ఉంటుంది. కిడ్నాప్‌లు, దహనం, పేల్చివేత మొదలైన చర్యలు ఎంత అభ్యంతరకరంగా అనిపించినా వాటిద్వారా పాలకవర్గాల ప్రశాంతిని తాత్కాలికంగా నయినా భగ్నం చేయకపోతే రామోజీరావు వంటివారు రెండు దశాబ్దాల మౌనాన్ని విడనాడి 'నక్సలైట్ సమస్య' గురించి తమ పత్రికలలో సినిమాలలో చర్చించేవారే కాదని ఒప్పుకోవాల్సి ఉంటుంది. మరొక అడుగు ముందుకుపోయి రామోజీరావు సినిమాగాని, పాలకవర్గం ప్రచారంగాని ఎంత మాత్రం ఒప్పుకోని మరికొన్ని విషయాలను కూడ అంగీకరించవలసి ఉంటుంది. విప్లవాల చారిత్రక ఆవశ్యకత వంటి పెద్ద విషయాలను పక్కకు పెట్టినా, రాష్ట్రంలోని అనేక ప్రాంతాలలో ఇవ్వాళ పేదలు, పీడితులు విప్లవోద్యమం ఫలితంగానే గౌరవంగా తలెత్తుకు తిరుగుతున్నారనీ, శ్రీకాకుళంలో మొదలయిన 'నక్సలైటు సమస్య' రెండు దశాబ్దాల పాశవిక అణచివేత తర్వాత కూడ హైదరాబాద్ నగరంతో సహా 23 జిల్లాలకు పాకిపోయిందనీ, నక్సలైట్లే లేకపోతే సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థలు గాని, గిరిజన సహకార సంఘాలు గాని, మారుమూల ప్రాంత అభివృద్ధి పథకాలు గాని ఉండేవి కాదనీ, విప్లవోద్యమం ఇచ్చిన చైతన్యం వల్లనే ఎక్కడ అన్యాయం జరిగినా ఆందోళన చేసే సంస్కృతి పుట్టిందనీ, ప్రభుత్వ అధికారుల, రాజకీయ నాయకుల అవినీతినీ పక్షపాతాన్నీ అసమర్థతనూ నిర్భయంగా నిరసించే సంస్కృతి పుట్టిందనీ, దేశాన్ని ఏలుతున్న దొరలంతా తాము ప్రజలకు జవాబుదారులమని ఒప్పుకునే అగత్యం ఏర్పడిందనీ - ఇదంతా చెప్పవల్సి ఉంటుంది.

సమస్యలో ఇంత ప్రధానమైన అంశాన్ని దాచిపెట్టే చిత్రీకరణ దానికి విశ్వసనీయమైన పరిష్కారాన్ని చూపించలేదు. నక్సలైట్లు తమ హింసాత్మక నిరసన మార్గాన్ని వదిలిపెట్టాలనీ, ప్రభుత్వం తన హింసాత్మక అణచివేత మార్గాన్ని వదిలి పెట్టాలనీ ఇద్దరి మీదా డిమాండ్ పెడుతూ 'ప్రజల' తరఫున నిరసన దీక్షకు కూర్చుంటుంది జ్యోతి. ఈ 'పీపుల్స్ ఎన్‌కౌంటర్' ఇరుపక్షాలలో ఎవరి సమస్యకూ

న్యాయం చేయదు కాబట్టి ఆమె దీక్ష ఫలించడం సాధ్యం కాదు. అది అసాధ్యమని గుర్తించి కృత్రిమ పరిష్కారం చూపించనందుకు రామోజీరావును అభినందించ వచ్చును. చనిపోతూ జ్యోతి చూపిన చేతిని ఇరుపక్షాలలో ఎవ్వరూ అందుకోరు. పోలీసు అధికారి గిరిజన స్త్రీపై అత్యాచారం చేయగా జన్మించిన పాప మాత్రమే ఆమె చేతిని అందుకుంటుంది. ఇందులో ఏదో సందేశం ఉండే ఉండాలి. అయితే ఆ సందేశం ఎంత వాస్తవికమైందో భవిష్యత్తులోనే తేలగలదు కాబట్టి అక్కడితో వదిలేద్దాం.

*అరుణతార మాసపత్రిక*

*అక్టోబర్-నవంబర్ 1991*

*దీని ఇంగ్లీషు మూలం 20.7.1991 ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీలో వచ్చింది. ఇది రచయితే చేసిన సంక్షిప్తానువాదం.*

# విప్లవ హింస - హక్కుల దృక్పథం

నాకిచ్చిన అంశం మీద ప్రసంగించేముందు రెండు సమస్యలను ప్రస్తావించదలిచాను.

ఒకటి 'విప్లవ హింస' అనే మాటకు సంబంధించినది. విప్లవ హింస అంటే ఏమిటి? బహుశా దాని అర్థం సి.పి.ఐ (ఎం.ఎల్) పార్టీలు చేస్తున్న హింస కావచ్చు. భారతదేశంలో సి.పి.ఐ (ఎం.ఎల్) పార్టీలు, జాతుల ఉద్యమాలు చాలా హింసను ప్రయోగిస్తున్నాయి. ఇంతకు ముందు సెషన్‌లో జాతుల ఉద్యమాల గురించి చర్చించుకున్నాం. కాబట్టి, ఇక్కడ విప్లవ హింస అంటే సి.పి.ఐ (ఎం.ఎల్) పార్టీల హింస అనే అర్థంలో వాడుతున్నాం. కాని, తమను 'విప్లవకారులు'గా అభివర్ణించుకొనేవి సి.పి.ఐ (ఎం.ఎల్) పార్టీలు మాత్రమే కావు. దళిత ఉద్యమం తన్ను తాను విప్లవ స్వభావం ఉన్నదిగా అనుకుంటుంది. అదే విధంగా స్త్రీల ఉద్యమమూ. కాని నిన్నటి సెషన్‌లో వాటిని దళిత ఉద్యమంగాను, స్త్రీల ఉద్యమంగాను ప్రస్తావించామే కాని స్త్రీల విప్లవోద్యమంగానో, దళితుల విప్లవోద్యమంగానో ప్రస్తావించ లేదు. ప్రస్తుతం నాకిచ్చిన అంశాన్ని అదే విధంగా విప్లవ హింసగా కాకుండా, సి.పి.ఐ (ఎం.ఎల్) పార్టీలు చేస్తున్న హింసగా ఎందుకు వర్ణించకూడదు? విప్లవం, సి.పి.ఐ (ఎం.ఎల్) పార్టీల రాజకీయాలు రెండూ ఒకటేననే స్పష్టమైన అభిప్రాయం ఇక్కడ ఉన్నట్టుంది.

అంతేకాదు. స్త్రీలకు, దళితులకు సంబంధించిన రాజకీయాలు కేవలం ఒక సామాజిక బృందానికి చెందినవి మాత్రమే అనే అర్థమూ

ఉంది. అది నిజం కావచ్చు. కాకపోవచ్చు. కాని ప్రశ్నేమిటంటే, ఇదంతా నిజమేనని, దానికి ఎటువంటి వివరణ అవసరం లేదని పౌరహక్కుల ఉద్యమం ఎలా భావిస్తుంది? తన స్వంత ప్రాతిపదికల నుండి, తన అవగాహన చట్రంలో నుండి పౌరహక్కుల ఉద్యమం ఏ విధంగా ఇలాంటి అంచనాలకు వస్తుంది?

ఇది కాకతాళీయంగా జరిగిన పొరబాటు కాదు. పౌరహక్కుల ఉద్యమాల ప్రాపంచిక దృక్పథంలోనికి మార్క్సిస్టు లేక మార్క్సిస్టు-లెనినిస్టు భావనలను అప్రకటితంగా చొప్పించి, అదే ప్రజాస్వామ్య ప్రాపంచిక దృక్పథంగా చెలామణి చేయించడం అనేది చాలా సామాన్య విషయమైపోయింది. ఈ అభిప్రాయం నిజమా కాదా అనేది కాదు సమస్య. పౌరహక్కుల అవగాహనకు అవి పునాది అని భావిస్తే, ఆ విషయాన్ని స్పష్టంగా పైకి చెప్పుకోవాలి. అంతేకాని పౌరహక్కుల అవగాహన చాలా విశాలమైనది, ఏదో ఒక రాజకీయ సిద్ధాంతానికి పరిమితమైనది కాదు అనే అభిప్రాయం కలిగిస్తూ దాని చాటున ఈ అవగాహనను దాచి ఉంచనక్కరలేదు.

నాకు తెలిసినంతవరకు, భారతదేశంలోని ఏ పౌరహక్కుల సంస్థా తన అవగాహనకు మార్క్సిస్టు, లేక మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం ప్రాతిపదిక అని చెప్పుకోలేదు. అన్నీ కూడ విశాలంగా కనిపించే ప్రణాళికలను రూపొందించుకున్నాయి. ప్రణాళికలు రాసుకోనట్లయితే, విశాలమైన ప్రజాస్వామ్య లక్ష్యాలు ఉన్నట్లు చెప్పుకున్నాయి. సెక్టేరియన్‌గా కనిపించకుండా ఉండడానికీ, కమ్యూనిస్టుల జేబు సంస్థలుగా రాజ్యంచేత ముద్రపడకుండా తప్పించుకోవడానికీ ఇదంతా బహుశా అవసరం అని అనిపించి ఉండవచ్చు.

అలాంటప్పుడు దానికి అనుగుణంగా సమస్యల గురించి, సంఘటనల గురించి చేసే వ్యాఖ్యానాలు నిజంగానే విశాల అవగాహన ప్రాతిపదికన ఉండవలసింది. కాని, సమాజం, సామాజిక సంబంధాల గురించి మార్క్సిస్టు, లేక మార్క్సిస్టు-లెనినిస్టు అభిప్రాయాల ప్రాతిపదికన వ్యాఖ్యానాలు చేయడం అలవాటయింది. అయితే దీనిని స్పష్టంగా చెప్పుకోకపోవడం వలన, ఆ దృక్పథం నుండి వచ్చే సిద్ధాంతపరమైన సమస్యలను పౌరహక్కుల ఉద్యమం ఎదుర్కోవడం లేదు. కనీసం తన ఆలోచనల ప్రాతిపదికను స్పష్టంగా చెప్పుకుని ఉంటే కమ్యూనిస్టు సిద్ధాంతానికీ - ప్రజాస్వామ్యానికీ మధ్య ఉన్న ఇబ్బందికరమైన సంబంధాన్ని హక్కుల ఉద్యమం బలవంతగానైనా పట్టించుకోవలసి వచ్చేది. అలా చేయనందువల్ల పరీక్షించబడని అనేక మార్క్సిస్టు-లెనినిస్టు భావనలు పౌరహక్కుల దృక్పథాలను నిర్ధారిస్తూ ఉన్నాయి.

ఒక ఉదాహరణ తీసుకుందాం. నిన్నటి సమావేశంలో మానవ్ అధికార్ సంగ్రామ్ సమితి (మాస్)కు చెందిన భూయాన్ మాట్లాడుతూ ప్రజలలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పట్ల పెరుగుతున్న భ్రమల గురించి పౌరహక్కుల ఉద్యమాలు అప్రమత్తంగా ఉండాలని అన్నారు. ఇది ఒక విచిత్రమైన సలహా. పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికున్న పరిమితులను విమర్శించడం కచ్చితంగా పౌరహక్కుల ఉద్యమాల కర్తవ్యమే. ఆచరణలో దాని వక్రీకరణను కూడ విమర్శించాల్సిందే. ప్రభుత్వం నిజంగా ప్రజలకు ప్రాతినిధ్యం వహించేలా కృషి చేయడం కూడ పౌరహక్కుల ఉద్యమాల కర్తవ్యమే. కాని పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అనే వ్యవస్థ గురించి ప్రజలు భ్రమలు పెంచుకోకుండా చూడడం పౌరహక్కుల ఉద్యమం కర్తవ్యం ఎందుకు అవుతుంది? పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని వర్గపోరాటానికి, కార్మిక రాజ్యానికి మధ్య పోటీవ్యవస్థగా భావించే మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథంలో మాత్రమే ఇలాంటి లక్ష్యానికి అర్థముంటుంది. ఈ లక్ష్యం పౌరహక్కుల ఉద్యమానికి ఎందుకుండాలి? ఇలాంటి లక్ష్యం ఉండాల్సిందే అని పౌరహక్కుల కార్యకర్తలు భావిస్తే, తమ ప్రాపంచిక దృక్పథం మార్క్సిజం-లెనినిజం అని బహిరంగంగా ప్రకటించాలి. దాని సిద్ధాంతపరమైన పరిణామాలను ఎదుర్కోవాలి. అంతేకాని, దానిని అప్రకటితంగా ఉంచుకొని, ప్రజాస్వామ్యానికీ, పౌరహక్కులకూ, కమ్యూనిస్టు ఉద్యమ ప్రాపంచిక అవగాహనకూ మధ్య నున్న సంబంధంలోని చిక్కును పరిష్కరించే కష్టతరమైన కర్తవ్యాన్ని తప్పించుకుంటూ పోకూడదు.

చట్టం, సామాజిక సంస్కరణ, సంక్షేమం, పత్రికా స్వేచ్ఛ లాంటి భావనల పట్ల పౌరహక్కుల ఉద్యమంలో చాలామందికి ఉన్న దృక్పథాలకు కూడ ఇది వర్తిస్తుంది. మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథం వాటిని భ్రమగాను, భావజాలంగాను, అణచివేతగాను, మోసంగానూ భావిస్తుందే కాని అవి నాగరిక ప్రగతిని సూచించే విలువలని, వ్యవస్థలని అర్థం చేసుకొని వాటి పరిమితులను, వక్రీకరణలను విమర్శించి తద్వారా, వాటిలోని ప్రగతిశీల, ప్రజాస్వామిక సారాంశాన్ని ముందుకు తీసుకుపోవడానికి తోడ్పడాలని భావించదు.

నా రెండవ ప్రశ్న ఈ సెమినార్‌లో హింసకు అత్యంత ప్రాధాన్యం ఇవ్వడానికి సంబంధించినది. ఈ సెమినార్ ప్రజా ఉద్యమాలకు, పౌరహక్కుల ఉద్యమాలకు మధ్య ఉండాల్సిన సంబంధం గురించి చర్చిస్తున్నది. కాని ప్రసంగాలు సగానికి పైగా హింసకు సంబంధించే ఉన్నాయి. ప్రజాస్వామ్య ఉద్యమాలలో హింసకు అంత ప్రాధాన్యం ఉందా? నిజానికి హింసను ఇంత ఎక్కువగా పట్టించుకోవడానికి

గల కారణం అది కాదనుకుంటాను. సామాజిక సమస్యలకు బలప్రయోగంలోనే పరిష్కారం ఉందని నమ్ముతూ ఆ నమ్మకాన్ని ప్రజాస్వామ్యం, మానవహక్కుల పేరు మీద సమర్థించాలని ఆరాటపడడం కారణం అని నాకనిపిస్తుంది. ఏదో విధంగా మానవహక్కుల అవగాహనను హింసామార్గం ద్వారా సామాజిక మార్పును సాధించే ప్రయత్నాలకు అనుగుణంగా రూపొందించాలి. హింస విషయంలో పౌరహక్కుల ఉద్యమం ఎదుర్కొనే సమస్యల వలన కాక, పైన చెప్పిన కారణం వలననే విప్లవ హింస అనే అంశాన్ని చర్చించడానికి ఈ సెమినార్‌లో ఇంత సమయం కేటాయించబడిందనుకుంటాను.

భారతదేశంలో చాలామంది మానవహక్కుల ఉద్యమ కార్యకర్తలకు మానవ విలువలు, ప్రమాణాలు, వ్యవస్థల కంటే హింసలోనే ఎక్కువ నమ్మకముండడం ఒక దురదృష్టకరమైన విషయం. వాళ్ల వాదనే సరియైనది కావచ్చు. మిగిలినవాళ్లు పిచ్చివాళ్ల స్వర్గంలో జీవిస్తూ ఉండవచ్చు. కాని అదే నిజం అయితే మాత్రం మానవ హక్కుల ఉద్యమాన్ని మూసేసుకోవడం మంచిది. ప్రజాస్వామిక విలువల కోసం వ్యవస్థీకృత సూత్రాల కోసం జరిపే అన్వేషణలోనే దానికి మనుగడ ఉండగలదు. సామాజిక సమస్యలకు హింసాత్మక పరిష్కారాలను వెతికే రాజకీయ ఉద్యమాల అవసరాలకనుగుణంగా తన అభిప్రాయాలను, అవగాహనను రూపొందించుకొనే మానవ హక్కుల ఉద్యమానికి స్థానం లేదు.

ఇప్పుడు నాకిచ్చిన అంశంమీద మాట్లాడతాను. నేను విప్లవ హింస గురించి మాట్లాడను. రాజకీయ హింస మీద మాట్లాడతాను. ఎందుకంటే పౌరహక్కుల ఉద్యమం తన పరిధిలో ఒక రాజకీయాన్ని విప్లవకరమైనదిగాను, మిగిలినవాటిని విప్లవకరం కానివిగాను గుర్తించజాలదు. కాని, రాజకీయ హింస అనే పదం ఆధిపత్య సామాజిక గ్రూపులు, వర్గాలు చేసే హింసకు కూడ వర్తిస్తుంది కాబట్టి, దానితో పౌరహక్కుల ఉద్యమానికి సమస్య లేదు కాబట్టి అణచివేతకు గురౌతున్న ప్రజల అవసరాలు, విశ్వాసాలు, నమ్మకాల నుండి పుట్టిన రాజకీయ హింస గురించి మాట్లాడతాను. ఆ ప్రజలు కార్మికవర్గం కావచ్చు, దళితకులాలు కావచ్చు, ఒక అణగారిన జాతి కావచ్చు, స్త్రీలు కావచ్చు, మైనారిటీ కావచ్చు, ఏదయినా కావచ్చు.

## పౌరహక్కుల ఉద్యమం - హింస

పౌరహక్కుల ఉద్యమానికి హింస అనేది ఒక ఇబ్బందికరమైన విషయమే తప్ప ఒక ప్రధాన అంశం కాదు. ఇక్కడ నేను రాజకీయ హింస గురించి మాత్రమే

మాట్లాడడం లేదు, హింస గురించి సాధారణంగా మాట్లాడుతున్నాను. పౌరహక్కుల ఉద్యమం జీవించే హక్కుకు కేంద్రస్థానాన్ని ఇస్తుంది. పౌరహక్కులలో ఇది అత్యంత ప్రధానమైనది. ఈ ఉద్యమం తన శక్తిని, కృషిని చాలావరకు జీవించేహక్కు అర్థాన్ని, పరిధిని విస్తృతపరచడానికి ఖర్చుచేసింది. జీవించడమంటే భౌతిక మనుగడ మాత్రమే కాదని, పరిపూర్ణమైన, గౌరవనీయమైన జీవితాన్ని గడపడమని నిర్వచించింది. అయితే ప్రాణాన్ని, స్వేచ్ఛను హరించే హింస చాలా జరుగుతూ ఉంది. దాని గురించి పౌరహక్కుల ఉద్యమం మౌనంగా ఉంది. నిశ్శబ్దం ఇబ్బందికరమైన విషయం. కొంత కాలంగా సామాజిక వ్యవస్థలోని ఆధిపత్య స్థానాల నుండి పుట్టే హింసకు వ్యతిరేకంగా ఉద్యమించడం పౌరహక్కుల ఉద్యమం నేర్చుకుంది. ఉదాహరణకు, దళితుల మీద జరిగే అగ్రకులాల హింస, స్త్రీల మీద పురుషులు చేసే హింస. అయినా పౌరహక్కుల ఉద్యమం మౌనంగా చూస్తూ ఊరుకుంటున్న హింస ఇంకా చాలా జరుగుతూనే ఉంది.

జీవించే హక్కును ఒక మానవ విలువగా పరిగణిస్తున్నాం కాబట్టి (ఫలానావారి జీవించే హక్కు అని కాకుండా) ఈ మౌనానికి సంజాయిషీ చెప్పడం తప్పనిసరి. ఇలాంటి ఇబ్బందికర పరిస్థితుల్లో ఒక సమాధానం ఏమిటంటే 'హింసాత్మక చర్యలను పట్టించుకోవడానికి చట్టం ఉంది. న్యాయవ్యవస్థ ఉంది. కాబట్టి మేము స్పందించనక్కరలేదు' అని. ఇలా అనడమంటే చట్టానికి, న్యాయవ్యవస్థకు సాధికారత (లెజిటిమసీ)ను ఇవ్వడమే. కానీ వేరే సందర్భాలలో పౌరహక్కుల ఉద్యమం ఈ సాధికారతను నిరాకరిస్తూ ఉంటుంది. దాని గురించి తర్వాత మాట్లాడతాను.

ఇది పూర్తిగా చట్టపరమైన వాదన. పౌరహక్కుల ఉద్యమ దృక్పథం పూర్తిగా చట్టపరమైనదే అయివుంటే ఈ వాదన సంతృప్తికరంగా ఉండేది. 'చట్టముంది, పరిపాలన కచ్చితంగా దాని ప్రకారం జరగాలి' అనేదే పౌరహక్కుల ఉద్యమం సాధారణ అవగాహన అయివుంటే, అప్పుడు కేవలం చట్టపరమైన ఈ వాదన సరియైనది అవుతుంది. కానీ పౌరహక్కుల ఉద్యమం అవగాహన చట్టంతో పాటు రాజకీయ, సామాజిక, నైతిక వాదనల సమ్మేళనం.

నిజానికి చట్టానికి ఈ మాత్రం స్థానం కూడ ఇవ్వకూడదని ఒక్కొక్కసారి అంటుంటారు. చట్టపరమైన వాదన ఒట్టి భ్రమ అని, సామాజిక, రాజకీయ సమస్యలను మాత్రమే మాట్లాడాలి అని వాదిస్తారు. (ఇందులో ఆసక్తికరమైన మరో కోణమేమిటంటే చట్టాన్ని భ్రమ అని కొట్టిపారేసేవాళ్లే నైతికతనూ భ్రమగా ఎగతాళి

చేస్తారు.) అన్ని హింసలనూ ఎందుకు ఖండించరు అనే ప్రశ్నకు సమాధానం చెప్పేటప్పుడు మాత్రం పూర్తిగా చట్టపరమైన వాదన చేయడం సంతృప్తికరం ఎట్లా అవుతుంది?

పౌరహక్కుల ఉద్యమంలో పనిచేసే అందరినీ ఇది ఇబ్బంది పెడుతుంది. పోలీసుల కస్టడీలో నిందితులు మరణించినప్పుడు మనం ఖండిస్తాం. నిందితుడు చేసిన నేరం గురించి ప్రజలు సాధారణంగా మనల్ని ప్రశ్నిస్తారు. "ఇతను మా ఇంట్లో జొరబడి మేం పొదుపు చేసుకున్న వస్తువులు దొంగిలించినప్పుడు మీరెక్కడున్నారు?" అని అడుగుతారు. అలాంటి నేరాన్ని పట్టించుకోవడానికి చట్టముంది, చట్టం తన పని తాను చేసుకుపోతుంది అనే సమాధానం అన్నిసార్లు సంతృప్తికరంగా ఉండదు. ఈ సమాధానం సరియైనది కాదని కాదు నా ఉద్దేశం. కాని అన్ని సందర్భాలకు ఈ సమాధానం పూర్తిగా సరిపోదు. ఒకరి హక్కులను మనం సమర్థించినప్పుడు, వారి చర్యలకు కూడ మనం కొంతమేర జవాబుదారులం అవుతామనేది సాధారణ నైతికసూత్రం. ఇతర సందర్భాలలో పరిహసించబడే చట్టాలమీద పూర్తి బాధ్యతను పెట్టలేము. ఉదాహరణకు, కస్టడీలో చంపబడిన వ్యక్తి చిన్న చిన్న దొంగతనాలు చేసేవాడైతే "చట్టం తన పని తాను చేసుకుపోనీ, ఆ పేదవాని నేరాన్ని మేము ఖండించం" అని అనగలము.

అంతేకాదు, చట్టం అతని నేరాన్ని అతని దారిద్ర్యం దృష్ట్యా కొంత దయతో చూడాలని అంటాం. అయితే కస్టడీలో చనిపోయిన వ్యక్తి కిరాయి హంతకుడైతే, ప్రజలకు సమాధానం చెప్పేటప్పుడు "అతను చేసిన హత్యలను మేము ఖండిస్తాం" అని చెప్పాల్సిన అవసరం రావడం పౌరహక్కుల ఉద్యమంలో పనిచేసే కార్యకర్తలందరికీ అనుభవమే. వాళ్ళు చేసిన చర్యలలోని న్యాయాన్యాయాలలో తేడా ఉంటుంది. ఆ చర్యలలోని న్యాయాన్యాయాల జోలికి పోకుండా, పూర్తిగా చట్టపరమైన వాదన ఇవ్వడం అనేది అన్ని సందర్భాలలో సాధ్యం కాదని పౌరహక్కుల కార్యకర్తలు తెలుసుకున్నారు.

నేరాలు రెండే రెండు రకాలు అయిఉంటే చాలా బాగా ఉండేది. బలవంతులు బలహీనుల మీద చేసేవి, బలహీనులు బలవంతులకు వ్యతిరేకంగా చేసేవి. అప్పుడు నైతిక సందిగ్ధత ఇంత తీవ్రంగా ఉండేది కాదు. వేదికల మీద మాట్లాడేటప్పుడు పౌరహక్కుల కార్యకర్తలు సాధారణంగా రెండే రకాల నేరాలు ఉన్నట్లు మాట్లాడతారు. కాని అది వాస్తవం కాదు. మనం తరచుగా కష్టతరమైన నిర్ణయాలు చేయవలసి ఉంటుంది. పేదవాడు బాగా ధనవంతుల నుండి కాకుండా,

సాధారణంగా మధ్యతరగతి నుండి, కింది వర్గాల నుండి మాత్రమే దొంగిలిస్తాడు. ధనవంతుల నుండి దొంగతనం చేయడం సులభం కాదు. వాళ్లకు కాపలాకుక్కలు, కాపలా మనుషులు ఉంటారు. అందువల్లనే దొంగతనం సామాజిక సంపదను పునఃపంపిణీ చేసే ప్రక్రియ అనే వాదన అన్నిసార్లు సరియైంది కాదు. కాకపోతే బహిరంగ సభల్లో ఇలా మాట్లాడి చప్పట్లు కొట్టించుకోవచ్చు.

హింస అనే సమస్యకు - అది రాజకీయపరమైనదైనా కాకపోయినా పౌరహక్కుల, ప్రజాస్వామిక దృక్పథం నుండి సులభమైన సమాధానం లేదు. హింసగా సాధారణంగా పిలవబడేది భౌతిక హింస మాత్రమే. కాని వ్యవస్థితమైన హింస చాలా ఉంటుంది. అసమానత్వం, దోపిడీ, అస్వతంత్రత కూడ హింసే. తరచుగా భౌతిక హింసకు ఈ వ్యవస్థాపరమైన హింసతో సంబంధం ఉంటుంది. ఇది రోజువారీ సాధారణ హింసాత్మక సంఘటనలకే కాక, రాజకీయ తిరుగుబాటుదారుల హింసకు కూడ వర్తిస్తుంది. కాని దీని అర్థం వ్యవస్థీకృత హింస పేరుతో భౌతిక హింసను సమర్థించుకోవచ్చునని కాదు. ఆకలితో ఉన్న ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తిని కొట్టి డబ్బు దొంగిలిస్తే ఆ హింస ఆకలి కారణంగా సమర్థనీయమే అనిపిస్తుంది. కాని దాడికి గురైన వ్యక్తి దోపిడీదారుడు కాకపోవచ్చు. శ్రమచేసి జీవించే వ్యక్తి కావచ్చు. అలాంటప్పుడు సమర్థించడం సమస్య అవుతుంది. రాడికల్ పౌరహక్కుల సిద్ధాంతకారుల ఉపన్యాసాల్లో మాత్రమే ఇలాంటి సమస్య ఉండదు. వారి మాటల్లో రెండే రెండు వర్గాలు ఉంటాయి. దోపిడీదారులు, దోపిడీకి గురయ్యేవారు. అంతేకాదు, దోపిడీకి గురయ్యేవాళ్లు చేసే అన్ని రకాల హింసలు - వ్యక్తిగతమైనా, వ్యవస్థీకృతమైనా - దోపిడీదారులకు వ్యతిరేకంగానే ఎక్కుపెట్టబడతాయి. కాని వాస్తవంలో సమాజం చాలా సంక్లిష్టంగా ఉంటుంది. అలాగే హింసాత్మక చర్యలూను. మొత్తం హింసను సమర్థించడమూ సాధ్యం కాదు. అన్నీ ఖండించాల్సిన అవసరమూ ఉండదు. ఒక హింసాత్మక చర్యను సమర్థిస్తున్నామంటే అర్థం అది వ్యవస్థీకృత హింసయొక్క అనివార్యమైన పరిణామమని, లేదా అలాంటి వ్యవస్థీకృత హింసను అధిగమించడానికి తప్పనిసరి అయిన చర్య అని. కాని ఈ రెండు విషయాలనూ నిరూపించడం సాధారణంగా సాధ్యం కాదు. అయితే సామాజిక వ్యవస్థలోని వ్యవస్థీకృత హింసతో ఈ చర్యకు ఉన్న సంబంధాన్ని చూపడం సాధ్యమే, అది అవసరం కూడ.

అణచివేతకు గురౌతున్న వాళ్ళ హింసను పూర్తిగా సమర్థించడమో లేక పూర్తిగా ఖండించడమో కాక, ఆ నిర్దిష్ట సామాజిక నేపథ్యంలో ఆ హింసను అర్థం

చేసుకోవడానికి ప్రయత్నించడం సాధ్యమవుతుంది. హింసను అర్థం చేసుకోవడమంటే దానిని ఒక అనివార్యమైన పరిణామంగానో ఒక అవసరమైన చర్యగానో అర్థం చేసుకోవడం కాదు. వాస్తవంలో దానికీ సామాజిక వ్యవస్థకూ మధ్య ఉన్న సంబంధాన్ని చూడడమే. సామాజిక సందర్భాన్ని అర్థం చేసుకోవడానికి చేసే ప్రయత్నానికి రెండు ప్రయోజనాలు ఉంటాయి.

భౌతిక హింస మీద మాత్రమే దృష్టిని కేంద్రీకరించవద్దనీ, సామాజిక వ్యవస్థలో నిర్మితమై ఉన్న హింస వైపు దృష్టిని సారించమనీ సమాజంపైన ఒత్తిడి పెట్టడం, ముందుగా ఆ హింసకు పరిష్కారాన్ని కనుగొనవలసిన అవసరాన్ని చూడమనడం మొదటిది. రెండవది - సామాజిక అణచివేత నుండి పుట్టిన హింస విషయంలో చట్టము, న్యాయవ్యవస్థ కొంత ఉదారమైన వైఖరిని ప్రదర్శించాలని కోరడం. ఈనాడు ఉన్న చట్టం కూడ ఆత్మరక్షణ, ఆస్తుల రక్షణ సందర్భాలలో చేసే నేరాలపట్ల, క్షణికోద్రేకంలో చేసే నేరాలపట్ల ఉదార దృక్పథాన్నే అవలంబిస్తుంది. సామాజిక అణచివేతతో ముడిపడి జరిగే నేరాలకు కూడ ఈ ఉదార వైఖరిని విస్తరింప జేయవచ్చు. ఇది చాలా సున్నితమైన కృషి. దీనిని సాధించడానికి పౌరహక్కుల ఉద్యమం తనను తాను హింసకు దూరంగా ఉంచుకోవాల్సిన అవసరం ఉంటుంది. తద్వారా హింసను ప్రజాస్వామికంగా అర్థం చేసుకోమని, దానికున్న సామాజిక నేపథ్యాన్ని చూడమని ఒత్తిడి పెట్టడానికి వీలౌతుంది. రాజ్యానికీ, హింసకు పాల్పడేవారికీ మధ్య ఒక తృతీయశక్తిగా లేక తటస్థ శక్తిగా ఉండడం అవసరం అవుతుంది. ఈ తృతీయరంగాన్ని ప్రజాస్వామిక విలువలు, సూత్రాల ప్రాతిపదికన నిర్వచించుకోవాలి. ఈ తృతీయరంగమే ఈ విషయంలో పౌరహక్కుల ఉద్యమ కార్యరంగం. కాని సమాజంలో రెండు వర్గాలు మాత్రమే ఉన్నాయని, ఏ విషయంపైన అయినా రెండు అభిప్రాయాలే ఉంటాయని, రెండు వైఖరులు మాత్రమే ఉంటాయని అనుకునేవాళ్ళు దీనిని అంగీకరించరు, అంగీకరించలేరు. కాని అలాంటి దృక్పథంలో పౌరహక్కుల ఉద్యమానికి స్థానం లేదు. దానిని విడిచిపెట్టవలసి ఉంటుంది.

మనం హింస గురించి మాట్లాడేటప్పుడు చట్టం గురించి, చట్టబద్ధ పాలన గురించి తప్పకుండా మాట్లాడాలి. చట్టమే అణచివేత స్వభావం కలిగినదని, ప్రజలకు చట్టాలను అతిక్రమించే హక్కు ఉన్నదని పౌరహక్కుల ఉద్యమంలో ఒక అభిప్రాయం ఉంది. ఇది సరియైన అభిప్రాయమని నేను అనుకోవడం లేదు. నిజానికి అధికారంలో ఉన్నవారికన్నా, ధనవంతులకన్నా చట్టబద్ధ జీవితం పేదవారికి,

బలహీనులకే ఎక్కువ అవసరం. పేదవారి గురించి మనం మాట్లాడుతున్నప్పుడు వాళ్ళు నిరంతరం పోరాటాల్లో ఉన్నవాళ్ళుగా మాట్లాడకూడదు. అలాంటప్పుడు మాత్రమే చట్టం, చట్టబద్ధత అవరోధాలుగా కనిపిస్తాయి.

నిజానికి పోరాటాలకు చట్టం ఎంత వ్యతిరేకంగా ఉండగలదో అంత సహాయకారిగా కూడ ఉండగలదు. పోరాటాల్లో ఉన్న ప్రజలు తరచుగా చట్టం సహాయం తీసుకుంటూ ఉంటారు. పోరాటమంటే హింస అని అనుకున్నప్పుడు మాత్రమే చట్టం సహాయకారిగా కన్నా అవరోధంగా కనిపిస్తుంది. కాని పోరాటమంటేనే హింస అనుకోవడం సమంజసం కాదు. పేదవారిని, అణచివేతకు గురౌతున్నవారిని నిరంతరం రాజకీయ పోరాటాల్లో మునిగితేలుతున్న వారిగా చూడడం అనేదే తప్పు. పేదలు, అణచివేతకు గురౌతున్నవారు అత్యధిక శాతం సాధారణ జీవితాన్ని గడుపుతుంటారు. ఈ సాధారణ జీవనానికి చట్టబద్ధ సమాజం అవసరం. ధనవంతులకన్నా, బలవంతులకన్నా పేదలే ఎక్కువగా చట్టరహిత సమాజంలో ఇబ్బందుల పాలవుతారు. పేదల సాధారణ జీవనాన్ని కాక కేవలం పోరాటాలను మాత్రమే పట్టించుకొనే పౌరహక్కుల ఉద్యమం తన పూర్తి కర్తవ్యాన్ని నిర్వర్తించదు. ఈ మధ్యాహ్నం జరగబోయే సమావేశంలో 'చట్టబద్ధపాలన - వర్గపోరాటం' అనే అంశం మీద ఇద్దరు వక్తలు మాట్లాడబోతున్నారు. వర్గపోరాటాల గురించి మాత్రమే ఎందుకు మాట్లాడాలి, అణచివేతకు గురౌతున్న ఇతర సామాజిక బృందాల పోరాటాల గురించి ఎందుకు మాట్లాడుకోకూడదు అనే ప్రశ్నను పక్కన పట్టినా, 'చట్టబద్ధ పాలన - రోజువారీ జీవితం' అనే అంశాన్ని గురించి కూడ మాట్లాడినప్పుడు మాత్రమే చట్టం యొక్క పాత్రను పూర్తిగా అర్థం చేసుకోగలము.

చట్టం ధనవంతులకు, బలవంతులకు ఎంత అవసరమో బహుశా వాళ్ళకన్నా ఎక్కువగా పేదవాళ్ళకు, బలహీనులకు అవసరం. అయితే ఇక్కడున్న వైరుధ్యం ఏమిటంటే, చట్టం అనేది జీవితానికి అవసరం అయిన స్థిరత్వాన్ని, భద్రతను ఇవ్వడమేకాక అసమాన సామాజిక సంబంధాలను స్థిరీకరిస్తుంది. పునరుత్పత్తి చేస్తుంది. కాబట్టి రోజువారీ జీవనంలోనూ, అసమానత్వాన్ని అధిగమించడానికి చేసే పోరాటక్రమంలోనూ పేదలు చట్టాన్ని ఒక అణచివేత శక్తిగా కూడ ఎదుర్కొంటారు. జీవించడానికి వాళ్ళకు చట్టం అవసరం. కాని వాళ్లు కోరుకునే జీవితాన్ని మెరుగుపరచుకోవడానికి కొన్నిసార్లు వాళ్ళు చట్టాన్ని అతిక్రమించవలసి వస్తుంది. మార్పుపట్ల చట్టం సున్నితంగా ఉన్నంతవేరకు, చట్టాన్ని ఉల్లంఘించడానికి సంపూర్ణమైన హక్కు కావాలనడం పేదలకు, అణచివేతలకు

గురౌతున్న వారికి అవసరం కాదు. అటువంటి విధ్వంసక దృక్పథం పేదల జీవితాన్ని దుర్భరం చేస్తుంది. అయితే అన్యాయమైన చట్టాలను వ్యతిరేకించే హక్కు ఉండాలి. హేతుబద్ధమైన చట్టాలను అన్యాయంగా ప్రయోగించడాన్ని కూడ వ్యతిరేకించే హక్కు ఉండాలి. ఇందులో విప్లవాత్మకమైనదేమీ లేదు. మహాత్మాగాంధి కూడ ఈ మాటలు అన్నాడు. పౌరహక్కుల ఉద్యమం న్యాయమనుకునేది మహాత్మాగాంధి న్యాయమనుకున్నది ఒకటి కాకపోవచ్చు. కాని సూత్రప్రాయంగా అంతకు మించి పౌరహక్కుల ఉద్యమం చెప్పగలిగింది లేదు.

కాబట్టి చట్టానికి ఉండే సాధికారతను తిరస్కరించవలసిన అవసరం లేదు. అది ప్రజలకు హాని చేస్తుంది. కాని చట్టం చుట్టూ ఉండే మిథ్యను తొలగించాల్సిన అవసరం మాత్రం ఉంది. చట్టబద్ధమైనదంతా న్యాయమేనని, చట్ట వ్యతిరేకమైనదంతా అన్యాయమని ఈ భ్రమ అంటుంది. ఇది నిజం కావాల్సిన అవసరం లేదని మనకు తెలుసు. చట్టం సాధికారతను తిరస్కరించకుండానే దాని చుట్టూ ఉండే ఈ మిథ్యను తొలగించడం అనే లక్ష్యాన్ని పౌరహక్కుల ఉద్యమం స్వీకరించాలి. అది చాలా సున్నితమైన, సంక్లిష్టమైన లక్ష్యం. చట్టమే అణచివేతకు ఒక భావజాల సాధనం అని అనడం మానేసి పౌరహక్కుల ఉద్యమం ఈ లక్ష్యాన్ని స్వీకరించాలి.

## పౌరహక్కుల ఉద్యమం - రాజకీయ హింస

పైన చెప్పిన విషయాలు సంఘటిత, అసంఘటిత హింసలు రెండిటికీ వర్తిస్తాయి. అయితే అణచివేతకు గురయ్యే ప్రజల ఆకాంక్షల నుండి విశ్వాసాల నుండి, సమస్యల నుండి ఉత్పన్నమయ్యే రాజకీయ హింస గురించి ఇంకొన్ని విషయాలు మాట్లాడుకోవలసి ఉంది.

హింసను కాసేపు పక్కన పెడదాం.

పౌరహక్కుల ఉద్యమానికీ, ప్రజల కోరికల నుండి, విశ్వాసాల నుండి పుట్టిన రాజకీయ ఉద్యమాలకూ మధ్యవున్న సంబంధం ఎలాంటిది? మొదటగా వాటి మధ్య సంబంధం అసలు ఎందుకు ఉండాలి? సామాజిక సంబంధాలను, విలువలను, సంస్థలను ప్రజాస్వామ్యీకరించడం పౌరహక్కుల ఉద్యమ లక్ష్యం. ఇది నిర్మాణాత్మక సంస్కరణ ద్వారానైనా జరగవచ్చు లేదా రాజకీయ ఉద్యమాలు పెట్టే ఒత్తిడి ద్వారానైనా జరగవచ్చు. అందువల్లనే ప్రస్తుతమున్న చట్టంతోనూ రాజకీయ వ్యవస్థతోనూ పౌరహక్కుల ఉద్యమానికి సంబంధం ఉంటుంది. అదే

విధంగా పీడితుల రాజకీయ ఉద్యమాలతో పౌరహక్కుల ఉద్యమానికి సంబంధం ఉంటుంది. రాజకీయ ఉద్యమకారులు మొదటిదానిని సంస్కరణవాద భ్రమగా వర్ణిస్తారు. ప్రభుత్వం రెండవ అంశాన్ని తీవ్రవాద సంబంధాలుగా వర్ణిస్తుంది. వాళ్ళేమన్నప్పటికీ పౌరహక్కుల ఉద్యమానికి రెండూ అవసరమే.

కాని రాజకీయ ఉద్యమాలతో ఎలాంటి సంబంధం ఉండాలి? పీడితుల రాజకీయ ఉద్యమాలకు రెండు కోణాలున్నాయి. పీడితుల జీవన పరిస్థితులలో నుండి వచ్చిన ప్రజాస్వామిక ఆకాంక్షలు మొదటిది. ఉద్యమాన్ని నడిపించే ఉద్యమసంస్థలు లేక పార్టీలు చేపట్టే రాజకీయ కార్యక్రమాలు, ఎత్తుగడలు, సిద్ధాంత సూత్రీకరణలు రెండవది. పౌరహక్కుల ఉద్యమం ప్రధానంగా మొదటిదాన్నే పట్టించుకుంటుంది. ఉద్యమాల వెనక ఉన్న ప్రజాస్వామిక ఆకాంక్షలను పౌరహక్కుల ఉద్యమం స్వీకరించి ప్రస్తుతమున్న ప్రజాస్వామిక దృక్పథంలో భాగం చేయడానికి ప్రయత్నిస్తుంది. రాజకీయ ఉద్యమాలు సాధారణంగా తమ సామాజిక పునాదితోనే సంభాషిస్తాయి. పౌరహక్కుల ఉద్యమం సమాజంలోని ఇతరులకు విజ్ఞప్తి చేస్తుంది. ఉద్యమాలలోని ప్రజల ఆకాంక్షల గురించి ఆలోచించమని ఒత్తిడి పెడుతుంది. సమాజంలో రెండే రెండు వర్గాలు, రెండే ప్రయోజనాలు, రెండే అభిప్రాయాలు ఉంటాయి అని నమ్మేవాళ్లు ఈ ప్రధానమైన తేడాను అర్థం చేసుకోలేరు.

అలాంటివాళ్ళు పౌరహక్కుల ఉద్యమం రాజకీయ తిరుగుబాటు ఉద్యమంతోనే తన గొంతు కలపాలని, లేకపోతే శత్రువుతో కలిసి పోయినట్టేనని ఒత్తిడి చేస్తారు. కాని ఇందుకు విరుద్ధంగా, రాజ్యానికీ (పీడకులకూ) పీడితుల ఉద్యమాలకూ మధ్య ఒక మూడవ (నాల్గవ, అయిదవ) క్షేత్రం, కార్యరంగం ఉన్నాయన్న విశ్వాసంపైన పౌరహక్కుల దృక్పథం ఆధారపడింది. ఈ కార్యరంగం ఉండేది చైతన్యంలోని విలువలలో. పౌరహక్కుల ఉద్యమం ఆ కార్యరంగంలో పనిచేస్తుంది. పీడితుల ఉద్యమాలు ముందుకు తీసుకొచ్చే ప్రజాతంత్ర ఆకాంక్షలకూ విలువలకూ అక్కడ చోటు కల్పించాలని ప్రయత్నం చేస్తుంది. అందుకోసం కృషి చేస్తుంది. ఈ విలువలను, ఆకాంక్షలను సాధ్యమైనచోట వ్యవస్థీకరించడానికి ప్రయత్నం చేస్తుంది. రాజకీయ ఉద్యమాల గొంతుతో కాకుండా, తన స్వంత గొంతుతో మాట్లాడినప్పుడు మాత్రమే పౌరహక్కుల ఉద్యమం ఈ పని చెయ్యగలదు. ఆ రాజకీయ ఉద్యమాల సిద్ధాంతం, పరిభాషలో కాకుండా విలువల, ఆలోచనల పరిభాషలో మాట్లాడితేనే ఇది సాధ్యమవుతుంది. పౌరహక్కుల ఉద్యమం పాత్ర,

కర్తవ్యం ఇది అయినప్పుడు, రాజకీయ ఉద్యమాల ఎత్తుగడలు, సిద్ధాంతాల కనుగుణంగా తన అవగాహనను రూపొందించుకోవలసిన అవసరం పౌరహక్కుల ఉద్యమానికి లేదు. వాటితో దానికి సంబంధం లేదు.

పౌరహక్కుల ఉద్యమానికీ, పీడితుల రాజకీయ ఉద్యమాలకూ మధ్య ఉన్న సాధారణ సంబంధం ఇది. రాజకీయ హింసకు ఇది మరింతగా వర్తిస్తుంది. ముందుగానే చెప్పినట్లు జీవించేహక్కు గురించి మాట్లాడే పౌరహక్కుల ఉద్యమం హింస గురించి తేలికగా మాట్లాడజాలదు. హింసకు వెనకవున్న సామాజిక నేపథ్యాన్ని గురించి ఆలోచించమని మాత్రమే చెప్పగలదు. హింస మీదనే దృష్టి అంతా పెట్టకుండా దాని సామాజిక నేపథ్యాన్ని అర్థం చేసుకోవాలని చెప్పగలదు.

రాజకీయ హింస విషయంలో మరింత అప్రమత్తత అవసరం. ఎందుకంటే రాజకీయ హింస యొక్క లక్ష్యం అధికారాన్ని హస్తగతం చేసుకోవడం లేదా అధికారాన్ని స్థాపించడం. పౌరహక్కుల ఉద్యమం నిరంతరం అధికారం పట్ల అనుమానంతోనే ఉండాలి. పౌరులమీద రాజ్యం అధికారం, దళితుల మీద అగ్రకులస్తుల అధికారం, స్త్రీలమీద పురుషుల అధికారం, వెనకబడిన వర్గాలమీద అభివృద్ధి చెందినవారి అధికారం, మైనారిటీలమీద మెజారిటీల అధికారం - వీటి గురించి ఆందోళన చేయడమే పౌరహక్కుల ఉద్యమం ప్రధాన కార్యరంగం కాబట్టి అధికారం కోసం సంఘర్షించే ఉద్యమాలతో పౌరహక్కుల ఉద్యమం భుజం, భుజం కలిపి తిరగజాలదు. ఇది రాజకీయ ఉద్యమాల ప్రజాపునాదిని గుర్తిస్తుంది. ఉద్యమం వెనుకవున్న ప్రజాస్వామిక, సమానత్వ ఆకాంక్షలను అంగీకరిస్తుంది. ప్రచారం చేస్తుంది. కాని ఉద్యమం గొంతుతో తన గొంతు కలపలేదు. అధికారాన్ని ఆశించే వ్యవస్థీకృత ఉద్యమాలకు ప్రతిదీ తమ ఆధిపత్యం క్రిందకు రావాలని ప్రయత్నం చేసే అలవాటు ఉంది. తాము చేసే ప్రతిదానికి అందరి ఆమోదము ఉండాలని ఒత్తిడి చేస్తారు. తామూ ప్రజలూ ఒకటేననే వాదనను అంగీకరించాలని డిమాండ్ చేస్తారు. తమ చర్యలు, నిర్ణయాలు ప్రజలవేనని ఒప్పుకోవాలంటారు. అధికారం ఏర్పరచాలనే తమ కోరిక కారణంగా ప్రస్తుతమున్న సామాజిక పరిస్థితుల పట్ల ప్రజలు విశ్వాసం కోల్పోవాలని ఆ ఉద్యమాలు కోరుకుంటాయి. అంటే ఉన్న సమాజం గురించి 'భ్రమలు' వదులుకోవాలని అర్థం. విశ్వాసం పోగొట్టే కర్తవ్యానికి సహకరించాలని ఆ ఉద్యమాలు అందరిమీద ఒత్తిడి పెడతాయి.

పౌరహక్కుల ఉద్యమం కూడ ఈ ఒత్తిడికి గురౌతుంది. కానీ దానికి పౌరహక్కుల ఉద్యమం లొంగడానికి వీలు లేదు. సమాజం లోపల సంస్కరణలు

తేవడానికి కృషి చేయడం, మౌలికమైన మార్పులు తేవడానికి ఉద్యమించే అవకాశాలను, స్వేచ్ఛను కాపాడడానికి కృషి చేయడం అనే ద్వివిధ కర్తవ్యం పౌరహక్కుల ఉద్యమానికి ఉంటుంది.

సంఘటిత రాజకీయ ఉద్యమాలు ప్రయోగించే హింస విషయంలోనూ పౌరహక్కుల ఉద్యమం మీద ఈ ఒత్తిడి తీవ్రంగా ఉంది. వాళ్లు పాల్పడే అన్ని రకాల హింసలను ప్రజలు చేసే హింసగా భావించాలని పౌరహక్కుల ఉద్యమాన్ని డిమాండ్ చేస్తున్నారు. ప్రజలు హింసకు గురౌతున్నారు కాబట్టి, వాళ్లు తిరిగి హింసాత్మకంగా సమాధానం చెప్పదల్చుకున్నారు కాబట్టి అది ఏ రూపం తీసుకున్నా సమర్థనీయమేనని, ప్రజాస్వామికమేనని సంఘటిత రాజకీయ ఉద్యమాలు వాదిస్తున్నాయి. పౌరహక్కుల ఉద్యమం ఈ వాదనను ప్రచారం చేయడానికి సహాయపడాలని భావిస్తున్నాయి. ఈ ఒత్తిడిని పౌరహక్కుల ఉద్యమం తిరస్కరించాలి. ఆ రాజకీయ సంస్థకు ఉన్న ప్రజామద్దతును గుర్తించడానికి నిరాకరించాల్సిన అవసరం లేదు, నిరాకరించకూడదు కూడ. కాని ఆ సంస్థ చర్యలను, నిర్ణయాలను ప్రజల చర్యలుగా, నిర్ణయాలుగా పరిగణించకూడదు. అవన్నీ ఆ సంస్థల నిర్ణయాలు, చర్యలు. అవి ఆ సంస్థలు రూపొందించుకొనే ఎత్తుగడలలో భాగంగా ఉద్దేశపూర్వకంగా తీసుకొనే నిర్ణయాలు. హింసకు పాల్పడడానికి సంస్థలకు భిన్నమైన కారణాలు ఉంటాయి. ఈ అన్ని కారణాలను పీడిత ప్రజల న్యాయబద్ధమైన కోపానికి ఆపాదించలేము. ఆ న్యాయబద్ధ కోపం పేరుమీదే రాజకీయ సంస్థలు తమ హింసాత్మక చర్యలకు మద్దతు పలకమని డిమాండ్ చేస్తాయి. అది సాధ్యం కాదు.

సంఘటిత సాయుధ పోరాటాల హింసను పరిశీలిస్తే ఆ హింసకు ఈ క్రింది కారణాలను గుర్తించడం సాధ్యపడుతుంది.

1. ప్రజలు నిజంగా ద్వేషించే, అసహ్యించుకునే క్రూరమైన అణచివేత స్వభావం గల వ్యక్తుల మీద జరిగే హింసాత్మక చర్యలు.
2. సాధారణ ప్రజలు ద్వేషించినా, ద్వేషించకపోయినా ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోతున్న సంస్థ కార్యకలాపాలను అడ్డుకుంటున్న వ్యక్తులుగా ఆ సంస్థ భావించేవారి మీద జరిపే హింసా చర్యలు.
3. ఒక వ్యక్తి సంస్థకు అడ్డుగా లేకపోయినా, ప్రజల శత్రువు కాకపోయినా శత్రు శిబిరంలోని వ్యక్తి అయితే అతని చావుతో శత్రుశిబిరంలో

భయోత్పాతం సృష్టించడం సాధ్యం అనుకుంటే అటువంటి వ్యక్తిపై జరిపే హింసాత్మక చర్యలు.

4. పోలీసులలో భయోత్పాతం సృష్టించడానికి ఎవరో ఒక పోలీసు ఉద్యోగిని అతను వ్యక్తిగతంగా దుశ్చరితుడు కాకపోయినా చంపడం లేక పాలకపార్టీలో భయోత్పాతం సృష్టించడానికి పార్టీలోని ఏ సభ్యుడినైనా (అతను వ్యక్తిగతంగా దుశ్చరితుడు కాకపోయినా) చంపడం.

5. సంస్థల రాజకీయ ప్రయోజనాలకు, వారి ఆదేశాలకు వ్యతిరేకంగా పనిచేస్తున్న వాళ్లమీద చేసే హింసాచర్యలు. అటువంటి వ్యక్తులు ప్రజలకు శత్రువులు కాకపోవచ్చు. కేవలం తమ రాజకీయ స్వేచ్ఛను తమ ఇష్టానుసారం వినియోగించుకోవడమే వారి తప్పు కావచ్చు.

6. వివాదాలలో మధ్యవర్తిత్వం వహించినప్పుడు, సమస్యలను పరిష్కరించి నప్పుడు, శిక్షలను విధించినప్పుడు జారీచేసిన తమ ఆదేశాలను అమలు చేయడానికి ఉద్దేశించిన హింసాత్మక చర్యలు. అలాంటి హింసాత్మక చర్యలు తరచుగా ఎలాంటి హేతబద్ధమైన సూత్రాలనూ పాటించవు.

7. బస్సులు, టెలిఫోన్ ఎక్స్ఛేంజ్లు, కోర్టులు, బ్యాంకులు, రెవెన్యూ ఆఫీసులు లాంటి ప్రభుత్వ ఆస్తులను పేల్చివేయడం, కాల్చివేయడం. అలాంటి చర్యలు తరచుగా ప్రజలకు చాలా అసౌకర్యాన్ని, అపాయాన్ని కలగజేస్తాయి.

తెలంగాణ నుండి కాశ్మీరు, అస్సాంల వరకు హింసాత్మక పోరాటాలను నిర్వహిస్తున్న సంస్థలు పాల్పడుతున్న రకరకాల హింసాత్మక చర్యలు ఇవి. ముందుగానే చెప్పినట్లు ఈ హింసనంతా ప్రజల హింసగా గుర్తించాలని, అణచివేతకు వ్యతిరేకంగా ప్రజల కోపం నుండి పుట్టిన హింసగా దాన్ని సమర్థించాలని డిమాండ్ చేయడం జరుగుతూ ఉంది. ఇదంతా నిజానికి ఒక రాజకీయ సంస్థ చేసే హింస మాత్రమే. ఆ సంస్థకు ప్రజలలో బలమైన మద్దతు ఉంటే ఉండవచ్చు.

ఇలాంటి హింసకు పౌరహక్కుల ఉద్యమం ఎలా స్పందించాలి? హింస పట్ల పౌరహక్కుల ఉద్యమం అనుసరించాల్సిన సాధారణ దృక్పథాన్ని ఇంతకుముందే వివరించాను. అది : హింసను సమర్థించకుండానే, సామాజిక వ్యవస్థతో, అందులో అంతర్గతంగా ఉన్న వ్యవస్థీకృత హింసతో దానికి ఉన్న సంబంధాన్ని, ఆ హింసకు వెనుక ఉన్న కారణాలను అర్థం చేసుకోమని సమాజాన్ని అభ్యర్థించడం; దానిపట్ల ప్రజాస్వామికంగా వ్యవహరించమని కోరడం.

ప్రజల తరపున పనిచేసే సంస్థలనూ, ప్రజలనూ ఒకటిగా పరిగణించే ప్రశ్నే లేదు. ప్రజల పేరు మీద అవి చేసే హింసను సమర్థించే ప్రశ్నే లేదు. కాని ప్రజల సమస్యలను, విశ్వాసాలను, న్యాయం కోసం సమానత్వం కోసం వారి ఆకాంక్షలను ఈ హింసకు ఉన్న సామాజిక సందర్భంగా గుర్తు చేయడం అవసరం. ఆ సామాజిక సందర్భాన్ని ఎత్తిచూపాలి. హింసాత్మక పోరాటాలు సాగిస్తున్న సంస్థల పట్ల, అవి చేసే హింస పట్ల, వాటికి సామాజిక పునాదిగా ఉన్న ప్రజల పట్ల నాగరికంగా, ప్రజాస్వామికంగా వ్యవహరించాలని రాజ్యాన్ని, సమాజాన్ని కోరాలి.

రాజకీయ హింస పట్ల పౌరహక్కుల ఉద్యమం అవగాహన ఇంతటితో పూర్తి అయిపోలేదు. రాజకీయ ఉద్యమాల హింసాత్మక చర్యలను కొన్నిసార్లు ఖండించవలసి వస్తుంది. ఈ విషయంలో పనిగట్టుకొని సృష్టించిన గందరగోళం చాలా ఉండడం వలన, ఖండించవలసింది హింసను కాదని అన్యాయమైన హింసను అని స్పష్టం చేయాల్సివుంది. ఇక్కడ అన్యాయం ప్రధాన విషయం. సామాజిక అన్యాయం నుండి, న్యాయం కొరకు ప్రజలలో ఉన్న ఆకాంక్షల నుండి ఈ ఉద్యమాలు పుట్టాయని చెపుతున్న పౌరహక్కుల ఉద్యమం ఆ ఉద్యమాలే అన్యాయంగా ప్రవర్తిస్తే చూస్తూ వూరుకోలేదు. ఆ అన్యాయం హింసాత్మక రూపం తీసుకున్నప్పుడు అసలే సాధ్యం కాదు. హింసా రాజకీయాలను ముందుకు తెచ్చేవాళ్ళకు అలాంటి విమర్శ నచ్చదు. కాబట్టి పౌరహక్కుల ఉద్యమం చట్టపద్ధతులలో పరిష్కారం కాని సమస్యలను ప్రజలు హింసాత్మక పద్ధతులతో పరిష్కరించుకొంటుంటే ఖండిస్తున్నారు అనే అభిప్రాయాన్ని సృష్టించడానికి ప్రయత్నిస్తున్నారు. ఇది ఉద్దేశ్యపూరితమైన వక్రీకరణ.

ఇంతకు ముందే వివరించినట్లు హింసకు ఉన్న నేపథ్యాన్ని అర్థం చేసుకోమని పౌరహక్కుల ఉద్యమం ఒత్తిడి పెడుతుంది. ఎలాంటి హింసనూ అది సమర్థించనప్పటికీ, అలాంటి అనివార్యమై పోయిన హింసాత్మక చర్యలపట్ల ప్రజాస్వామికంగా వ్యవహరించమని అడుగుతుంది. చట్టం కూడ సరళంగా వ్యవహరించాలని కోరుతుంది. కాని న్యాయం కోసం జరిగే పోరాటం పేరు మీద జరిగే అన్యాయాన్ని మాత్రం పౌరహక్కుల ఉద్యమం తప్పక ఖండించాలి. పౌరహక్కుల ఉద్యమం పరిభాష న్యాయాన్యాయాలకు సంబంధించింది కాబట్టి, రాజకీయ సంస్థల హింస వెనక ఉన్న ప్రజల న్యాయమైన ఆకాంక్షలను గుర్తించమని సమాజాన్ని కోరుతుంది కాబట్టి... ఈ హింస అన్యాయమైన రూపం తీసుకున్నప్పుడు అది నిశ్శబ్దంగా ఉండజాలదు.

రాజకీయ హింసకు పాల్పడుతున్న వాళ్ళకు ఈ విమర్శ నచ్చదు కాబట్టి, పౌరహక్కుల ఉద్యమ కార్యకర్తలు భయపడిపోయారనో, రాజ్యానికి అమ్ముడు పోయారనో వాళ్ళు ఆరోపిస్తారు. పనికిమాలిన ఈ విమర్శకు జవాబు చెప్పడం అనవసరం. సమాజంలో ఎవరైనా పీడితుల వైపైనా, పీడకుల వైపైనా ఉండక తప్పదనీ ఈ రెండింటి మధ్య మూడవ మార్గం ఏమీ లేదనే వాదనతో పై విమర్శను సిద్ధాంతపరంగా సమర్థిస్తారు. పీడితులవైపు లేనివాళ్ళు అనివార్యంగా పీడకులవైపు ఉన్నారని అంటారు. పైకి సబబుగానే కనిపించే ఈ వాదనలో పీడితులు, వారి తరఫున పనిచేసే రాజకీయ ఉద్యమాలు ఒకటే అనే ఉద్దేశ్యపూర్వకమైన వాదన ఉంది. ఉద్యమాన్ని విమర్శించడమంటే పీడితులను ఖండించడమే అని, అంటే పీడకులతో చేతులు కలపడమే అని వాదిస్తున్నారు. ఇలాంటి వాదన చెల్లదు. పౌరహక్కుల ఉద్యమం పీడితులతోనే ఉంటుంది కాని వాళ్ళు, వాళ్ళమీద ఆధారపడిన పార్టీలు చేసేదానినంతా సమర్థించడం అనే అర్థంలో కాదు. న్యాయం కొరకు ప్రజలలో ఉన్న ఆకాంక్షలను సమర్థిస్తుంది అనే అర్థంలో ప్రజలతోనే ఉంటుంది. ఈ పక్షపాతంవల్లనే పీడితుల ఆకాంక్షల నుండి పుట్టిన ఉద్యమాల అన్యాయమైన చర్యలను కూడ విమర్శిస్తుంది.

పౌరహక్కుల ఉద్యమం, ఇతర ఉద్యమాలలాగే, చరిత్ర నుండి తప్పక నేర్చుకోవాలి. కార్మిక రైతాంగ వర్గాల అవసరాల కోసం, సోషలిజం, ప్రజాస్వామ్యం అనే ఆదర్శాలకోసం ముందుకొచ్చి రాజ్యాధికారం చేజిక్కించుకున్న పార్టీలు ఆ తరువాత కాలక్రమంలో ఆ ప్రజలకూ ఆ ఆదర్శాలకూ శత్రువులుగా మారిన వైనాన్ని ఈ శతాబ్దపు కమ్యూనిస్టు ప్రభుత్వాల చరిత్రలో చూడాలి. దానినుండి గుణపాఠం తీసుకోవాలి.

ప్రజలను, పార్టీలను, సంస్థలను వేరుచేసి చూడడం మొదటి నుండి మనం నేర్చుకుంటే మంచిది. సంస్థలకు, రాజకీయ పార్టీలకు ఉన్న ప్రజాదరణను గుర్తించడం ఎంత అవసరమో, వాటిని వేరుచేసి చూడడం కూడ అంతే అవసరం.

పౌరహక్కుల ఉద్యమం ఏ రాజకీయ ఉద్యమం వెనకా పరుగెత్తజాలదు. అన్ని సమస్యలకు పరిష్కారాన్ని చూపించగల ఒకే ఒక ఉద్యమం, అన్ని ఆకాంక్షలను తీర్చగల ఒకే ఒక ఉద్యమం ఏదీ లేదు. వాస్తవికత చాలా కోణాలు కలిగినది. బహుముఖమైనది. అలాగే వాస్తవికతను మార్చాలనే కృషి కూడ. ఈ బహుముఖమైన కృషిలో పౌరహక్కుల ఉద్యమానికి తనదైన పాత్ర ఉంది. చారిత్రకంగా సాధించిన ప్రజాస్వామిక విలువలను, వ్యవస్థలను ముందుకు తీసుకురావడం, రాజకీయ

పోరాటాల ద్వారా ఇంకా ముందుకు తీసుకుపోవడానికి అవకాశాలను పెంచడం, రాజకీయ ఉద్యమాలలోని ప్రజాస్వామిక అంశాన్ని సమాజంలో ప్రచారం చేయడం, అలాంటి ఉద్యమాలపట్ల వాటి హింసాత్మక చర్యలపట్ల న్యాయమైన దృక్పథాన్ని పెంచడానికి కృషి చేయడం, న్యాయం కొరకు పోరాటం చేస్తున్న సంస్థల, పార్టీల ప్రవర్తన అన్యాయమైన రూపం తీసుకుంటే వ్యతిరేకించడం పౌరహక్కుల ఉద్యమ కర్తవ్యాలు. అది ఏ రాజకీయ ఉద్యమానికీ పరిచారికగా ఉండజాలదు.

*చూపు మాసపత్రిక*
*మే-ఆగస్టు 1997*

*'ప్రజాస్వామిక ఉద్యమాలు - మానవహక్కుల దృక్పథం' అనే అంశంపై ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం 1997 జూన్ 14-15 తేదీలలో హైదరాబాద్‌లో నిర్వహించిన రెండు రోజుల సదస్సు కోసం రాసిన పత్రం. ఇంగ్లీషులో రాసిన ఈ వ్యాసాన్ని ఆయనే ఆ తర్వాత 'చూపు' పత్రిక కోసం తెలుగులోకి అనువాదం చేసి ఇచ్చారు.*

# తెలంగాణలో వంద గొంతులు వినిపించాలి

వార్తలు రాయమంటే కథలు రాసి పంపిస్తే సంపాదకులు ఒప్పుకోరు. అందరి కథలూ అచ్చు వేయాలంటే ఎనిమిది పేజీల పేపరు ఎనభై పేజీలయినా సరిపోదని న్యాయంగానే అభ్యంతరం చెప్తారు. అయినా, అడ్వర్టైజ్‌మెంట్లు పోను, సినిమా బొమ్మలూ వ్యాఖ్యలూ పోను, రాజకీయ నాయకుల రచ్చలూ రగడలూ పోను కథలు అచ్చువేయడానికి పేపర్లో చోటెక్కడుంటుంది? పేజీలు ఎనిమిదయితేనేం ఎన్నయితేనేం?

ఉత్తర తెలంగాణలో పనిచేసే విలేఖర్లకు - ముఖ్యంగా చిన్న ఊర్లలో పనిచేసే గ్రామీణ విలేఖర్లకు - ఇంకొక ఫిర్యాదు కూడ ఉంది. తాము పంపించే వార్తల ప్రాముఖ్యాన్ని బేరీజు వేసే 'డెస్క్' సిబ్బందిలో అధిక భాగానికి ఆ నక్సలైట్ల కార్యక్షేత్రాన్ని గురించి, అక్కడి సమస్యల గురించి అంచనా ఉండదని. నిజానికి వారిలో చాలామంది తెలంగాణేతరులే. వాళ్ళకు నక్సలైట్లు ఒక్కొక్కసారి హింసోన్మాదులు గాను, ఒక్కొక్కసారి రొమాంటిక్ హీరోలుగాను, ఒక్కొక్కసారి దారి తప్పిన సోదరులుగాను, ఒక్కొక్కసారి తమ తుపాకులతో న్యాయాన్ని నిలబెట్టే అభినవ అవతార పురుషులుగాను కనిపిస్తారు. ఆ తెరలను ఛేదించుకొని అక్కడి ప్రజలనూ ప్రజా జీవితాన్ని చూడలేని వారు అక్కడి వార్తల ప్రాముఖ్యాన్ని అంచనా వేయలేరు. (ఆ తెరలు నెలకొనడంలో నక్సలైట్ల బాధ్యత కూడ లేకపోలేదు).

వార్త మాత్రం సేకరించి వచ్చేసే విలేఖరికి ఇదేదీ పెద్దగా బాధ కలిగించదు. అది 'సింగిల్ కాలం' వార్తా లేక 'డబుల్ కాలం' వార్తా

అని నిర్ధారించుకొని అంతమేరకు మాత్రమే విషయ సేకరణ చేసి పెన్నూ పుస్తకం మూసేసి లేచి వెళ్లిపోయే విలేఖరి మనసులో ఆనాటి వార్తలను బస్సెక్కించేసిన తరువాత వాటి అవశేషాలేమీ మిగలవు. ఆ విలేఖరి ధన్యజీవి అనుకోవచ్చు. అంత యాంత్రికమైనది ఒక జీవితమే కాదనుకోవచ్చు. మన దృష్టిని బట్టి ఏమైనా అనుకోవచ్చు.

కానీ మనుషుల కష్టసుఖాలు పేపర్లో ఒకటో రెండో 'కాలం'ల వార్తలుగా మారిపోవడం తప్పనిసరి అని గుర్తించినా, వాటిని తన మది నుండీ తన జ్ఞాపకాల నుండీ తరిమి వేయలేని విలేఖరి ఏం చేయాలి? తాను పని చేసేది మామూలు ప్రాంతం కానట్టయితే, బరువయిన కథలకు నిలయమైన ఆదిలాబాద్ బొగ్గు గనుల సీమ అయితే, మనసులో ఆ బరువును పెంచుకొని ఎన్నాళ్లు ఊరకుండాలి?

ఆ జ్ఞాపకాలు బద్దలై కథలు కాక తప్పదు. వాటిని కథకులకు చెప్పి రాయించవచ్చు. తానే కథా రచన అలవరచుకొని రాయవచ్చు. లేదా విన్నది విన్నట్టు - పేర్లు, స్థలాలు కొంచెం మార్చి (ప్రైవసీ మీద గౌరవం కొద్దీ కావచ్చు, పరువునష్టం దావాలంటే భయంకొద్దీ కావచ్చు, పోలీసోళ్లు సాహిత్యం సహితం చదువుతారన్న స్పృహకొద్దీ కావచ్చు) - రాసి, ఇదిగో నేను విలేఖరిగా రాయలేకపోయిన పూర్తి కథ ఇది అని మన ముందుంచవచ్చు.

మునీర్ ఈ చివరి మార్గం ఎంచుకున్నాడు. ముడిసరుకును కథగా మలచకుండా ముడిసరుకుగానే అందియ్యడాన్ని విమర్శించే వాళ్లుంటారు. ఇది కూడ ఒక సాహిత్య ప్రక్రియేనని విశ్లేషించే వాళ్లుంటారు. ఎవరేమనుకున్నా మునీర్ తన మనసులోని బరువు దించుకున్నాడు. రచయితలంతా నిజానికి ఈ పనే చేస్తారు. రచనకు సామాజిక ప్రయోజనాలు ఎన్నయినా ఉండవచ్చుగానీ రచన వల్ల రచయితకుండే ప్రయోజనం ఇది. సాహిత్యం స్వభావ స్వరూపాలను నిర్ణయించటంలో ఈ ప్రయోజనానికీ పాత్ర ఉంటుంది. అది సాహిత్యమా కాదా, అభ్యుదయమా కాదా అని తర్కించడం విమర్శకుల వంతు.

ఆదిలాబాద్ బొగ్గుగనుల జీవితంతో పరిచయం లేని వాళ్లు ఈ వార్తా కథనాలకు ఏ విధంగా స్పందిస్తారో చెప్పలేను. బాగా దూరంగా బ్రతికే వాళ్లను ఈ కథనాలు పెద్దగా కదిలించకపోవచ్చు. (రాజకీయ పక్షపాతం కదలిక వంటి అనుభూతి కొంత కలిగించవచ్చుననుకోండి.) అటువంటప్పుడు వాళ్ల కోసమైనా ఇంకెందు కోసమైనా మునీర్ తన కథనాన్ని తన నిత్య జీవిత భాషలో స్వచ్ఛంగా చెప్పకుండ తన వృత్తి కోసం తాను అలవరచుకున్న దినపత్రికల తెలుగుతో కలగలపి చెప్పడం అనవసరమేమో!

బొగ్గు బావుల జీవితంతో పరిచయం ఉన్న వాళ్లను ఈ వార్తా కథనాలు తప్పక కదిలిస్తాయి. తమ పరిచయాలనూ జ్ఞాపకాలనూ నెమరువేసుకునేటట్టు చేస్తాయి. ఊర్లనూ మనుషులనూ సంఘటనలనూ జ్ఞప్తికి తెస్తాయి.

పొద్దున్నా సాయంత్రం కార్మికుల ఇళ్లల్లో వంటలయిపోయేదాకా తెల్లటి మంచులాగ వీధులను కమ్మి ఉండే బొగ్గు పొయ్యిల పొగ, నెత్తిన హెల్మెట్ పెట్టుకొని బొగ్గుతో యుద్ధానికి పోతున్న సైనికుల లాగ బారులు తీరి సైకిళ్ల పైన డ్యూటీకి పోయే కార్మికుల గుంపులు, చేసిన శ్రమ అంతా అలసటై గొంతులో కూర్చున్నట్టు ముక్తసరిగా కరుకుగా మాట్లాడే వారి స్వరాలు, తెలంగాణ గ్రామీణ సంస్కృతికీ పెరిగిన జీతాల వల్ల మధ్యతరగతి పట్టణ సంస్కృతి అంచుకు చేరుకున్న జీవనశైలికీ పొంతన కుదరక వింత రూపం తీసుకుంటున్న కార్మిక జీవన సంస్కృతి ('గీ పోరి ఎటుపోయిందో' అని వెతికే తల్లికి 'మా ఫ్రెండ్ ఇంటికి పోయాను మమ్మీ' అని జవాబు చెప్పడం నేర్చుకుంటున్న ఈ తరం పిల్లలు), 'పెద్ద పోరడిని పనిలోన బెట్టినము గానీ గీ చిన్నోడు దాన్ల దీన్ల తిరుగుతాండు గదా పోలీసోల్ల చేతులల్ల గన పడుతడేమో' నన్న దిగులు, ఎన్‌కౌంటర్ వార్త వినగానే 'ఎవల్ల పోరడో'నని వాకబు చేసే ఆరాటం, ఎవరయినా ఎన్నడయినా తన్నకపోతారా అని తాము ఎదురు చూస్తున్న దుర్మార్గుడికి 'అన్నలు' దేహశుద్ధి చేసారని తెలిస్తే కళ్లలో వెలిగే సంతృప్తి, మిలిటెంట్ల దుందుడుకు చర్యల గురించి, 'అన్నల' అనాలోచితమైన నిర్ణయాల గురించి, రౌడీలుగా మారిన 'మాజీల' గురించి విరక్తిగా మాట్లాడుకునే పెదవి విరుపు మాటలు, యూనియన్ల పేరు చెప్తే విమర్శ, పోలీసుల ప్రస్తావన వస్తే ఛీత్కారం, 'అన్నల' మాట తీస్తే తగ్గు స్వరంతో ముక్తసరిగా మాట్లాడే రెండు మాటలు, 'అన్నలు గా చాకలి మల్లేశం కాల్రెక్కలిరగ్గొట్టిన్రంట' అంటే మౌనంగా దిక్కులు చూస్తూ టాపిక్ మార్చే దాకా ఊరకుండే ముఖాలు - ఇవీ ఇంకా ఎన్నో జ్ఞాపకం వస్తాయి.

బొగ్గు బావుల వర్తమాన స్థితిని గురించి పూర్తి చిత్రం ఇవ్వడానికి మునీర్ మరికొన్ని ప్రముఖమైన ఘటనల కథనాలు కూడ చేర్చి ఉండవచ్చును. చేర్చిన వాటిని ఇంకొక రకంగా కూడ వ్యాఖ్యానించి ఉండవచ్చును. మనం చూపించే సత్యం మనం ఎంపిక చేసుకునే ఘటనలను బట్టి, వాటిని మనం వ్యాఖ్యానించే పద్ధతిని బట్టి ఉంటుంది (నస్పూర్‌లో పోలీసులు సజీవంగా దహనం చేసిన సికాస నాయకుడు మాదిరెడ్డి సమ్మిరెడ్డి హత్యోదంతం అందరికీ తెలుసును. పోలీసుల క్రూరత్వం మీద దృష్టిపెట్టి ఆ ఘటనను వ్యాఖ్యానిస్తే మనకు ఒక వాస్తవం తెలుస్తుంది. చుట్టూ వందల సంఖ్యలో గుమిగూడి ఆ ఘోరకాండను అచేతనంగా చూస్తూ ఉండిపోయిన కార్మికుల మీద దృష్టిపెట్టి వ్యాఖ్యానిస్తే వేరే కొన్ని వాస్తవాలు తెలుస్తాయి).

అదెట్లాగున్నా ఈ కథనాలు మునీర్ మనసు నుండి పుట్టినవి. అతను చూపించదలచుకున్న దృశ్యం అతను మనస్ఫూర్తిగా నమ్మినది. ఈ కథనాలలోని పక్షపాతం ప్రదర్శన కోసం తెచ్చి పెట్టుకున్నది కాదు.

ఒక ప్రేక్షకుడిగా ప్రదర్శించేది కూడ కాదు. తాను నమ్మిన సత్యాన్నీ న్యాయాన్నీ నిస్సంకోచంగా కాగితం మీదికి ఎక్కించాలన్నదొక్కటే మునీర్ ఆరాటం కాదు (అదొక్కటే అయినా మెచ్చుకోవచ్చు). ఆ సత్యాన్నీ న్యాయాన్నీ కాపాడడానికి దైనందిన జీవితంలో కృషి చేయడం కూడ తన కర్తవ్యమేనని - విలేఖరిగానూ వ్యక్తిగానూ - మునీర్ నమ్మాడు. 'ఆ సంకల్పం ఉందంటేనే నువ్వొక నక్సలైటువన్నమాట' అన్న పోలీసుల బెదిరింపులకు లొంగకుండ అతను ఆ నమ్మకాన్ని ఆచరించే ప్రయత్నం చేసాడని ఈ కథనాలే చెప్తాయి.

ఉత్తర తెలంగాణలో న్యాయన్యాయాల గురించి గుసగుసలుగా మాట్లాడడానికి చాలామంది సిద్ధమే కానీ ఈ సంకల్పం మాత్రం కొద్దిమందిలో మాత్రమే ఉంటుంది. అభిప్రాయ భేదాలతో నిమిత్తం లేకుండా ఈ సంకల్పాన్ని మనం గౌరవించడం నేర్చుకోవాలి. అప్పుడే మానవత్వాన్ని నిలబెట్టగలుగుతాం. అంతే కాదు, అప్పుడే తెలంగాణను కాపాడగలుగుతాం.

ఉత్తర తెలంగాణ ఈ రోజు ఒక విషమ స్థితిని ఎదుర్కుంటూ ఉంది. ప్రభుత్వానికీ నక్సలైట్లకూ మధ్య అదొక 'యుద్ధభూమి'గా మారిపోయింది అనడం కొంత మేరకు మాత్రమే అతిశయోక్తి. ప్రజల జీవితం ప్రజల చేతుల నుండి జారిపోయిందనడం కూడ కొంతమేరకు వాస్తవమే. ప్రజలు ప్రభుత్వాన్నీ 'అన్నల'నూ ఒకే రకంగా చూడరు. ఒకే మోతాదులో గౌరవించరు, ప్రేమించరు. (ప్రభుత్వాన్ని ఉత్తర తెలంగాణలోనే కాదు ఎక్కడా ప్రజలు పెద్దగా గౌరవిస్తున్నట్టుగానీ అసలు ప్రేమిస్తున్నట్టు గానీ కనిపించదు.) అయినప్పటికీ 'ఇద్దరి మధ్యా ప్రజలు నలిగిపోతున్నారు' అనేది అన్ని సందర్భాలలోనూ అబద్ధం కాదు.

తెలంగాణ ప్రజల మనోభావాల్ని శోధిస్తే అందులో కనిపించేది విప్లవ రచయితలు ఊహించే 'పోరాట చైతన్యం' కాదు (ఎప్పుడో కొన్ని సందర్భాలలో తప్ప). కొంత ఉత్సాహం, కొంత ఆశ, కాగల కార్యం గంధర్వులు తీరుస్తారన్న సంతృప్తి కొంత, ఎటుపోయి ఎటువస్తుందో నన్న భయం కొంత, 'మా చేతిలో ఏం లేదు' అనే నిర్లిప్తత కొంత, 'ఇదంతా ఎందుకోసం?' అనే సందేహం కొంత, విరక్తి కొంత. దీనంతటినీ కలిపి టోకున 'పోరాట చైతన్యం' అనీ, 'ప్రజల ప్రతిఘటనా చైతన్యం' అనీ పేరు పెట్టడం దుస్సాహసం అవుతుంది.

ఈ యుద్ధరంగం మళ్లీ జీవన రంగంగా మారాలి. దానిని మార్చుకోవడానికి చైతన్యవంతమైన కృషి కావాలి. 'నాకెందుకొచ్చింది' అనుకోని చొరవ కావాలి. సంకల్పం కావాలి. అవి తగిన మోతాదులో ముందుకు రాకపోతే ఉత్తర తెలంగాణకు ప్రస్తుత పరిస్థితి నుండి విముక్తి లేదు.

ఇందుకు భిన్నంగా, ఉత్తర తెలంగాణలో జీవితమే యుద్ధంగా మారిందని నమ్మేవాళ్లున్నారని నాకు తెలుసును. వాళ్ల దృష్టిలో బహుశా ఇప్పుడు కావలసింది యుద్ధం చేసే తెగింపు ఇంకొంచెం పెరగడం మాత్రమే. ఇది వాస్తవికమైన అభిప్రాయం అని నేను అనుకోవడం లేదు. ఇక్కడ జీవితమే యుద్ధంగా మారలేదు. జీవితంపైన యుద్ధం తన పాదం మోపింది. అయితే అది జీవితంతో సంబంధం లేని యుద్ధం కాదు. అయినప్పటికీ అది 'జీవన యుద్ధం' కాదు. జీవితం కోసం యుద్ధం చేయాలని తెలంగాణ ప్రజలలో ఎక్కువ మంది అనుకోకముందే యుద్ధం వచ్చేసింది. మొదలయిన ఆ యుద్ధం ప్రజలకు ఆ సంకల్పం నేర్పించాలని ఆశిస్తూ ఉంది. అది ప్రజల జీవితాలతో సంబంధం లేని యుద్ధం కాదు కాబట్టి ప్రజలు దానిలో ఏదో ఒక మేరకు భాగస్వాములు అవుతున్నారు. ఇష్టంగా కొందరు, అయిష్టంగా కొందరు, ఇష్టం అయిష్టం కలిసిన సందిగ్ధ స్థితిలో కొందరు తెలంగాణ పేద ప్రజానీకం దానిలో భాగం అవుతున్నారు. అది తప్ప వేరే జీవితం తెలియని తరం ఒకటి తయారవుతున్నది. ఈ యుద్ధం ఆదర్శాల కంటే దాని బలప్రయోగ సామర్థ్యానికి ఎక్కువగా ఆకర్షితులవుతున్న తరం ఇప్పటికే తయారయింది. ఆ సామర్థ్యానికి సలాం కొట్టి తమ స్వప్రయోజనాలు సాధించుకునే అవకాశవాద మూక కూడ తయారయింది.

ఈ స్థితిలో తెలంగాణకు అవసరమైన చొరవ చాలా సంక్లిష్టమైనది. ఇప్పుడు వినిపిస్తున్న రెండు గొంతులే కాక మూడవ గొంతు, నాల్గవ గొంతు, నూరవ గొంతు వినిపించడం మొదలు కావాలి. మునీర్ 'రవ్వంత సానుభూతి, ఆలోచన' కోరుకున్నాడు. మునీర్ ఒప్పుకున్నా ఒప్పుకోకున్నా తెలంగాణ పరిస్థితి అంతకంటే ఎక్కువే కోరుకుంటుందని నేను అనుకుంటున్నాను. ఆ దిశగా ఈ కథా చిత్రాలు మిమ్మల్ని ఆలోచింపజేస్తే సంతోషం.

*అముద్రితం*

*21 అక్టోబర్ 1997*

*మంచిర్యాల విలేఖరి ఎండి మునీర్ పుస్తకానికి ముందుమాటగా రాశారు కాని ఆ పుస్తకం అప్పట్లో అచ్చు కాలేదు. మరికొన్ని వ్యాసాలతో కలిపి 'అమ్మా... తుఝె సలామ్' పేరుతో అది 2011లో ఈ ముందుమాట లేకుండానే అచ్చయింది.*

# చీకటికోణాలు

నక్సలైట్ ఉద్యమం వల్ల జరిగిన మేలు గురించి చెప్పేవాళ్ళూ రాసేవాళ్ళూ చాలామంది ఉన్నారు కాబట్టి నేను ఆ ఉద్యమం చీకటి కోణాల గురించే చెప్తాను. ఆ ఉద్యమం వల్ల చాలా మేలు జరిగిన మాట వాస్తవమే. ఎం.ఎల్ పార్టీల సామాజిక పునాది అయిన తెలంగాణ గ్రామ పేదలకూ ఏజెన్సీ ఆదివాసులకూ మాత్రమే కాదు, మొత్తంగా మన సమాజానికి మేలు జరిగింది. (మరికొన్ని వర్గాలకు కూడ మేలు జరిగింది అనే బదులు 'మొత్తంగా సమాజానికి మేలు జరిగింది' అనడంలో ఎక్కడో కొంచెం భావవాద బలహీనత దాగి ఉందని వారు అనుకుంటే అనుకోవచ్చుగాక.) కానీ కీడు కూడ జరిగింది. జరుగుతూ ఉంది. ఇది కాకతాళీయంగా దొర్లిన పొరబాట్ల వల్ల జరుగుతున్న కీడు కాదు. ఆ ఉద్యమం అనుసరిస్తున్న పద్ధతుల నుండి వచ్చిన కీడు. దాని గురించి నిర్మొహమాటంగా మాట్లాడుకోవాలి. విమర్శను పొగడ్తల మధ్య బ్రాకెట్లలో ఇరికించనక్కరలేదు. వారిని ప్రశంసించవలసి వచ్చినప్పుడు ప్రశంసించవచ్చును. కానీ విమర్శను విమర్శగానే, విడిగానే చర్చకు పెట్టాలి. అభ్యుదయం కోసం ప్రాణాలు తీసే హక్కు తమకుందనీ, ఏది అభ్యుదయమో నిర్ణయించుకొనే విజ్ఞత సహితం తమకుందనీ ప్రకటించుకునే వారిని బహిరంగంగానే బోనులో నిలబెట్టి ప్రశ్నించాలి. ఇతరుల హక్కులను (జీవించే హక్కుతో సహా) విప్లవం కోసం హరించడానికి ఎంత మాత్రం వెనకాడని వారిని విమర్శించడానికి

మనం వెనకాడనక్కరలేదు. వెనకాడినట్టయితే శాస్త్రీయ విజ్ఞతను తమకు తాము ఆపాదించుకొని ఆ పార్టీలు తీస్తున్న ప్రాణాలకూ, హరిస్తున్న హక్కులకూ, ప్రజలకు కలిగిస్తున్న కష్టాలకూ మనమందరం కూడ బాధ్యులం అవుతాము. ఈ విషయం గుర్తించడానికి, గుర్తించిన తరువాత కూడ మాట్లాడటానికి ఈ రాష్ట్రంలోని ప్రజాతంత్రవాదులు చాలామంది - నాతో సహా - చాలా కాలం అన్నీ తెలిసీ తటపటాయించటం వల్ల చాలా నష్టం జరిగిందనుకుంటాను. ఈ విమర్శను పోలీసులు ఉపయోగించుకుంటారనీ, నిర్బంధానికి అనుకూల ప్రచారంగా వాడుకుంటారనీ అనే వారున్నారు. నిజానికి ఆ భయంతోనే చాలా కాలం ఊరుకున్నాం. అయితే ఈ విమర్శ వల్ల పోలీసులకూ, ప్రభుత్వ నిర్బంధానికీ వచ్చే ప్రయోజనం కన్నా ప్రజలకూ ఉద్యమాలకూ సమాజానికీ ఎక్కువ ప్రయోజనం ఉంది. అంతేకాదు, ప్రభుత్వానికి ప్రయోజనం మాత్రమే ఉండవచ్చు. సమాజానికి అవసరం కూడ ఉంది.

తెలంగాణను పట్టి పీడించిన దొరతనాన్ని అంతం చేసింది నక్సలైట్లేననేది వాస్తవం. ఆ పని బలప్రయోగంతోనే చేసారు. ఇంకొక విధంగా కూడ జరిగి ఉండేదేమోగానీ ఈ విధంగా జరిగిందన్న సత్యాన్ని కాదనలేము. ఇది తెలంగాణ ఎం.ఎల్ ఉద్యమం వల్ల పొందిన ప్రయోజనం. దొరల దోపిడీ పీడనల కింద నలిగిన పీడిత కులాల, వర్గాల ప్రజలు మరీ ముఖ్యంగా పొందిన ప్రయోజనం. అయితే నక్సలైట్ల కృషి అక్కడితో ఆగిపోలేదు. తమ సాయుధ ఆధిపత్యం కిందనే విప్లవం వస్తుందనీ, శ్రామిక ప్రజలకు దోపిడీ నుండి శాశ్వత విముక్తి లభిస్తుందనీ ఆ పార్టీలు నమ్ముతాయి. దొరతనం మీద చేసిన పోరాటం వల్ల, కూలి పోరాటాల వల్ల, భూమి పోరాటాల వల్ల తమకు లభించిన సామాజిక పునాదిని ప్రాతిపదిక చేసుకొని అవి సమాజం మీద సాయుధ ఆధిపత్యం నెలకొల్పే దిశగా వ్యూహరచన చేసుకొని అమలు చేస్తున్నాయి. ఈ క్రమంలో కూడ పేద, పీడిత ప్రజలకు వారు కొంత మేలు చేస్తూనే ఉన్నారు. ఆ ప్రజల సాంఘిక ఆర్థిక సమస్యలు కొంత తీరుస్తున్నారు, లేదా తీర్చే ప్రయత్నం చేస్తున్నారు. దాని నుండే ఈ పార్టీలు తమ చర్యలకూ తమ రాజ్యాధికార వ్యూహానికీ సాధికారత, ప్రజామోదం కోరుకుంటాయి. మందుపాతరలు పేల్చి మూకుమ్మడి హత్యలకు పాల్పడినా, డైనమైట్లతో ప్రభుత్వ కార్యాలయాలు, బ్యాంకులు, టెలిఫోన్ ఎక్స్ఛేంజీలు పేల్చేసినా, బస్సులు కాల్చేసినా, ఇన్ఫార్మర్ల పేరిట స్పష్టమైన ఆధారం ఉన్నా లేకున్నా హత్యలు చేసినా, అందులోనూ పేదలనే ఎక్కువగా హత్యచేసినా, తమ రాజకీయ ప్రత్యర్థులతోనూ, తమకు అడ్డం

కదా అని. అంటే పొలాలకు సాగు నీరు, యువతకు ఫ్యాక్టరీలలోనో వేరొక చోటనో ఉద్యోగాలు కల్పించమంటున్నారు. సాగునీటి వ్యవస్థను పెంపొందించడానికి ఉట్నూరు పీఠభూమి పైన ఉన్న ఎగుడు దిగుడు నేలలలో అవకాశం పుష్కలంగా ఉంది. ఏ గ్రామానికి పోయినా తమ పొరుగున ఉన్న ఒక వాగు గురించో, ఒక వంక గురించో, దానిపైన కట్టగల ఆనకట్ట గురించో చెప్తారు. పదే పదే జరిగే 'జన్మభూముల' పైన పెట్టే ఖర్చు వీటిపైన పెడితే ఈ పొలాలకు సాగునీరు లభిస్తుంది కదా, అప్పుడు వర్షాభావం ఉన్న సంవత్సరాలలో సహితం తినడానికి ఇంత ఉంటుంది కదా అంటారు. ఐటిడిఏ స్కూళ్ల పుణ్యాన అంతో ఇంతో చదువుకుంటున్న ఆదివాసీ యువకులకు ఉద్యోగ అవకాశాలు కల్పిస్తే 'పనికి బియ్యం' పథకం కోసం ఎదురుచూడరు కదా అంటారు. ఈ మాటలు వినడానికి మన రాష్ట్ర ప్రభుత్వం సిద్ధంగా లేదు. పోనీ తాను ఆర్భాటంగా ప్రకటించుకునే కరువు సహాయ పథకాలనయినా సమగ్రంగా అమలు చేస్తుందా అంటే పది శాతం కూడ చేయదు. మరి ప్రజల గతి ఏం కావాలి?

*ప్రజాతంత్ర వారపత్రిక*

*19 మే 2002*

# పిల్లికి చెలగాటం

అలిపిరి ఘటనకు అవకాశం కల్పించిన భద్రతా వైఫల్యాలను గురించి విచారణ జరపమని ప్రకాశ్‌సింగ్ గారిని రాష్ట్ర ప్రభుత్వం కోరగా, ఆయన ఆ విచారణ కంటే రాజకీయ ప్రకటనలు చేస్తూ తనకు ఇచ్చిన పరిధిని దాటి వ్యవహరిస్తున్నారని తెలుగుదేశం పాలకులు కోపగించుకుంటూ ఉండవచ్చు.

సాధారణ పత్రికా పాఠకులకు ఆ ప్రకటనల పట్ల కోపం వచ్చినా రాకున్నా ప్రకాశ్‌సింగ్ గారి వ్యవహారశైలి కొంచెం ఆశ్చర్యమయితే కలిగించి ఉండాలి. ఆయనకు అప్పగించింది పూర్తిగా సాంకేతిక స్వభావం గల కర్తవ్యం కాగా ఆయన నక్సలైట్లతో మాట్లాడతాననీ, వాళ్లు కలవకపోతే వారి మిత్రులతోనయినా మాట్లాడతాననీ ప్రకటించడం, తిరుపతిలో పని ముగించుకొని హైదరాబాద్ వచ్చి ఇక్కడ దిల్‌కుష్ గెస్ట్‌హౌస్‌లో మకాం వేసి భద్రతా వ్యవస్థలతోనూ, వాటి యోగ్యాయోగ్యాలతో ఏమీ సంబంధం లేని వారిని సహితం పిలిచి మాట్లాడడం ఆశ్చర్యం కలిగించే విషయాలే మరి.

అధికారంలో ఉన్నవారి లీలలకు అలవాటుపడిన మన పత్రికా విలేఖరులు ప్రకాశ్‌సింగ్ గారిని ఈ విషయం అడిగినట్టు లేరు గానీ అడిగిన వారికి ఆయన వివరణ ఇస్తూనే ఉన్నారు.

వారికి ప్రభుత్వం ఇచ్చిన విచారణా లక్ష్యాలు రెండంట. ఒకటి, మొన్నటి అక్టోబర్ 1 నాడు అలిపిరి వద్ద ముఖ్యమంత్రి పైన హత్యా

ప్రయత్నం జరగడాన్ని పసిగట్టలేక పోవడానికి కారణమైన భద్రతా వ్యవస్థ వైఫల్యాలను గుర్తించడం. రెండు, ఇటువంటివి పునరావృతం కాకుండ ఉండడానికి తగిన సూచనలివ్వడం. ఈ రెండవ లక్ష్యాన్ని పెట్టడంలో ప్రభుత్వం ఉద్దేశం భద్రతా వ్యవస్థను పటిష్టం చేసే సలహాలు ఒక నిపుణుడి నుండి పొందుదామని. అయితే ఆయన భద్రతా వైఫల్యాలు పునరావృతం కాకుండ ఉండడానికి కాక, ముఖ్యమంత్రి పైన హత్యా ప్రయత్నం పునరావృతం కాకుండ ఉండడానికి తగు సూచనలు ఇమ్మన్నట్టుగా తన విచారణ రెండవ లక్ష్యాన్ని అర్థం చేసుకొని తదనుగుణంగా సాగుతున్నారు.

బాగుంది కదూ?

గతంలో జాతీయ మానవ హక్కుల కమిషన్ చైర్మన్‌గా ఉండిన జస్టిస్ వర్మగారు ఇంకొక కోణం నుండి ఇదే పని చేసారు. రాష్ట్రంలో పోలీసులు తమ కనుసన్నలలో నడుచుకునే నేరస్తుల ముఠాలను తయారు చేసుకొని - లేదా తయారు కానిచ్చి - ప్రజలను భయభ్రాంతులకు గురి చేస్తున్నారని ఆయనకు ఫిర్యాదు చేస్తే, 'ఇవన్నీ చిన్న విషయాలు - అసలు విషయానికొద్దాం' అంటూ పీపుల్స్‌వార్‌నూ, రాష్ట్ర ప్రభుత్వాన్నీ ఒక దగ్గరకు తీసుకొచ్చి కూర్చోబెట్టే ప్రయత్నం చేద్దాం రమ్మని ఆహ్వానించారు.

ఆయుధాలు పట్టుకున్న వారికి ఏవో తీరని కోరికలు ఉండే ఉంటాయి కాబట్టి వారిని కూర్చోబెట్టి మాట్లాడి సగమో ముప్పావో తీర్చేస్తే సమస్య సమూలంగా పరిష్కారం అయిపోతుంది కదా, ఈ లోపల ఎన్‌కౌంటర్ల గురించి విచారణలు, ముఖ్యమంత్రికి జడ్ కేటగిరీ రక్షణలు - ఇవన్నీ ఎందుకు అన్న వైఖరి ఆయనకు బలంగానే ఉన్నట్టుంది.

ప్రభుత్వానికి పీపుల్స్‌వార్‌కు మధ్య చర్చలు జరగాలని మరి కొంత సహేతుకంగా అందరం కాంక్షించాము గానీ దాని లక్ష్యం సమస్యను ఒక్కసారిగా పరిష్కరించేయడం కాదు. ఆ చర్చల ప్రక్రియతో బాటు - లేదా దానిలో భాగంగా - పాలకుల అణచివేత విధానాలలోనూ అన్నల ప్రతిఘటనా విధానాలలోనూ కూడ మెరుగుదల తీసుకొచ్చే ప్రయత్నం జరగాలని భావించాము, భావిస్తున్నాము. ఎందుకంటే ఏది సమస్య, ఏది పరిష్కారం అన్న విషయంలో ఏకీభావం లేని పరిస్థితిలో దేనినీ పరిష్కరించేయడం జరిగే పని కాదు కాబట్టి.

కమ్యూనిస్టు విప్లవకారుల విషయంలో ఇంతకంటే వేరే ఏ వైఖరీ సహేతుకమైనది కాబోదు. అయితే, మన దేశంలో సాయుధ పోరాట రాజకీయాలను

కూడ ఒక రాజకీయంగా గుర్తించి దానితో సమాజం సహజీవనం చేయవలసి వస్తే చేయక తప్పదనే వైఖరిని ఆమోదించే ఓపిక సన్నగిల్లుతున్నట్టుంది. ఆకర్షణీయంగా కనిపిస్తున్న 'ఆధునీకరణ' వాతావరణంలో, తుపాకులు పట్టుకొని చెట్లలో పుట్లలో జీవిస్తూ ఏదో మారుద్దామనుకునే రాజకీయ వ్యవహార సరళి గతించిన కాలానికి చెందినదిగా, తెలివితక్కువతనంగా కనిపిస్తున్నట్టుంది.

వేర్పాటువాద జాతీయ పోరాటాలు ఒక్కొక్కటిగా తుపాకులు దించేసి సాధారణ స్రవంతిలోకి వచ్చేస్తుండడం ఈ అసహనానికి ఊతం ఇస్తున్నట్టుంది. నాగా పోరాటకారులతో కాల్పుల విరమణ ఒప్పందం మూడేళ్లుగా అప్రతిహతంగా అమలవుతున్నది. నేడు ఆ ఉద్యమకారులలోని ఒక ప్రధాన భాగం ప్రాంతీయ కౌన్సిల్ ఏర్పాటుతో సంతృప్తి చెంది తుపాకులు అప్పగించేసింది. ఇక అల్ఫా ఆట కట్టించడానికి మనవాళ్లు భూటాన్ రాజును ఒప్పించడంలో కృతకృత్యులు అయినట్టున్నారు. మిజో పోరాటకారులు తుపాకులు అప్పగించేసి చాలాకాలం అయింది.

వాళ్లు వేరు, నక్సలైట్లు వేరు అన్న ప్రాథమిక అవగాహన లేకపోయినట్టయితే అక్కడ జరిగింది ఇక్కడా జరగగలదని అనుకునే అవకాశం ఉంది. మంచో చెడో విప్లవ కమ్యూనిస్టు పోరాటం ఇప్పట్లో తుపాకులు దించే పరిస్థితి లేదు కాబట్టి వారి వ్యూహాన్నీ ప్రభుత్వం ప్రతివ్యూహాన్నీ నియంత్రించి, వారి వ్యూహం వల్ల ప్రజలకు జరగగల కీడును అదుపు చేస్తూ వ్యవహరించడం సమాజం బాధ్యత. అంతే తప్ప, చంబల్ లోయ డాకూలకూ, ప్రభుత్వానికీ ఒకనాడు జయప్రకాశ్ నారాయణ్ కుదిర్చిన ఒప్పందం లాంటిది కుదిర్చి చరిత్రలో నిలిచిపోదామని ఎవరు ఆశించినా వారికి ఏమీ అర్థం కానట్టే లెక్క.

అయితే చంద్రబాబు ఎన్నికల కోసం ఎంచుకున్న ఎత్తుగడ వల్ల ఈ విషయంలో సహేతుకమైన వైఖరికీ అహేతుకమైన ఆశకూ కూడ అవకాశం లేకుండ పోయింది. వేరే ఏదో చూపించి ఎన్నికలకు దిగే పరిస్థితి లేక విరిగిన తన భుజం ఎముకను చూపించి దిగుదామని అతను నిర్ణయించుకోవడం వోట్ల రాజకీయాల పరిధిలో సహితం విజ్ఞత గల చర్యో కాదో ఇంకొక రెండు మూడు నెలల్లో బయటపడగలదు గానీ సామాజికంగా మాత్రం అది అత్యంత నష్టకరమయిన నిర్ణయం. పోలీసు యంత్రాంగం హింసను పెంచి అన్నల నుండి మరింత హింసను ఆహ్వానించే నిర్ణయం.

ప్రజల సంగతేమోగానీ వాళ్లిద్దరూ సంతోషంగానే ఉన్నట్టున్నారు. నక్సలిజమే రాష్ట్రంలో ప్రధాన సమస్య అని ముఖ్యమంత్రే ప్రకటించిన తరువాత ఇంక

పోలీసులను ఆపేది ఎవరు? ప్రధాన సమస్యను ఎదుర్కొనే క్రమంలో జరిగే 'చిన్న చిన్న పొరబాట్ల'ను భూతద్దంలో చూపించవద్దనే పోలీసుల వాదనను ఇంక కాదనేది ఎవరు? పీపుల్స్‌వార్ మాటకొస్తే, ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు వారి పోరాటాల చుట్టే తిరుగుతున్నాయనే పద్ధతిలో రాజకీయ విశ్లేషణ చేయడం ఆ పార్టీకీ, అంతకుమించి వారి అభిమానులయిన మేధావి వర్గానికీ ఎప్పటి నుండో అలవాటు. ఈ అర్ధ సత్యాన్ని సత్యంగా సాక్షాత్తు ముఖ్యమంత్రే ప్రకటించడం వారికి సంతోషం కాకున్నా సంతృప్తి ఎందుకు కలిగించదు?

*ప్రజాతంత్ర వారపత్రిక*
*22 డిసెంబర్ 2002*

# వినని వారికి హితోక్తులు

చర్చల నేపథ్యంలో పీపుల్స్‌వార్ ఏ విధంగా నడుచుకుంటుందనేది చర్చల సాఫల్యానికి చాలా ముఖ్యమైన విషయం.

ప్రభుత్వానికిది వర్తించదా అంటే వర్తిస్తుంది గానీ ప్రభుత్వం వేసే ప్రతీ అడుగు మీదా వెయ్యి కళ్ళు ఉంటాయని దానిని నడిపే వారికి తెలుసును. పీపుల్స్‌వార్ గురించి ఆ మాట అనలేం. ఆ పార్టీ మీదా అది నడిపే పోరాటం మీదా విమర్శనాత్మక దృష్టి సారించడానికి ఇప్పటికీ సమాజం సిద్ధంగా లేదు. ఆ పార్టీనీ దాని సిద్ధాంతాన్నీ ద్వేషించే పిడికెడు మంది మినహా వేరే ఎవ్వరూ - మనసులో ఏమున్నా విమర్శించడానికి తయారుగా లేరు.

అందువల్ల ఏ మాత్రం ఆత్మవిమర్శనా స్ఫూర్తి లేకుండా ప్రవర్తించడం ఆ పార్టీకి అలవాటయిపోయింది. ఒడ్డిగూడెం ఘటననే తీసుకోండి. మన వాడి బలహీనతలను వాడుకుని మన వాళ్లనే చంపించగల పోలీసు సంస్కృతి మీద కోపంతో పాటు మన వాళ్ళు ఇంతటి మహానుభావులా అన్న సిగ్గు కూడ ఆవగింజంత పీపుల్స్‌వార్ స్పందనలో ఉండి ఉంటే ఉచితంగా ఉండేది. దిగజారగల మన వాళ్ళను వాడుకోవడమే కాదు, వాళ్లు దిగజారడం కూడ శత్రువు తప్పే అయినట్టు వ్యవహరించడానికి ఆత్మావలోకన రాహిత్యం చెప్పుకోదగ్గ స్థాయిలో ఉండాలి. లక్ష్మణ్‌ను కోవర్టుగా వాడుకోలేదని బుకాయిస్తున్నందుకు డి.జి.పిని సస్పెండ్ చేయాలి అని ఒడ్డిగూడెం

ఘటనకు స్పందిస్తూ వరవరరావు అన్నారు. లక్ష్మణ్ వంటి కార్యకర్తలను ఉంచుకొని అంతా విప్లవకారులేనని సమాజానికి చెప్తున్నందుకు ఎవరిని సస్పెండ్ చేయాలి? పోలీసులు కోవర్టును తయారు చేస్తున్నారు అన్న అభియోగం ఒక అర్థంలో సత్యమే గాని వారే దానికి పూర్తి బాధ్యులు అన్న అర్థంలో మాత్రం కాదు.

మూడు దశాబ్దాల హింసా ప్రతిహింసల తరువాత శాంతియుత వాతావరణంలో చర్చలకు ఉపక్రమిస్తున్న సీరియస్ తరుణంలో ఒక్క ఘటన జరగగానే - అందులోని సత్యమేమిటో ఇంకా ఎవరికీ తెలియకుండానే డి.జి.పిని సస్పెండ్ చేయాలి అని చర్చల ప్రస్తుత దశలో ముఖ్యపాత్రధారిగా ఉన్న వ్యక్తి ప్రకటించడం సాధారణ మానవులను కించిత్ కలవరపెట్టే ఉంటుంది. మొదటే అక్కడ మొదలుపెట్టారు. ఈసారి ఏమైనా జరిగితే రాజశేఖరరెడ్డినే దిగిపొమ్మంటారా అన్న సందేహం చాలామందికి వచ్చే ఉంటుంది.

ప్రభుత్వమన్నా రాజ్యయంత్రాంగమన్నా సమాజంలో ఎవరికీ పెద్దగా గౌరవం లేదు. ఇది సహేతుకమైన అగౌరవమే. అంత మాత్రం చేత అందరూ పీపుల్స్‌వార్ చేతబట్టిన తుపాకుల సాధికారతను నిస్సంకోచంగా ఆమోదిస్తున్నారనుకుంటే పొరపాటే. ప్రస్తుతం మన దేశంలో నెలకొన్న పరిస్థితులలో పీడిత ప్రజల పక్షాన నిలబడే ఒక మిలిటెంట్ పోరాట సంస్థ ఉండటం మంచిదేనని స్వప్రయోజనాలు లేని వారెవరైనా భావిస్తారనుకుంటాను. ఆపైన ఎవరి ప్రశ్నలూ ఎవరి సందేహాలూ వారికి ఉన్నాయి, ఉంటాయి. పీపుల్స్‌వార్ ప్రతినిధులు ఈ విషయాన్ని ఎరిగి నడుచుకోవడం రాబోయే దినాలలో చాలా అవసరం.

నిషేధం ఎత్తి వేస్తున్నారంట, మొగిలిచెర్ల మీటింగ్‌కు అనుమతి ఇస్తున్నారంట అని తెలియగానే నిరర్థకమైన ఆంక్షలు తొలిగిపోయినందుకూ, ఒక అభిప్రాయం ఉన్నందుకూ విన్నందుకూ భయపడుతూ బతకనక్కరలేని దినం వచ్చినందుకూ సంతోషిస్తున్న వాళ్లు ఉన్నట్టే, మళ్లీ వసూళ్లు మొదలవుతాయేమోనని భయపడుతున్న వాళ్లూ, మళ్లీ వీధికొక అన్న తయారయి మన బతుకులను శాసించడం మొదలవుతుందేమోనని ఆందోళన చెందుతున్నవారూ ఉన్నారు. ఈ భయానికీ ఆందోళనకూ జవాబు చెప్పనక్కరలేదనీ, అవకాశం దొరకగానే అతిగా మాట్లాడే తమ రాజకీయ సంస్కృతితో వాటిని మరింత పెంచినా తప్పేం లేదనీ పీపుల్స్‌వార్ ప్రతినిధులూ అనుయాయులూ అనుకుంటే పాతరోజులే నయమన్న తిరోగామి భావనను చేజేతులా పెంచిన వారవుతారు.

సాయుధ పోరాటం ద్వారా తప్ప మన సమాజంలో మౌలిక మార్పులు తేలేమని నమ్మని వారు సహితం, బలప్రయోగానికి సామాజిక మార్పులో స్థానం లేకపోలేదని గుర్తిస్తారు. అది చాలా రకాలుగా అవాంఛనీయం కావచ్చు గానీ అవాంఛనీయమయినంత మాత్రాన ఏదీ అసత్యమయిపోదు. అందువల్లనే, 'తుపాకులు పట్టుకుని సమాంతర రాజ్యాలు నడుపుతున్న వారితో చర్చలేమిటి' అన్న అభ్యంతరాన్ని మధ్యతరగతిలో సహితం మెజారిటీ ప్రజలు అవాస్తవికమైన అభ్యంతరమని కొట్టిపారేస్తున్నారు. 'చూడొద్దు మాట్లాడొద్దు వినొద్దు' అనే పద్ధతిలో పీపుల్స్‌వార్‌ను ఇంద్రియజ్ఞానం పరిధి నుండి బహిష్కరించడం అవివేకం అని గుర్తిస్తున్నారు. ప్రభుత్వం వారితో కూర్చొని మాట్లాడాలని కోరుకుంటున్నారు.

ఇదంతా సాయుధ పోరాటానికి సపోర్టేననుకోకుండా, దీని పరిధి ఏమిటో ఎరిగి కొంత హుందాగా, గంభీరంగా నడుచుకోవడం ఉచితంగా ఉంటుంది. ప్రస్తుతం సాధారణ మనుషులలో సహితం ప్రభుత్వం చట్టబద్ధంగా వ్యవహరించాలని కోరుకుంటున్న వాళ్లు బలంగా ఉన్నారు. ఈ వైఖరిని కాపాడుకోవడం, నిలబెట్టుకోవడం రాగల రాజకీయ పరిణామాలలో పీపుల్స్‌వార్‌కయినా, ప్రజాశ్రేయస్సుకయినా చాలా అవసరం. ఈ వైఖరిని ఆత్మసంశయంలో పడేసే పనులు చేసే కొద్దీ చర్చల ప్రక్రియలో ప్రభుత్వంలోని అసమ్మతి శక్తులు వేయగల ఎత్తులకు సాధికారత చేకూర్చడమవుతుంది. ఆ శక్తులను తక్కువగా అంచనా వేయడం తగదు.

'స్వేచ్ఛ' ఇంకా నిండుగా వచ్చీ రాకముందే పీపుల్స్‌వార్‌కు స్వేచ్ఛ వస్తే ఇతరుల స్వేచ్ఛ పోతుందనే అభిప్రాయానికి బలం చేకూర్చే ఘటనలు జరుగుతున్నాయి. ఇల్లెందు అడవులలో న్యూడెమోక్రసీ నుండి నల్లమల అడవులలో ఎన్‌జీవోల దాకా 'అన్నల' నుండి బెదిరింపులు ఎదుర్కొంటున్నారు. 'ఈ ప్రాంతాలకు రావద్దు' 'ఇక్కడ పని చేయొద్దు' 'రాజీనామా చేయి' అన్న ఆంక్షలు, ఆదేశాలు వినిపిస్తున్నాయి. కారణాలు చెప్పడం లేదా అంటే టోకున చెప్తున్నారు - ప్రభుత్వానికి ఏజెంట్లుగా పని చేస్తున్నారనీ, డబ్బులు తింటున్నారనీ, ప్రజలను మోసం చేస్తున్నారనీ చెప్తున్నారు. ఇంత అస్పష్టమైన ఆరోపణలు చేయడమే అప్రజాస్వామికం. వాటిని ఎదుర్కొన్న వ్యక్తికి దేనికి జవాబు చెప్పాలో తెలీదు. అయినా ఆరోపణ సత్యాసత్యాలు ఇక్కడ విషయం కాదు. వాటి వెనువెంటనే వచ్చే ఆంక్షలు, ఆజ్ఞలు ప్రస్తుత విషయం. పీపుల్స్‌వార్ స్వేచ్ఛను పునరుద్ధరించాలన్న అభిప్రాయానికిప్పుడు విస్తృతమైన మద్దతు ఉంది. కానీ వారికి స్వేచ్ఛ వస్తే వేరే వారి స్వేచ్ఛ పోతుందనీ ఇది అనివార్యమనీ

అనిపించిన రోజున ఎంతటి ఉదారవాదులయినా దీనినో దానినో ఎంపిక చేసుకుంటారు. అప్పుడింత మద్దతు ఉంటుందా?

ఈ మాటలు వినే 'మూడ్'లో వారు ఉన్నారో లేదో గానీ అనేవారొకరు ఉండాలి. వాళ్లతో ఎందుకు పెట్టుకోవాలిలే అని అందరమూ ఊరుకుంటే పరిస్థితి మళ్లీ మొదటికి వేగంగా రాగలదు. ప్రస్తుతం మౌనంగా ఉంటూ ఆ అదను కోసం కాచుకున్న వారు ప్రభుత్వంలోనూ సమాజంలోనూ చాలామందే ఉన్నారు. వారికి ఊతమిచ్చే పరిస్థితిని రానివ్వకూడదు.

*ప్రజాతంత్ర వారపత్రిక*

*25 జూలై 2004*

# చర్చలకు కూర్చునే ముందు...
# భూమి సమస్యను అధ్యయనం చేయండి

శాంతి, స్వావలంబన, భూమి సమస్య అనే డిమాండ్లతో పీపుల్స్‌వార్ రాష్ట్ర ప్రభుత్వంతో చర్చలకు కూర్చోబోతున్నదని వినికిడి.

స్వావలంబన అంటే ప్రపంచ బ్యాంకు ఆదేశాలకు అతీతంగా రాష్ట్ర పాలన సాగాలని కాబోలు. అదంత సులభం కాదు. రాజశేఖరరెడ్డి ప్రభుత్వం ఈ విషయంలో పీపుల్స్‌వార్‌కు ఏ హామీ ఇవ్వబోదు, ఇవ్వడం సాధ్యమని కూడ భావించబోదు. మన దేశాన్ని ఏలేవారు ప్రపంచ బ్యాంకు ఆదేశాలకు కట్టుబడి ఉండడమే కాదు, ఆ 'బంధాన్ని' తెంపుకునే స్వేచ్ఛను సహితం వారికే సమర్పించేసారు. పీపుల్స్‌వార్ నాయకత్వం ఈ అంశాన్ని చర్చల అజెండాలో చేర్చడమే మన రాష్ట్ర పాలకులకొక అధిక ప్రసంగంగా అనిపిస్తుండవచ్చు. 'అంతర్జాతీయ సంస్థలు' అని పిలవబడే మూడు సంస్థలతో - ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ, ప్రపంచ వాణిజ్య సంస్థలతో - మన పాలకులు చాలా లోతుగా రాజీపడి ఉన్నారు.

శాంతి సంగతి మళ్లీ మాట్లాడుకోవచ్చును గానీ, భూమి సమస్యను పీపుల్స్‌వార్ నాయకత్వం సీరియస్‌గా చర్చలలో భాగం చేసి ప్రభుత్వం నుండి ఏదైనా రాబట్టదలచుకున్నట్లయితే దీని వివిధ కోణాలను వివరంగా అధ్యయనం చేయడం మంచిది. భూముల పంపకం ఆస్తి హక్కుతో ముడిపడి ఉంది. ఆస్తి హక్కును చట్టం ద్వారా తప్ప ఇతరత్రా తొలగించడాన్ని భారత రాజ్యాంగం ఒప్పుకోదు.

ప్రభుత్వం రాజ్యాంగేతర శక్తులతో చర్చలు జరపవచ్చునుగానీ రాజ్యాంగం ప్రకారమే పరిపాలన జరపాలి. ఇది అర్థం చేసుకోకపోతే చర్చలు నిష్ఫలం అవుతాయి.

'దున్నే వానిదే భూమి' అనే నినాదం భూమి సమస్యను చర్చించడానికి పెద్దగా పనికి రాకపోవచ్చు. వ్యవసాయం అంటే ఏమిటో తెలియని బ్రాహ్మణ అగ్రహారీకులూ జమీందార్లూ రైతుల చేత వందలాది ఎకరాల భూములను కౌలుకు సాగు చేయించుకున్న రోజులలో పుట్టిన నినాదమది. ఇప్పటికీ మన దేశ వ్యవసాయ రంగం ఏదో ఒక అర్థంలో 'అర్ధ భూస్వామ్య వ్యవస్థ' అయి ఉండవచ్చునేమోగానీ ఆనాటి పోలికలిప్పుడు చాలా తక్కువ. వ్యవసాయం మీద ఆధారపడే పేదలందరికీ (అందరికీ కాకపోతే వీలయినంత మందికి) భూమి దక్కాలన్నది ఇవ్వాళ్టి నినాదం కాగలదు.

అయితే చట్టాలతో నిమిత్తం లేకుండ ఎర్రజెండాలు నాటే పద్ధతిలో దీనిని సాధించుకోవడం ఏవో మారుమూల గ్రామాలలో జరగగలదేమోగానీ రాష్ట్రమంతటినీ ప్రాతిపదికగా తీసుకొని జరిపే చర్చలకది మార్గదర్శకం కాజాలదు. చట్టాలమీద దృష్టి పెట్టి ఏ చట్టం కింద ఇంకా ఎంత భూమి పేదల పరం కాగలదు, ఆ చట్టాల కింద మరింత భూమి సేకరించడానికి చట్టంలో గానీ కోర్టు తీర్పులలో గానీ ఉన్న ఆటంకాలేమిటి, కొత్త చట్టాలు చేయడానికున్న అవకాశం ఏమిటి అనే విషయాలు కొంచెమైనా అధ్యయనం చేయకుండ చర్చలకు కూర్చుంటే ప్రయోజనం ఉండదు. ప్రభుత్వం చట్టాలనూ కోర్టు తీర్పులనూ అడ్డం పెట్టి ఏమీ చేయలేననగలదు. లేదా చట్టరీత్యా చెల్లుబాటు కాని హామీలు ఇచ్చేసి, రేపు వాటి అమలును కోర్టులు ఆపేస్తే చేతులెత్తేయగలదు.

సీలింగ్ భూముల జాబితాలోకి రాగల ప్రతీ ఎకరం భూమి మీదా ఇప్పటికే పలు దఫాల వ్యాజ్యాలు నడిచి ఉన్నాయి. భూస్వాములకు అనుకూలంగా కోర్టులిచ్చిన తీర్పులను ప్రభుత్వం సవాలు చేయకుండ ఉండిపోయి కాలాతీతం కానిచ్చిన కేసులను ఏం చేయాలి? తప్పుడు ఆస్తి పంపకాలు, తప్పుడు అమ్మకాలు చూపించి కాపాడుకున్న భూమిపైన ఇన్నేళ్ల తరువాత పునర్విచారణ జరుపుతామంటే కోర్టులు ఒప్పుకుంటాయా? నిజమే, అన్ని రకాలుగా 'సీలింగ్ మిగులు'గా గుర్తించబడి ఇంకా పేదలకు పంచకుండ ఉండిపోయిన భూమి, లోపాయికారీగా ఇప్పటికీ తొలినాటి భూస్వాములే చేసుకుంటున్న భూమి లేకపోలేదు. దానినంతా వెంటనే పేదలకు పంచమని అడగడం సాధ్యమే, ప్రభుత్వం అంగీకరించడమూ సాధ్యమే. అయితే ఇటువంటి భూమి చెప్పుకోదగ్గ పరిమాణంలో - అన్ని జిల్లాలలో

కాకున్నా కొన్ని జిల్లాలలో ఉండవచ్చును గానీ 'భూమి సమస్య' పరిమాణంతో పోల్చినప్పుడు శతాంశం కూడ కాదు.

దేవాదాయ భూముల సమస్య ఈ మధ్య బాగా చర్చలో ఉంది. దేవాదాయ చట్టంలోని సెక్షన్ 82 చెల్లుతుందని సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చిన తరువాత రాష్ట్రంలోని దేవాలయ భూములను స్వంతం చేసుకున్న కౌలుదారులందరి హక్కులూ రద్దయిపోయాయి. వారిలోని పేదవారికి భూములను చవకగా పొందే హక్కు సెక్షన్ 82లోనే ఉంది. మిగిలిన భూమి - దాదాపు 2 లక్షల ఎకరాలు - ఇప్పుడు దేవాదాయ శాఖ చేతిలో ఉంది. దీనిని భూమి లేని పేదలకు పంచాలి, లేదా చవకగా ఇవ్వాలి అని అడిగే అవకాశం ఉంది. కానీ దీనికి రెండు ఆటంకాలున్నాయి. దేవాలయాల పోషణకు తగిన ఏర్పాటు చేయకుండ దేవాలయ భూములను పేదలకు పంచడాన్ని కోర్టులు ఆమోదించడం లేదు. భూస్వాములు, పూజారులు పదే పదే కోర్టుకెక్కి అటువంటి ప్రతీ ప్రయత్నం మీదా 'స్టే' తెచ్చుకుంటున్నారు. ప్రజావసరాల కోసం దేవాలయ భూములను సహితం సేకరించవచ్చునని సుప్రీంకోర్టు 1950లలోనే స్పష్టం చేసింది గానీ, అందుకు మారుగా ఆ గుడికి వేరే ఆదాయ మార్గం చూపించి తీరాలన్న ఆదేశం అప్పటి నుండి ఇప్పటి దాకా ఒక గుదిబండగా కూర్చొని ఉంది. దీనిని ఎదుర్కోవడం అంత సులభం కాదు.

రెండవది, హక్కులు కోల్పోయిన పాత కౌలుదార్ల నుండి రాగల ఒత్తిడి. పేరుకు కౌలు ఒకరిదే అయి ఉంటుంది గానీ ఆ భూమిని వంశపారంపర్యంగా పంచుకోవడం వల్ల వాస్తవంగా దానిని కౌలుకు చేస్తున్నవారు చిన్న రైతులే అయి ఉండవచ్చు. తమకు కూడ సెక్షన్ 82 ప్రకారం పేద కౌలుదార్ల హోదాలో ఆ భూమిని చవకగా కొనుక్కునే హక్కు ఇవ్వాలని వారు అడుగుతున్నారు. ఇది ఎంత వరకు సమంజసమోగానీ సి.పి.ఐ, సి.పి.ఐ(ఎం)లు దీనిని సమర్థిస్తున్నాయి. వారి ఆధ్వర్యంలో నడిచే దేవాలయ భూముల కౌలుదార్ల ఉద్యమాల ముఖ్య డిమాండ్లలో ఇదొకటి. ఈ డిమాండును కూడ అంగీకరించినట్టయితే పేదలకు పంచడానికి దేవాదాయ భూములు ఎక్కువ మిగలక పోవచ్చును.

ఏజెన్సీ భూములకు వర్తించే 'వన్ ఆఫ్ సెవెంటీ' రెగ్యులేషన్ అమలు గురించి కూడ పీపుల్స్‌వార్ నాయకత్వం ప్రభుత్వంతో చర్చించబోతున్నామని అంటున్నారు. నిజానికి ఆ రెగ్యులేషన్ కింద జరగవలసిన విచారణలన్నీ ఇప్పటికే 'జరిగిపోయాయి'. అయితే అన్నీ కూడ ఆదివాసులకు ఏ అవగాహన లేని రోజులలో జరిగిపోయాయి. వారిలో కొంచెం చదువుకున్న ఈ తరం ముందుకొచ్చి ఈ

విచారణలను తిరస్కరించి మళ్ళీ విచారణ జరపాలని డిమాండ్ చేయడం వల్లనే పశ్చిమ గోదావరి జిల్లాలో గిరిజన - గిరిజనేతర ఘర్షణలు పెద్దెత్తున చెలరేగాయి. పునర్విచారణ జరపవచ్చునా లేదా అన్న విషయంలో హైకోర్టు గందరగోళమైన తీర్పును ఇచ్చి ఉంది. దానిని అడ్డుపెట్టుకుని గిరిజనేతరులు అన్యాక్రాంతమైన భూముల ఆక్రమణను కొనసాగిస్తూనే ఉన్నారు. లోతయిన చట్ట సవరణలు లేకుండ 'వన్ ఆఫ్ సెవెంటీ' విషయంలో న్యాయం జరగడం అసాధ్యం. దానికవసరమైన చట్ట సవరణలు కోర్టులలో నిలబడేటట్టు చేయాలి. ప్రభుత్వం ఏదో హామీ ఇచ్చి ఏమీ చేయలేక కోర్టులను తప్పుబట్టి తప్పించుకునే ప్రమాదం ఉంది.

కాబట్టి ఏ కోణంలో చూసినా 'భూమి సమస్య' అనేది చాలా సంక్లిష్టమైన వాస్తవాలతోను, చట్టాలతోను, కోర్టు తీర్పులతోనూ ముడిపడి ఉంది. ఎర్రజెండాలు పాతడం ద్వారా భూమి సమస్యను పరిష్కరించడం మాత్రమే అధిక భాగం పీపుల్స్‌వార్ కేడర్‌కూ నాయకత్వానికీ తెలుసును. అదే అవగాహనతో చర్చలకు కూర్చుంటే ఫలితమేమీ దక్కకపోగా ప్రభుత్వం ఒట్టి హామీలిచ్చి తప్పించుకునే ప్రమాదం ఉంది.

*ప్రజాతంత్ర వారపత్రిక*
*3 అక్టోబర్ 2004*

# చర్చల గురించి ఇంకొంచెం...

ఏదో జరగబోతుంది అని అన్ని వర్గాలలోనూ ఉన్న ఉత్సాహం - ఉబలాటం అనవచ్చునేమో కూడ - ముచ్చట గొలుపుతున్నది. 'రాజ్యాంగాన్ని తిరస్కరించే వాళ్లతో ప్రభుత్వం మాట్లాడటమేమిటి?' అని అభ్యంతరం తెలపగల వర్గాలకు చెందినవారు సహితం ఆ అభ్యంతరాన్ని ఎక్కడో భద్రపరచి ఏమయితేనేం, ఈ చర్చలు ఏదో ఒక ఫలాన్ని ఇస్తే బాగుండును అనుకుంటున్నారు. పైకి మాత్రమే అంటున్నారేమోనన్న అనుమానం లేకపోలేదు గానీ ఇది పూర్తిగా నటన అని కూడ అనలేము.

దీనిని చాలా రకాలుగా అర్థం చేసుకోవచ్చు.

విప్లవం మీద అన్ని వర్గాలలోనూ ఆశ ఉందని భావించడం అన్నిటికంటే ఆకర్షణీయమైన వ్యాఖ్యానం. అయితే పిల్లికి బిచ్చం పెట్టని బాపతు భద్రజీవులు సహితం కోర్టు వరండాలోనూ బస్‌స్టాండ్ ప్లాట్‌ఫారం మీదా పలకరించి 'ఏమైనా ఫలితం వస్తుందంటారా' అని అడగడం వెనక విప్లవం పట్ల సార్వజనీన ఆకాంక్ష ఉందని నమ్మడం కష్టమే.

నిజమే, ఆ కోవకు చెందిన జీవులు కానివారు కూడ అదే ఆశ వ్యక్తం చేస్తున్నారు. వారిలో విప్లవం అనే ఆ అస్పష్టమైన ఆదర్శం పట్ల కోరిక ఉన్నా లేకున్నా, సగటు జీవులకు రానురాను దుర్భరంగా తయారవుతున్న ప్రస్తుత పరిస్థితుల నుండి ఏదయినా ఉపశమనం

దొరుకుతుందేమోనన్న ఆశ ఉందని అనుకోవచ్చు. సానుభూతిగా అర్థం చేసుకోనూవచ్చు.

కానీ ఇక్కడొక దౌర్బల్యం ఉందని గుర్తిస్తున్నామా? మొగిలిచర్ల నుండి పగిడేరు దాకా జరిగిన, జరుగుతున్న మీటింగ్‌లను టి.విలో అదే పనిగా చూస్తూ ఉన్న వారిలో పదివేలలో ఒకరు కూడ ఆ మీటింగ్‌లు నిర్వహిస్తున్న సంస్థలు నడుపుతున్న, లేక నడపబోయే ఏ ఉద్యమంలోనూ భాగం కాదు, కాబోరు, కావాలన్న ఆలోచనా వారికి రాదు. ప్రభుత్వం మెడలు వంచి నిషేధం ఎత్తివేయించి అంతంత పెద్ద మీటింగ్‌లు పెట్టి అంతంత పెద్ద గొంతులతో మళ్లీ అదే ప్రభుత్వాన్ని తిడుతున్నారు కదా, వీళ్లు తలచుకుంటే నా సమస్యలు ఇట్టే తీరకపోతాయా అనుకుంటున్నారు. ఆ సమస్య వేల మందికి సంబంధించిన క్లిష్టమైన సమస్య కావచ్చు. పక్కింటి వాడిని దబాయించి రెండిళ్ల మధ్య ఉన్న ఖాళీ జాగాను కబ్జా చేసుకుందామంటే వీలుకావడం లేదే అన్న కుళ్లుబోతు సమస్యా కావచ్చు. 'అన్నలు ప్రభుత్వంతో మాట్లాడుతున్నారు. మునిసిపాలిటీ వాళ్లు మా వీధిలో చెత్త తీయడం లేదు కొంచెం వారికి చెప్పవా' అని విశాఖపట్నంకు చెందిన ఒక మిత్రుడు జోక్‌గా అన్న మాటలు సీరియస్‌గానే ఈ వైఖరిని ప్రతిబింబిస్తాయి.

అయితే ఆ మాత్రం సమస్యలు లేనివారు సహితం అన్నల పట్ల, అన్నలకూ ప్రభుత్వానికీ మధ్య నడుస్తున్న చర్చల ప్రక్రియ పట్ల సానుకూలమైన ఆసక్తి చాలా చూపిస్తున్నారు. దీని వెనకున్న కారణమే అన్నిటికంటే బలమైన కారణమేమోనంటే నన్ను సినిక్ అంటారేమో. అయితే మనిషినీ మానవతనూ మానవ సాధ్యాసాధ్యాలనూ ఉన్నదున్నట్టుగా స్వీకరించే ప్రగతికాంక్షే మనిషికి మరీ ఎక్కువ హాని చేయకుండ ప్రగతిని ఏదో ఒక మేరకు సాధించగలదు కాబట్టి, సినికల్‌గా కనిపించడానికి భయపడి ప్రయోజనం లేదు.

బలవంతులకూ బలవత్తరమైన పరిస్థితులకూ తలవంచడం మనిషికుండే అత్యంత విచారకరమైన బలహీనతలలో ఒకటి. ప్రస్తుతం నడుస్తున్న చర్చల ప్రక్రియ అటువంటి ఒక పరిస్థితి. బెటాలియన్లకొద్దీ సాయుధ బలగాలున్న ప్రభుత్వం, తన అధికారాన్ని ధిక్కరించే వారితో తానే చొరవ తీసుకొని కాల్పుల విరమణ ఒప్పందం చేసుకొని మాట్లాడడానికి ఉపక్రమిస్తున్నది. ఆ దారిలో ఎదురయ్యే ప్రతీ సంక్షోభంలోనూ ఇప్పటిదాకా అన్నల మాటే చెల్లుతున్నది. పైగా వాళ్లేమైనా కృతజ్ఞత తెలుపుతున్నారా అంటే అదేమీ లేకుండా మైకు దొరికినప్పుడల్లా 'అంతా బూటకం' అంటూనే ఉన్నారు, రాజశేఖరరెడ్డికీ చంద్రబాబుకూ తేడా యేమీ లేదని ప్రకటిస్తూనే

ఉన్నారు. చర్చలకు 'శాంతి' ఒక లక్ష్యమని ప్రకటిస్తూ కూడ సాయుధ పోరాటం అనివార్యం అంటూనే ఉన్నారు. అంతగా సాగించుకోగలవారు మానవమాత్రులు కాజాలరు కాబట్టి అన్నలకే కాదు, అన్నలతో ఏదో కొంచెం సంబంధం ఉందని భావించే వారందరికీ గౌరవం ఒక్కసారిగా పెరిగిపోయింది.

పోనీ ఇదేమయినా స్థిరమైన స్థితా అంటే ఆ మాత్రం భరోసా కూడ లేదు. ఏ రోజయినా ఇది భగ్నం కావచ్చు. ప్రభుత్వం కోరలు మళ్లీ బయట పెట్టవచ్చు. ఇవ్వాళ భద్రతా ఏర్పాట్ల మధ్య మంజీరా గెస్ట్‌హౌస్‌లో అతిథి సత్కారాలు పొందుతున్న రామకృష్ణను అదే గెస్ట్‌హౌస్ ఆవరణలో కాల్చి చంపి, గవర్నర్‌ను చంపడానికి కుట్ర పన్నుతుండగా ఎన్‌కౌంటర్ జరిగిందని సుకుమార గారు ప్రకటించనూ వచ్చు.

ఇంతగా సామాన్య మానవుల అదుపులో లేని పరిస్థితులలో ప్రధాన పాత్రధారులయిన వారికి సగటు మనుషులలో ఆదరణ పెరగడం ఏ గొప్ప సంకేతాన్నీ ఇవ్వదు.

ఇది విప్లవకారులకు ఏమంత మంచిది కాదు. వారి యోగ్యత వారికుంది. ప్రగతిని కాంక్షించేవారి గౌరవానికి వారు పాత్రులే. అయితే సమాజమంతా వారిని సహజ నాయకులుగా భావించేంత గొప్పవారు కారు వారు. దళిత సంఘాలూ ఆదివాసీ సంఘాలూ, సకల ప్రజాసంఘాలూ తమ సమస్యలు వారి చేత ప్రభుత్వంతో చర్చింపజేయాలని ఉబలాటం ఏదయితే చూపిస్తున్నారో, దానికి తగినంతటి సమగ్ర రాజకీయ దృక్పథం గానీ అనుభవం గానీ వారికేమీ లేదు. ఉందన్న భ్రమ అందరూ కలిసి వారికి కల్గించడం ఎవరికీ మంచిది కాదు. సకల ప్రజావర్గాలకూ నాయకత్వం ఇవ్వడానికి కావలసిన తాత్విక సమగ్రత తమ ప్రాపంచిక దృక్పథానికి ఉందని వారు నమ్ముతారు. లెనిన్ కాలం నుండి నమ్ముతూ ఉన్నారు. దాని సత్యాసత్యాల సంగతి ఎలాగున్నా, ప్రస్తుతం వారికి లభిస్తున్న ఆదరణకు దానితో ఏమీ సంబంధం లేదు.

ఈ సంగతి గ్రహించేపాటి విజ్ఞత వారి నాయకత్వంలో లేదని అనలేము గానీ తాత్కాలికంగానయినా ఆ విజ్ఞత కోల్పోయినట్టయితే బాగా నష్టపోతారు. ఎందుకంటే వారు ఎదుర్కొంటున్న ప్రధాన తక్షణ సమస్య నిర్బంధమూ కాదు, సిద్ధాంత సంక్షోభమూ కాదు. బలహీనమైన నిర్మాణం వారి తక్షణ సమస్య. దానికి కారణం బలహీనమైన 'మానవ వనరులు'. విప్లవంలోకి కొన్నాళ్లు పోయి బయటికొచ్చినవారు మన చుట్టూ చాలామందే ఉన్నారు కాబట్టి విప్లవానికి

అందుతున్న మానవ వనరులను బయటినుండే అంచనా వేయవచ్చు. అదేమంత ఆశావహంగా లేదంటే ఎవరూ కోపానికి రానవసరం లేదు.

ప్రభుత్వంతో చర్చలు ఏ రూపం తీసుకున్నా, ఏ దిశగా సాగినా దానితో పాటు ఈ సమస్య గురించి కూడ విప్లవ పార్టీలు సీరియస్‌గా ఆలోచిస్తే తప్ప ఇదంతా ముగిసేసరికి వారి ఉద్యమ బలం నిజమైన అర్థంలో పెరగదు. అసలే ఆలోచించకపోతే పెరగకపోగా తరిగే ప్రమాదమూ ఉంది. ఈ సమస్యకు సులభమైన పరిష్కారం లేదు గానీ దానిని విస్మరించడం ఆత్మహత్యవంటిదవుతుంది.

*ప్రజాతంత్ర వారపత్రిక*
*17 అక్టోబర్ 2004*

# స్వరణ్‌జిత్ సేన్‌గారి దువ్వెన

రాష్ట్ర డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ పోస్టులో ఇంత వెకిలి మనిషిని గతంలో మనమెప్పుడూ చూడలేదు.

నల్లమల అడవులలో కూంబింగ్ గురించి విలేఖరులాయనను ప్రశ్నిస్తే, టోపీ తీసి కిందపెట్టి జేబులో నుండి దువ్వెన తీసి జుట్టు దువ్వుకొని నాకు తెలిసిన కూంబింగ్ ఇదేననే పద్ధతిలో స్వరణ్‌జిత్ సేన్‌గారు జవాబు చెప్పిన చిత్రం టీవీలు ఒకటికి రెండు సార్లు చూపించాయి.

నల్లమల అడవి గోదావరిలోయ అడవి అంత విస్తృతమైనది కాదు. దట్టమయినదే కానీ వర్షాభావ ప్రాంతం కావడం వల్ల మరీ దట్టమైనది కాదు. పులుల సంరక్షణ పేరు మీద కొంత భాగంలో జనావాసాలు ఎక్కువ లేకుండ చేసారు గానీ మిగిలిన భాగంలో ఎక్కడబడితే అక్కడ ఆవాసాలున్నాయి. ఎక్కువగా చెంచులు, కొంత మేర లంబాడాలు, ఇతర కులాలు నివసిస్తారు.

చిలకలూరిపేటకు ప్రతీకారంగా నల్లమల అడవిని చుట్టుముట్టి నక్సలైట్లకు అన్నం, నీళ్ల అందకుండా చేసి బయటకు లాగడానికి పోలీసులు పెద్దెత్తున బలగాలు దించారన్న వార్త చదవగానే ఈ జనం గతి ఏమవుతుందా అని నల్లమల అడవులతో ఏ కొంచెం పరిచయం ఉన్న వారయినా గాభరపడి ఉంటారు. ప్రజలనేమీ అనకుండా మావోయిస్టుల కోసం మాత్రమే గాలింపు చేసేంత

సున్నితమైన వ్యవహారశైలి గానీ ప్రజాస్వామ్య సంస్కారం గానీ మన పోలీసు వ్యవస్థకు లేదు. తండాలనూ పెంటలనూ ఖాళీ చేయించి జనాన్ని చెల్లాచెదరు చేయడం తమ వెతుకులాటకు అవసరం అనుకుంటే అంతపనీ చేయగలరు. చెంచులయినా, ఇతర ఆదివాసులయినా కొంచెం తక్కువ సంఖ్యలో ఉండే గుంటూరు జిల్లాలోనే ఇది జరిగిందంటే ఇక కర్నూలు, మహబూబ్‌నగర్‌లలో ఏం జరగగలదో ఊహించుకోవచ్చు.

ఈ ఆరాటంతో ప్రశ్న అడిగిన వారికి 'దువ్వెనతో జుట్టు దువ్వి' ఈ కూంబింగ్ గురించేనా నువ్వు అడుగుతున్నది? అని జవాబు చెప్పగల మనిషిని జోకర్ అనాలా లేక అంతకంటే కూడ అమర్యాదపూర్వకమైన పేరేదయినా పెట్టాలా?

రాష్ట్ర రాజకీయ చరిత్రలో చాలా కీలకమైన దశలో ఇతడు డి.జి.పి అయ్యాడు. డి.జి.పి స్థాయి పోస్టులు కేవలం సీనియారిటీని బట్టి ఇవ్వరు కాబట్టి రాజశేఖరరెడ్డే ఇతనిని ఎంపిక చేసుకున్నాడనుకోవాలి. ఏం చూసి ఎంపిక చేసుకున్నాడు?

అవి నక్సలైట్లతో చర్చల ప్రక్రియ ఇంకా బతికే ఉన్న రోజులు. దానికి కావలసిన వాతావరణాన్ని సజీవంగా ఉంచగల అధికారిని ఎంపిక చేసి ఉంటే సమయోచితంగా వ్యవహరించాడని అని ఉండవచ్చు.

కనీసం, దానికి హాని చేయడని నమ్మగల వ్యక్తిని ఎంపిక చేసివున్నా గుడ్డిలో మెల్ల అని సరిపెట్టుకుందుము. కానీ ఏరికోరి ఆ వాతావరణాన్ని ధ్వంసం చేయగల వ్యక్తినే ఎంపిక చేయడాన్ని ఏ విధంగా అర్థం చేసుకోవాలి? రాజశేఖరరెడ్డికి అటువంటి వ్యక్తే కావాలని అర్థం చేసుకోవాలి.

నక్సలైట్ ఉద్యమం బలంగా ఉన్న ఏ జిల్లాలోనూ స్వరణ్‌జిత్ సేన్ ఎస్.పిగా గానీ డి.ఎస్.పిగా గానీ పనిచేసినట్టు ఎవ్వరూ ఎరుగరు. ఆ ఉద్యమాన్ని ఒక సామాజిక విషయంగా అతనెన్నడూ చూడలేదు. చూడవలసిన అగత్యం అతనికి కలగలేదు. ఆ జ్ఞానం లేని వారెవ్వరూ నక్సలైట్లతో రాజకీయంగా వ్యవహరించ వలసిన అవసరాన్ని గుర్తించజాలరు. గుర్తించిన వారు చెప్తే గ్రహించజాలరు. ఇతనికి ముందు డి.జి.పిగా ఉన్న సుకుమారగారు వీడ్కోలు సందర్భంగా ఇచ్చిన ఒక ఇంటర్వ్యూలో, 'కరీంనగర్‌లో భూస్వామ్య వ్యవస్థను నక్సలైట్లే అంతం చేసారు' అని మెచ్చుకోలుగా అన్నాడు. పదవిలో ఉన్నప్పుడు నువ్వు ఆ స్పృహతో వ్యవహరించావా అని అతనిని ఎదురుప్రశ్న అడగవచ్చుననుకోండి. కానీ స్వరణ్‌జిత్ సేన్ బాపతు ఆఫీసరు రిటైరయిన తరువాత సహితం అటువంటి మాటలు అనరు.

ఇతను డి.జి.పి అయిన రోజు నుండి, 'ఆయుధాలు పట్టుకొని తిరుగుతుంటే

చంపుతాం' అనసాగాడు. ఎన్‌కౌంటర్లు ఆత్మరక్షణలో జరుగుతున్నాయన్న కథ వల్లించని మొదటి డి.జి.పి ఇతను. వారి వద్ద ఆయుధాలు ఉన్నాయి కాబట్టి చంపుతున్నాం అంటున్నాడు. వాళ్లను చంపడానికి ప్రాణభయం, ఆత్మరక్షణ లాంటి మాటలు అక్కరలేదని అతని అభిప్రాయం. దానికి తగ్గట్టే అతని పోలీసులు అడవుల మూలలన్నీ గాలించి సమాచారం రాబట్టి నక్సలైట్లను చంపి వస్తున్నారు.

ఎవరి తెలివితక్కువతనానికి మూల్యం వారే చెల్లించేటట్టయితే మనుషులను సులభంగా క్షమించవచ్చు. అయితే స్వరణ్‌జిత్‌సేన్ గారి వ్యవహారశైలికి మూల్యం వారు చెల్లించరు. తెలుగు సమాజం చెల్లిస్తుంది. అతను తల దువ్వుకుంటే తలలో పేలు ఉంటాయో చస్తాయోగానీ అడవి ప్రాంత ఆవాసాల కూంబింగ్ అడవివాసులను అంత తేలికగా విడిచిపెట్టదు. మొన్నటి ఎన్నికలకు ముందే మహబూబ్‌నగర్ జిల్లా మలచింతలపల్లి ప్రాంతంలో కూంబింగ్ బాధలకు తాళలేక చెంచులు బయటికొచ్చి స్థిరపడ్డారు. అది చంద్రబాబు హయాం ఆఖరి రోజుల సంగతి. ఆ గడ్డు దినాలు ఎన్నికలతో పోతాయన్న ఆశ వారిని బతికించి ఉంటుంది. ఇప్పుడు జరుగుతున్నది నక్సలైట్లను తుదముట్టించే పోరు. అది తెమలదు. తెల్లవారదు. మళ్లీ ఎప్పుడయినా ప్రభుత్వానికి జ్ఞానోదయం అయ్యే దాకా కొనసాగుతూనే ఉంటుంది.

తెలుగు సమాజం అడవుల బయట కూడ ఉంది. దానికి ప్రమాదం చర్య నుండే కాక ప్రతిచర్య నుండి కూడ ఉంది. తమపైన జరిగే దాడికి ప్రతీకారంగా ఆ దాడికి బాధ్యులైన వారిపైన మాత్రమే ఎదురుదాడి చేయాలన్న నియమం మన మావోయిస్టులకు లేదు. చేసిన వాడు దొరకకపోతే దొరికిన వాడితో సరిపెట్టుకోవడానికి వారికి అభ్యంతరం లేదు. మానాలలోనో మంగపేటలోనో ఎన్‌కౌంటర్ పేరిట తమ వారిని హత్యచేస్తే, మహబూబ్‌నగర్‌లో రోడ్డు మీద కనిపించిన పోలీసు జవాన్‌ను చంపి ప్రతీకారం తీర్చుకోవచ్చు. రాజశేఖరరెడ్డి దుర్మార్గుడని చెప్పి రంగారెడ్డి జిల్లాలో అతని పార్టీ తరఫున సర్పంచ్‌గా పనిచేస్తున్న మనిషిని చంపి ఆ దుర్మార్గానికి జవాబు చెప్పవచ్చు. లేదా రాజశేఖరరెడ్డికి మిత్రపక్షంగా ఉన్న టిఆర్‌ఎస్ తరఫున ఏ కరీంనగర్ గ్రామంలోనో ఎంపిటిసిగా వ్యవహరిస్తున్న ముసలాయననూ చంపవచ్చు.

క్లుప్తంగా చెప్పుకోవాలంటే, అన్యాయాన్ని న్యాయంతోనే కాదు, అన్యాయంతో కూడ ఎదుర్కోవచ్చుననే సూత్రాన్ని మన మావోయిస్టులు నమ్ముతారు. ఇది మావో చెప్పాడా అన్న చర్చలోకి నేను పోదలచుకోలేదు గానీ మావో చెప్పినా ఎవరు చెప్పినా

ఈ వైఖరి అనాగరికమైనది. ఏ నాగరిక రాజకీయ ప్రక్రియలోనూ భాగం కాకూడనిది.

నిజానికి స్వరణ్‌జిత్ సేన్‌గారు ఆ రోజులలో నిద్రపోతున్నట్టున్నారు గానీ, చర్య, ప్రతిచర్య ఈ దశకు చేరుకున్నాయనే కదా ఇక ఇద్దరూ నాలుగురోజులు తుపాకులు పక్కన పెట్టి చర్చలకు కూర్చోండి అని తెలుగు సమాజం కోరుకున్నది? అదేమీ ఎరగనట్టు ఇప్పుడు అకస్మాత్తుగా దువ్వెన బయటకు తీయడం ఎందుకు? చిలిపిగా ప్రవర్తిస్తున్నామనుకొని చిల్లరగా ప్రవర్తించడం ఎప్పుడయినా వెగటు కలిగించే విషయమే. దువ్వుకోవడానికి జుట్టు ఇంకా దండిగానే ఉన్నప్పటికీ వయసురీత్యా తలపండిన మనిషిలో అది మరీ దుర్భరం. అది వ్యక్తిగత వైపరీత్యంగానే ఉండిపోతే ఈ సృష్టిలో నానారకాలూ ఉంటారు కదా అని సరిపెట్టుకుంటాం. కానీ అది పాలనా విధానమే అయినప్పుడు ఇంకేం చేయలేకున్నా నిరసనయినా గట్టిగా తెలపాలి.

*ప్రజాతంత్ర వారపత్రిక*

*27 మార్చి 2005*

# 'కోవర్టులు' ఆగేనా?

రాష్ట్రంలో అకస్మాత్తుగా పెరిగిన ఎన్‌కౌంటర్ హత్యలు ఆందోళనే కాక ఆశ్చర్యం కూడ కలిగిస్తున్నాయి. ఆశ్చర్యం ఎందుకంటే పోలీసు దళాలు బాగా దట్టమయిన అడవులలోకి పోయి నక్సలైట్లను చంపి వస్తున్నారు. గ్రేహౌండ్స్‌కు మన్మోహన్‌సింగ్ ప్రశంస సహితం లభించింది. ఆ నమూనాలో ఛత్తీస్‌గఢ్, జార్ఖండ్, బీహార్, బెంగాల్‌లు సుశిక్షితులయిన పోలీసు దళాలను తయారు చేసుకోవాలని కేంద్ర ప్రభుత్వం సూచించింది కూడ.

చంపడం ఒక ఘనకార్యం అనుకుంటే ఈ ప్రశంస సహేతుక మయినదే. పోలీసులలో తెగింపు, నేర్పు చాలా పెరిగాయి. మొన్న కడప, మహబూబ్‌నగర్ జిల్లాలలో ఎన్‌కౌంటర్లు జరిగిన స్థలాలు ఒకప్పుడు నూటికి నూరుపాళ్లు పదిలమయినవిగా భావించేటటువంటి స్థలాలు. విప్లవ నిబద్ధత గలవాళ్లు అటువంటి చోట్ల సంచరించగలరు, అవసరమయితే నివసించగలరు గానీ జీతం కోసం పనిచేసే పోలీసులకు అంత తెగింపు ఎక్కడిది అని విప్లవ సానుభూతి పరులయిన మేధావులు ఉపన్యాసాలు ఇచ్చిన రోజులుండేవి.

ఆ రోజులు క్రమంగా పోయాయి. గ్రేహౌండ్స్ పోలీసులే కాక ఒక్కొక్కసారి ఇతర పోలీసు బృందాలు సహితం బాగా లోతట్టు ప్రాంతాలకు పోయి నక్సలైట్లను చుట్టుముట్టి చంపుతున్నారు. ఏం మారింది? పోలీసులు జీతం కోసమే కాక ఇంకా దేనికోసమయినా

పని చేస్తున్నారా? పోలీసు శాఖలోని సాధారణ సిబ్బందిని చంపడం తగదు అని డాక్యుమెంట్లలో రాసుకున్నప్పటికీ ప్రధానంగా వారినే చంపుతుండడం వల్ల నక్సలైట్ల పట్ల శత్రుభావం పోలీసుశాఖలో సర్వత్రా వ్యాపించిందా? లేక 'స్పెషల్' డ్యూటీ పేరుతో కాగితం మీద ఏమీ పెట్టకుండా డబ్బు సంపాదించుకునే అవకాశం పుష్కలంగా ఉండడం ఆకర్షణగా పని చేస్తున్నదా? లేక 'థ్రిల్' కోసం సాహసిస్తున్నారా?

ఒక విషయం ఎంతమంది గమనించారు? నక్సలైట్లు జీపులలో పోతున్న పోలీసు సిబ్బందిని మందుపాతరలు పేల్చి చంపుతున్నారు. పోలీస్‌స్టేషన్లపైన దాడి చేసి స్టేషన్ సిబ్బందిని చంపుతున్నారు. సెలవు మీద అమ్మగారింటికో అత్తగారింటికో పోయి నిరాయుధుడిగా ఉన్న పోలీసును చంపుతున్నారు. కానీ తమతో సమానంగా అడవులలో కాలి నడకన సంచరిస్తున్న గ్రేహౌండ్స్‌తో అడవిలో ముఖాముఖి తలపడి చంపిన ఘటనలు లేవు. గ్రేహౌండ్స్ మాత్రం నక్సలైట్ దళాలను ఆరు నెలలకొక సారయినా పెద్దెత్తున చంపుతున్నారు. వాళ్లకు వీళ్ల గురించి సమాచారం అందుతున్నది గానీ వీళ్లకు వాళ్ల గురించి అందడం లేదనుకోవాలా? సమాచారం అందినా చంపడం అనవసరం అని మావోయిస్టులు భావిస్తున్నారనుకోవాలా? గ్రేహౌండ్స్‌లాంటి శిక్షణ మావోయిస్టులకు లేదనుకోవాలా?

అందుకేనా ప్రతీసారి విషప్రయోగం అన్న ఆరోపణ వింటున్నాం? ఇప్పటికి దాదాపు ఏడు సంవత్సరాలుగా కోవర్టు ద్వారా విషప్రయోగం చేసి చంపారు అన్న ఆరోపణ మావోయిస్టుల నుండి వింటున్నాం. దగ్గరికి పోయి పరిశీలించని ఘటనల మాటేమోగాని పరిశీలించిన సందర్భాలలో విషప్రయోగం కథ విశ్వసనీయంగా తోచడం లేదు.

కోవర్టు విషయం వేరే. దళం ఉన్న సమాచారం, కదలికలు పోలీసులకు చాలా సందర్భాలలో ఎవరో ఒకరు చేరవేస్తున్నారనేది వాస్తవం. ఒక్క సుండుపల్లి ఘటనలోనే పోలీసులకు స్పష్టమైన ముందు సమాచారం లేదనీ, దళం ఆచూకీ కోసం అప్పటికి నాలుగు రోజులుగా వెతుకుతున్న వారికి నక్సలైట్లు కాకతాళీయంగా తారసపడ్డారనీ 'ఎన్‌కౌంటర్' జరిగిన కొండ కింద ఉన్న సుగాలీ తండావాసులు అభిప్రాయపడ్డారు. అది ఎంత నిజమోగానీ, తక్కిన ఘటనలన్నీ నిర్దిష్టమైన సమాచారంతోనే జరిగాయన్న అభిప్రాయమే ఉంది.

ఈ రకంగా సమాచారం పోలీసులకు చేరవేసే వారిని 'ఇన్‌ఫార్మర్లు' అని నక్సలైట్లు చాలాకాలంగా అంటున్నారు. సమాచారం చేరవేయడం కోసమే వారి

పార్టీలోకి చేరిన వ్యక్తిని, లేక పార్టీకి సన్నిహితుడయిన వ్యక్తిని 'కోవర్ట్ ఆపరేటివ్' అని, క్లుప్తంగా 'కోవర్ట్' అని అంటున్నారు. ఈ మధ్య ప్రతీ ఎన్‌కౌంటరూ 'కోవర్టు పనే'నని మావోయిస్టులు ఆరోపిస్తున్నారు. దీని భావమేమిటి? కోవర్టు అనే మాటను ఇన్‌ఫార్మర్‌కొక పర్యాయపదంగా వాడుతున్నారనుకోవాలా? లేక పోలీసులు బెదిరిస్తేనో, డబ్బు ఆశ చూపిస్తేనో ఇన్‌ఫర్మేషన్ ఇచ్చే దశ దాటి ఇన్‌ఫర్మేషన్ చేరవేయడం కోసమే వారికి దగ్గరైన వారి సంఖ్య పెరిగిందనుకోవాలా? మొదటిదయితే భాషా ప్రయోగంలో అజాగ్రత్త అనవలసి ఉంటుంది. అది కొత్తేమీ కాదు. అసలు ఇన్‌ఫార్మర్ అన్న మాటనే చాలా అస్పష్టంగా ప్రయోగించడం జరుగుతున్నది.

రెండవదే నిజమైతే మావోయిస్టు ఉద్యమానికీ దాని చుట్టూ ఉన్న సమాజానికీ మధ్య సంబంధం ఎక్కడి దాకా వచ్చిందా అని ఆశ్చర్యపోక తప్పదు. ఆ పార్టీ పెద్ద నాయకుడు ఊరిలో ఉన్నాడని తెలిసినా భూస్వాములు సహితం పోలీసులకు సమాచారం ఇవ్వని రోజులు రెండు దశాబ్దాల క్రిందటి దాకా ఉండేవి. అవి పోయి ఆ ఉద్యమం పునాది ప్రజలలోనే భయానికో డబ్బాశకో సమాచారం అందిచ్చేవారు పోలీసులకు దొరకనారంభించారు. ఇప్పుడు 'కోవర్టు' అన్న నిందలను నమ్మేటట్టయితే, పోలీసులకు సమాచారం చేరవేయడం కోసమే ఆ ఉద్యమానికి చేరువ అవుతున్న పునాది వర్గ ప్రజలు తయారవుతున్నారనుకోవాలి. ఎడాపెడా 'కోవర్టు' అన్న ఆరోపణలు చేస్తున్న మావోయిస్టులు దీని భావాన్ని గురించి ఆలోచిస్తున్నారా?

తమ చుట్టూ ఉన్న సమాజం పతనం కావడమే దీనికి కారణమైతే, అంతగా పతనం అయిన సమాజంలో సాయుధ పోరాటాలు ఎంతకాలం నడుపుతారు? సాయుధ పోరాట రాజకీయాలు విజయవంతంగా సాగాలంటే వాటి చుట్టూ ఉన్న ప్రజలు ఒక గోడగా నిలబడడం అవసరం. ఒక గాలి వీస్తే పెచ్చులూడి పోయే గోడను చుట్టూ పెట్టుకొని విప్లవ పోరాటం చేయడం అసాధ్యం.

లేక ఆ పతనం తమలోకి కూడ ప్రవేశించడం అసలు కారణమా? విప్లవకారులు అనే వారికి సమాజం ఒక నైతిక ప్రతిపత్తి ఆపాదిస్తుంది. తమ స్వంత ప్రయోజనాలను మించిన ప్రయోజనాన్ని అనునిత్యం కాంక్షిస్తారనీ, కోపావేశాలకూ ఈర్ష్యాసూయలకూ పూర్తిగా అతీతులు కాకున్నా వాటికి సులభంగా లోనుకారనీ నమ్ముతారు. ఈ అభిప్రాయాలు ఉండబట్టే విప్లవకారులు అనేవారి పట్ల రాజకీయ వ్యతిరేకత ఉన్నవారికి సహితం వ్యక్తిగత స్థాయిలో ఒక రకమైన గౌరవం ఉంటుంది.

ఈ రోజు నక్సలైట్ కార్యకర్తల గురించి ఇందుకు భిన్నమైన అభిప్రాయం తరచుగా వినపడుతున్నది. అందరి గురించి కాదుగానీ ఉండకూడని మోతాదులో వినపడుతున్నది. వారి మీద వ్యక్తిగత నిందలు, ఆరోపణలు వచ్చినప్పుడు 'విప్లవకారులు ఆ విధంగా ప్రవర్తించరు' అన్న మాట వినబడడం బాగా తగ్గిపోయింది. అవునా కాదా అని ఇతరుల విషయంలో తర్కించుకున్నట్టు తర్కించుకుంటున్నది సమాజం. ఫలానా వ్యక్తి 'పార్టీలో చేరిండని విని ఆశ్చర్యపోయినం' అన్న వ్యాఖ్య చాలా తరచుగా వింటున్నాం.

సమాజం మొత్తంగా పతనం అయి ఉన్నప్పుడు మాకు మాత్రం ఉన్నత వ్యక్తిత్వం గల కార్యకర్తలెక్కడి నుండి వస్తారు అని దీనికి జవాబు చెప్తుంటారు. (ప్రభుత్వం కూడ అవినీతిపరులయిన అధికారుల గురించి, దుర్మార్గులయిన సిబ్బంది గురించి అడిగినప్పుడు ఈ రకమైన జవాబే చెప్తుంటుంది.) అటువంటప్పుడు రిక్రూట్‌మెంట్ కొంతకాలం పక్కన పెట్టి సమాజానికి నైతిక బలం కల్పించే కృషి మీద దృష్టి పెట్టడం ఉచితం కాదా అన్న ప్రశ్న హాస్యాస్పదంగా తోచవచ్చు. అలాంటప్పుడు కోవర్టులు, ఇన్‌ఫార్మర్లు, ద్రోహులు పుట్టకుండ ఎందుకుంటారు?

*ప్రజాతంత్ర వారపత్రిక*
*7 మే 2006*

# దంతెవాడ దమనకాండ ఇంకెంత కాలం?

మానవ సంచారం లేని రహదార్లు, తమ పాటికి తామే అడవులలో మేసి యజమాని లేని ఇంటికి చేరుకుంటున్న పశువులు, నిర్జనమైన గ్రామాలు, ఎక్కడికక్కడ కాలి బూడిదయిన అవశేషాలు, అడవుల మీద బరువుగా కూర్చున్న భయం - ఇదీ ఈ రోజు ఛత్తీస్‌గఢ్‌లోని బస్తర్ ప్రాంతానికి చెందిన దంతెవాడ జిల్లా చిత్రం.

కుంట మన సరిహద్దు సమీపంలోని తాలూకా కేంద్రం. తెలుగు వారికి సుపరిచితమైన ఊరు. ముఖ్యంగా గోదావరి జిల్లాల వాళ్లు వ్యాపారరీత్యా కుంటకు పోయి రావడం, కొందరు అక్కడే స్థిరపడి పోవడం దశాబ్దాలుగా జరుగుతున్నది.

ఈ రోజు కుంటలో గుంపులు గుంపులుగా తిరిగే సాయుధులయిన సల్వాజుడుం కార్యకర్తలు తప్ప మామూలు జనం వీధులలో కనిపించరు. ఆ ఊరిలోనే కాదు, దంతెవాడ జిల్లాలోని అన్ని రహదారి గ్రామాలలోనూ అదే పరిస్థితి. అటవీ శాఖ చెక్‌పోస్టులకు, మోటార్ రవాణా శాఖ చెక్‌పోస్టులకు పక్కనే సల్వాజుడుం చెక్‌పోస్టులు కనిపిస్తాయి. బాణాలు, పదునైన కత్తులు, కర్రలు, తుపాకులు పట్టుకున్న యువకులు వాటి పక్కన నిలబడి ఉంటారు. ప్రతీ వాహనమూ అక్కడ ఆగవలసిందే. తామెవరైనదీ ఎక్కడ నుంచి వస్తున్నదీ ఎక్కడికి పోతున్నదీ చెప్పవలసిందే. ఆ పైన వారి దయ. వారిని ఊరికే పోనీయవచ్చు. డబ్బులు తీసుకొని

పోనీయవచ్చు. అక్కడే ఆపేయవచ్చు. ఏది జరిగినా మౌనంగా సహించటమే ఉత్తమం. గొడవ పెట్టుకుంటే దెబ్బలు పడగలవు.

దంతెవాడ దట్టమయిన అడవులు నిండిన జిల్లా. అక్కడక్కడ ఉండే రహదార్ల దగ్గర చిత్రం ఇది కాగా రహదారి వదిలిపెట్టి అడవిలోకి పోతే ఏ అగ్ని గుండమో బద్దలయి ప్రజలను తరిమేసిందా అన్న అనుమానం వస్తుంది. కాలి బూడిదయి పోయిన గ్రామాలు కొన్నీ, ఎవరో తరిమితే ఇంటికి తాళం కూడ వేయకుండా ఇంటివాళ్లు పారిపోయినట్టు తోచే నిర్జన ఆవాసాలు కొన్నీ కనిపిస్తాయి. మనుషుల్ని చూడాలంటే రహదార్ల మీద సల్వాజుడుం కార్యకర్తల పహారాలో ఉన్న శరణార్థుల శిబిరాలకు పోవాలి. గ్రామాల నుండి ఎవరో తరిమివేయగా వారు ఈ శిబిరాలలోకి రాలేదు. శిబిరాలలోకి తరిమేయగా వారు గ్రామాలను ఖాళీ చేశారు. వాళ్లను గ్రామాల నుంచి శిబిరాలలోకి తరిమేసింది సల్వాజుడుం. అక్కడ వారికి కాపలా ఉంటున్నది సల్వాజుడుం. వారి తరఫున మాట్లాడేదీ సల్వాజుడుమే. సల్వాజుడుం కార్యకర్తలూ స్థానిక గ్రామాలకు చెందినవారే. వారిలో కొందరు ఆంధ్ర, బీహార్, ఉత్తరప్రదేశ్‌ల నుంచి వచ్చి స్థిరపడిన గిరిజనేతరులు కాగా అధిక భాగం ఆదివాసులే. వాళ్లంతా సంప్రదాయక తెగపెద్దలు, ఆదివాసీ భూస్వాములు, అవినీతిపరులు అని మావోయిస్టులు ఇస్తోన్న వివరణలను గుడ్డిగా నమ్మనవసరం లేదు. ఏ కారణంగానయితేనేం వారు మావోయిస్టుల వల్ల నష్టానికి గురయిన వారు. అయితే వారి చేతిలో చట్టాన్ని పెట్టి, వారికి పారామిలటరీ బలగాల అండ కల్పించి మావోయిస్టుల మీదా, వారి సానుభూతిపరుల మీదా హింసాత్మక దాడులు చేయిస్తున్న ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం నీతి చాలా అభ్యంతరకరమైనది. దానికి మావోయిస్టులు అంతే హింసాత్మకంగా స్పందిస్తుండటం దంతెవాడ జిల్లాను శ్మశానప్రాయంగా తయారు చేసింది.

## వ్యూహాత్మకమైన ఆలోచన

ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం అనుసరిస్తోన్న విధానం వెనుక ఒక వ్యూహాత్మకమైన ఆలోచన ఉంది. అడవులలో ఉన్న గ్రామాలన్నిటినీ ఖాళీ చేయించేస్తే మావోయిస్టులను ప్రజల నుంచి దూరం చేయవచ్చు. అడవులలో కేవలం దళాలు మిగులుతాయి. అప్పుడు పారామిలటరీని దింపి వారిని అంతమొందించవచ్చు. లేదా రాష్ట్రం నుండి బయటకు తరిమేయవచ్చు. ప్రభుత్వమే పోలీసులను ప్రయోగించి గ్రామాలను ఖాళీ చేయిస్తే మానవ హక్కుల ఉల్లంఘన అంటూ

గగ్గోలు పెడతారు కాబట్టి ఒక ప్రజా ఉద్యమమే గ్రామాలను కదిలించి, రహదార్ల పైకి తీసుకొచ్చినట్టు చూపించటం తగిన మార్గం అని ఛత్తీస్‌గఢ్ పాలకులు నిర్ణయించుకున్నారు. చెప్పుకోదగ్గ విషయం ఏమిటంటే ఈ ఆలోచన చేసింది పాలక పార్టీ కాదు. అసెంబ్లీలో ప్రతిపక్ష నేత అయిన కాంగ్రెస్ నాయకుడు, దంతెవాడ ఎమ్మెల్యే మహేంద్ర కర్మ. మావోయిస్టుల వల్ల నష్టపోయిన వారితో సల్వాజుడుం అనే ఉద్యమాన్ని అతనే లేవదీశాడు. అయితే బి.జె.పి ప్రభుత్వం వెంటనే స్పందించి అతని ప్రయత్నానికి పూర్తి సహాయ సహకారాలు అందించింది.

అవిభక్త కమ్యూనిస్టు పార్టీకి దంతెవాడ జిల్లాలో కొంత పునాది ఉండింది. సి.పి.ఐ ఇప్పటికీ అక్కడ కొంత బలం ఉన్న పార్టీయే. మహేంద్రకర్మ ఒకప్పుడు సి.పి.ఐ నాయకుడే. తరువాత కాంగ్రెస్‌లోకి వెళ్లి బాగా డబ్బు సంపాదించుకున్నాడు. మావోయిస్టులు నిష్కారణంగా ఇన్‌ఫార్మర్ల పేరిట చంపుతున్నారనీ, తమ ప్రశాసనాన్ని ప్రజలపైన బలవంతంగా రుద్దుతున్నారనీ అంటూ సి.పి.ఐ 1991-92లో మహేంద్ర కర్మతో కలిసి జనజాగరణ్ (ప్రజా చైతన్య) ఉద్యమాన్ని నడిపింది. ఈ ఉద్యమం పైన మావోయిస్టులు తీవ్రంగా విరుచుకుపడ్డారు. దాదాపు 15 మంది సి.పి.ఐ కార్యకర్తలను చంపారు. బహుశా ఈ కారణంగా సి.పి.ఐ ఆ ఉద్యమాన్ని విరమించుకుందేమో. అయితే మహేంద్రకర్మ వంటి వాడితో చేతులు కలిపి జనజాగరణ్ ఉద్యమం నడపడం పొరపాటయిందని భావించి విరమించుకున్నామని వారంటున్నారు.

2005 మే నెలలో అదే పేరుతో మళ్లీ ఉద్యమం ప్రారంభం అయింది. ఈసారి దానిలో సి.పి.ఐకి పాత్ర లేదు. పైగా అది ఆది నుంచి హింసాత్మకంగా సాగింది. మావోయిస్టులను నిందిస్తూ సభలూ, ఊరేగింపులూ నిర్వహించడం, వారి సానుభూతిపరుల ఇళ్లపైన దాడి చేసి వాళ్లను గుంజుకొచ్చి బహిరంగంగా 'తప్పు' ఒప్పించి పోలీసులకు అప్పగించడం ఈ జనజాగరణ్ కార్యక్రమాలు. దీనికి పోలీసుల సహకారం నూటికి నూరు పాళ్లు ఉండింది. మావోయిస్టులు జనజాగరణ్ ఉద్యమం పైన మళ్లీ పెద్దెత్తున విరుచుకుపడ్డారు. తమ జనాన్ని పోగుచేసి విల్లంబులతో దాడి చేశారు. జనజాగరణ్‌లో చురుకుగా పాల్గొన్నవారిని అపహరించి తీసుకుపోయి బాగా కొట్టారు. ఒకరిద్దరిని చంపారు.

అయితే సి.పి.ఐ వారి జనజాగరణ్‌లాగ ఇది ఆగలేదు. కేంద్ర ప్రభుత్వం సహకారంతో ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం నాగాలాండ్ నుంచి పారామిలటరీ బెటాలియన్‌ను తీసుకొచ్చి దంతెవాడలో దింపింది. మహేంద్రకర్మ రంగంలోకి దిగి జనజాగరణ్‌ను

తన చేతిలోకి తీసుకొని సల్వాజుడుం అని పేరు పెట్టి దానికి మరింత తీవ్రరూపం ఇచ్చాడు. సల్వాజుడుం కార్యకర్తలు, నాగా బెటాలియన్ జవాన్లు కలిసి మావోయిస్టులకు బలం ఉన్న గ్రామాలపైనా మావోయిస్టు సానుభూతిపరుల ఇళ్లపైనా దాడులు చేయసాగారు. ఈ దాడులలో అందరూ పాల్గొనవలసిందే. పాల్గొనడానికి నిరాకరించిన వారిని శిక్షిస్తారు. మహేంద్రకర్మ స్వగ్రామమైన ఫరస్పాల్ పరిసర పల్లెల్లో సల్వాజుడుంలో భాగం కావడానికి నిరాకరిస్తే 700 రూపాయల జుర్మానా చెల్లించడంతో పాటు 7 కొరడా దెబ్బలు తినాలన్న నియమం పెట్టారు.

### లొంగకపోతే చావే

దాడికి గురయిన గ్రామస్తులు సరెండర్ అయి సల్వాజుడుంలో భాగం అయినట్టయితే బతికిపోతారు. వాళ్లప్పుడు ఊరు వదిలి వచ్చేయాలి. వాళ్ల కోసం ప్రభుత్వ ఆధ్వర్యంలో రహదార్లపైన శిబిరాలు వెలిసాయి. వాళ్లు వాటిలో ఉండాలి. లొంగని వాళ్లను అక్కడికక్కడే చంపేస్తారు. వాళ్ల ఇళ్ళు కాల్చేస్తారు. మరణాన్ని తప్పించుకోవాలన్నా ఊరు విడిచి పారిపోవాల్సిందే. అయితే రహదారి దిశగా కాకుండా అడవిలో ఇంకా లోపలికి పారిపోయి 'అన్నల' సంరక్షణలో బతకాలి. ఇవి రెండూ ఇష్టం లేని వాళ్లు సరిహద్దు దాటి మన ఖమ్మం జిల్లాలోకి వచ్చేశారు. సరిహద్దుకు రెండు వైపులా ఉండేది కోయ, గొత్తికోయ గిరిజనులే కాబట్టి ఎక్కడో ఒక చోట ఆశ్రయం పొందుతున్నారు. నిజానికి చాలామంది సల్వాజుడుం, మావోయిస్టు కార్యకర్తలు కూడ ప్రాణభయం కారణంగా ఇటు వచ్చేశారు. చింతూరు, దుమ్ముగూడెం, భద్రాచలం, చర్ల మండలాల గ్రామాలలో ఈ కాందిశీకులు చాలా మందే ఉన్నారు. దంతెవాడ జిల్లాలోని రహదారి శిబిరాలలోని వారు చాలావరకు కృత్రిమ కాందిశీకులు కాగా, నిజమైన కాందిశీకులు ఖమ్మం జిల్లాలో ఉన్నారు.

2005 జూన్‌లో మొదలయిన ఈ సల్వాజుడుం ఉద్యమంలో వందల - బహుశా వేల - ఇళ్లు దహనం అయ్యాయి. కుంట తాలూకాలోనయితే రహదారికి 20 లేక 30 కిలోమీటర్లలో ఉన్న గ్రామాలన్నీ ఖాళీ అయ్యాయి. కుంట, బిజాపూర్, బైరంగఢ్, గీదం, ఉసూర్ బ్లాకులలో మొత్తం 17 రహదారి శిబిరాలు ఉన్నాయి. వాటిలో ఉన్న జనాభా 54,768 అనేది దంతెవాడ జిల్లా కలెక్టర్ చెప్తున్న లెక్క. అయితే 'క్యాంపులలోకి వచ్చిన వారంతా ప్రభుత్వం పక్షాన ఉన్నారు, అడవిలో ఉన్నవారు మావోయిస్టుల పక్షాన ఉన్నారు' అన్న ఛత్తీస్‌గఢ్ ముఖ్యమంత్రి రమణ్‌సింగ్ ప్రకటనను దృష్టిలో ఉంచుకున్నప్పుడు ఈ జన సంఖ్య లెక్కలలో అతిశయోక్తి ఉందేమో

అనిపిస్తుంది. అయినప్పటికీ శిబిరాలలో వేల సంఖ్యలో జనం ఉన్న మాట వాస్తవం. ఆ శిబిరాల స్థితిని వివరంగా వర్ణించే బదులు కోళ్ల ఫారంలో కోళ్లలాగ ఉంటున్నారంటే సులభంగా అర్థం అవుతుంది. 10 మంది నివసించగల షెడ్‌లలో 40 నుంచి 80 మంది ఉంటున్నారు. షెడ్‌లకు ఎటువైపూ గోడలు లేవు. కొన్నిటికి పై కప్పు కూడ లేదు. గ్రామాల నుంచి బెదిరించి తీసుకొచ్చిన వాళ్లు వెనక్కి పోకుండ ఉండడానికి రెండు పూటలా అన్నం పెడుతున్నారు గానీ వెనక్కి పోయే ప్రమాదం లేని సరండర్డ్ మావోయిస్టులకు అన్నం కూడ పెట్టడం లేదు.

ఇది మొదలయినప్పటి నుండి - అంటే 2005 జూన్ నుంచి - రెండు వైపులా పెద్దఎత్తున హింస జరుగుతున్నది. సల్వాజుడుం నాగా బెటాలియన్‌ను వెంట బెట్టుకొని గ్రామాలపైన దాడి చేసి చాలామందిని చంపింది. అయితే ఈ హత్యల లెక్క ప్రభుత్వం దగ్గర కూడ లేదు. మన దగ్గర ఎంత దట్టమైన అడవిలో 'ఎన్‌కౌంటర్' జరిగినా పోలీసులు ఎంఆర్‌వోను శవాల దగ్గరికి చేర్చి పంచనామా జరిపిస్తున్నారు. ఛత్తీస్‌గఢ్‌లో అదేమీ లేదు. సల్వాజుడుం వాళ్ళూ పారామిలటరీ బలగాలూ కలిసి దాడులు చేస్తారు. కాల్పులు జరిపి చంపుతారు. కాని శవాలను తీసుకురారు. పంచనామా జరపరు. ఎక్కడా అధికారికంగా ఏ రికార్డూ ఉండదు. అసలు తమ కాల్పులలో గాయపడ్డవాళ్లు చచ్చారా బతికారా అని కూడ వాళ్లు తెలుసుకోరు. కాబట్టి అవతలి వైపు ఎంత మంది చనిపోయారో చెప్పడం కష్టం. మావోయిస్టుల ప్రచురణలలో వచ్చిన సమాచారాన్ని బట్టి ఊహ చేయవలసిందే.

మావోయిస్టులు చేసిన హత్యల వివరాలు మాత్రం ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం కచ్చితంగానే చెప్తుంది. సల్వాజుడుం ప్రారంభం అయిన నాటి నుంచి (అంటే 2005 జూన్ నుంచి) నేటిదాకా మావోయిస్టులు దంతెవాడ జిల్లాలో 228 మందిని చంపారనీ, అందులో 12 మంది స్పెషల్ పోలీస్ ఆఫీసర్లు, 25 మంది పారా మిలటరీ సిబ్బంది కాగా 191 మంది పౌరులనీ చెప్తుంది. ఆ 191 మందిలో ఒకరిద్దరిని మినహాయిస్తే అంతా ఆదివాసులే. గత ఏడాది జూన్‌కు పూర్వం మావోయిస్టులు చేసిన హత్యలే ఎక్కువ ఉండేవి. (బస్తర్ పోలీసులు మనవాళ్లలాగ 'ఎన్‌కౌంటర్' నిపుణులు కారు). కానీ సల్వాజుడుం ఏర్పడి దానికి పారామిలటరీ తోడయిన తరువాత ఆ తేడా పోయింది. వారి వైపు నుంచి జరిగిన హత్యలూ అదే మోతాదులో ఉన్నట్టయితే ఒక్క దంతెవాడ జిల్లాలోనే గడచిన 12 నెలల కాలంలో 200 పైగా ప్రాణాలు ఈ ఘర్షణలో పోయాయనీ, అందులో 90 శాతం పైగా ఆదివాసులేనని నిర్ధారించవలసి ఉంటుంది.

ఇది ఆదివాసీ సమాజంలో అంతర్యుద్ధంలాగ తోస్తున్నదా?

దానిని పెంచే పని ఇప్పుడు రెండు వైపులా జరుగుతున్నది. ప్రభుత్వం సల్వాజుడుంలోని చురుకయిన ఆదివాసీ యువకులలో 5000 మందిని ఇప్పటికే ఎంపిక చేసి స్పెషల్ పోలీస్ ఆఫీసర్లుగా నియమించి తుపాకులిచ్చింది. అటు మావోయిస్టులు తమతో ఉన్న ఆదివాసీ యువకులకు తుపాకులిచ్చి భూంకాల్ మిలీషియా అని పేరు పెట్టారు.

## ఆదివాసుల్లో భూస్వాములు!

సల్వాజుడుంతో ఉన్నది ఆదివాసీ పెత్తందార్లనీ, మావోయిస్టులతో ఉన్నది ఆదివాసీ పేదలనీ, ఈ వర్గ విభేదం గమనించకుండ రెండు వైపులా ఆదివాసులే చనిపోతున్నారని అనవసరంగా రచ్చ చేస్తున్నామనీ నింద వేసే అవకాశం ఉంది. భూస్వాములయిన ఆదివాసులలో ఆదివాసీ తెగ పెద్దలూ పూజార్లూ మావోయిస్టుల ఉద్యమాల ఫలితంగా తమ ఆధిపత్యాన్ని కోల్పోయారనీ, సల్వాజుడుంకు దన్నుగా నిలిచారనీ మావోయిస్టుల ప్రచురణలలో వ్యాఖ్యానించడం చూస్తున్నాం. దీని గురించి రెండు మాటలు చెప్పడం అవసరం.

ఆదివాసులలో భూమి ఎక్కువ ఉన్నవాళ్లు కొందరున్న మాట వాస్తవమేగానీ వాళ్లకు 'భూస్వాములు' అన్న బిరుదు ఇచ్చే ముందు వాళ్లు చేసే వ్యవసాయం - సాగునీరు గానీ, మేలయిన విత్తనాలుగానీ, ఏ రకమైన ఎరువులుగానీ ఎరుగనిదనీ, వారు వర్షాధారంగా పండించే వరిపంట ఎకరానికి రెండు లేక మూడు క్వింటాళ్ల దిగుబడి మాత్రమే ఇస్తుందనీ తెలుసుకోవడం అవసరం. కాగా దంతెవాడలో మావోయిస్టుల పోరాటం (వారి పరిభాషలో చెప్పాలంటే) పేద ప్రజల సామాజిక ఆర్థిక హక్కులు సాధించే దశలో లేదు. దానిని దాటి, గెరిల్లా దశ దాటి 'విముక్త ప్రాంత' స్థాపన దశ చేరుకుంది. అంటే భారత ప్రశాసనాన్ని బల ప్రయోగంతో పక్కకు నెట్టి తమ రాజ్యాధికారాన్ని నెలకొల్పే దశలో ఉంది. దీని మంచిచెడుల గురించి ఎవరికి ఏ అభిప్రాయమయినా ఉండవచ్చును గానీ దీనివల్ల కేవలం ఆదివాసీ పెత్తందారీ వర్గాలు మాత్రమే నష్టపోతాయనుకుంటే పొరపాటే.

ప్రభుత్వం నిర్వహించిన ఎన్నికలలో ఎన్నికయిన స్థానిక సంస్థల ప్రతినిధులెవరూ ఇక్కడ పరిపాలన చేయడానికి వీలు లేదు. మావోయిస్టులు నెలకొల్పిన సంఘమే పరిపాలన చేస్తుంది. ప్రభుత్వ శాఖలేవీ తమ విధులు నిర్వర్తించడానికి వీలు లేదు. మావోయిస్టుల పరిపాలనే అన్నీ చూసుకుంటుంది.

(విద్య, వైద్య రంగాలను మాత్రమే దీనినుంచి మినహాయించారు). అడవి లోపలి ప్రాంతంలో రోడ్లు వేస్తే ప్రభుత్వ సాయుధ బలగాలు యథేచ్ఛగా ప్రవేశిస్తాయి కాబట్టి రోడ్లు వేయడానికి వీలు లేదు. వేసినవి తవ్వేశారు. గడిచిన సంవత్సర కాలంలో పారామిలటరీ బలగాలు పాఠశాల భవనాలలో విశ్రాంతి తీసుకుంటున్నాయి కాబట్టి కొన్ని పాఠశాల భవనాలను పేల్చేశారు. కొత్త పాఠశాల భవనాలు కట్టడానికి వీలు లేదు. కుంట తాలూకాలో 31 స్కూళ్లను మావోయిస్టులు పేల్చేశారని ఆ తాలూకా తాసీల్దారు అంటాడు. తునికాకును ప్రభుత్వం నిర్ణయించిన రేటుకు తెంపడానికి వీలు లేదు. తాము నిర్ణయించిన రేటుకే తెంపాలి. తొలినాడు మావోయిస్టులు ఆదివాసీ ప్రజల సామాజిక ఆర్థిక హక్కుల సాధనకు పరిమితమైన దశలో తునికాకు కూలిరేటు, ఫారెస్టు పనుల కూలిరేట్లను గణనీయంగా పెంచారు. అటవీశాఖ, పోలీసు శాఖల దోపిడీ దౌర్జన్యాలను అరికట్టారు. సాంప్రదాయక పటేల్ - పట్వారీ వ్యవస్థను అదుపు చేశారు. ఆ దశలో వారి చర్యల వల్ల కేవలం స్థానిక పెత్తందారీ వర్గాలే నష్టపోయాయి. కానీ దంతెవాడ అటవీ ప్రాంతాన్ని 'విముక్త' ప్రాంతంగా ప్రకటించిన తరువాత అదే పరిస్థితి ఉండదు. పీడిత ప్రజల అంతిమ విముక్తికి ఇది అవసరమా కాదా అన్న చర్చలోకి నేను పోవడం లేదు. దీని పర్యవసానాలను నిజాయితీగా గుర్తించడం మాత్రం అవసరం.

2005 మే నెలలో జనజాగరణ్ అభియాన్ ప్రారంభమైన వైనాన్ని గురించి దాదాపు అందరూ అంగీకరించే వాస్తవం ఒకటి ఉంది. అంతకు ముందు సంవత్సరం పంటలు విఫలం కావడం వల్ల జరుగుబాటుకు కష్టంగా ఉండింది. ప్రభుత్వం కరువు పనుల కింద చేపట్టిన రోడ్డు నిర్మాణాన్ని మావోయిస్టులు సాగనివ్వలేదు. ప్రభుత్వం తునికాకు రేటు తగ్గించినందుకు నిరసనగా ఆకు తెంపడాన్ని మావోయిస్టులు బంద్ చేయించారు. ఈ స్థితిలో తమ బతుకు ఎట్లా గడవాలని బిజాపూర్ ప్రాంతంలోని రెండు మూడు గ్రామాల ప్రజలు తమంతట తామే సమావేశాలు పెట్టుకొని చర్చించుకోసాగారు. మావోయిస్టుల చర్యల పట్ల వారిలో ఉన్న నిరసనను గమనించిన మావోయిస్టు వ్యతిరేకులు రంగంలోకి దిగి దానిని తమ చేతిలోకి తీసుకున్నారు. ఆ తరువాత పరిణామాలను పైన చూశాము. కేవలం పెత్తందారీ వర్గాలలోనే కాక ప్రజాసామాన్యంలోనూ మావోయిస్టుల చర్యల పట్ల కొంత నిరసన ఉండబట్టే 'సల్వాజుడుం' సాధ్యం అయిందన్న వాస్తవాన్ని గుర్తించడం అవసరం. ఇరవై ఏళ్లకు పైగా ఛత్తీస్‌గఢ్ అటవీ ప్రాంతంలో ఏకచ్ఛత్రాధిపతులుగా ఉన్న మావోయిస్టులు ఈ నిరసనను ఊహించినట్టు లేరు. వారిస్తున్న వివరణలలో స్పష్టంగా కనిపిస్తున్న తత్తరపాటు దీనికి నిదర్శనం.

ప్రస్తుతం ఇరుపక్షాలవారూ మొండిగా ఉన్నారు. మావోయిజం అంతమయ్యే వరకూ సల్వాజుడుం కొనసాగుతుంది అని సల్వాజుడుం నాయకులు బయటికి ప్రకటిస్తున్నారు గానీ అది కల్ల అని వారికి తెలుసు. అట్లాగని సల్వాజుడుంను ఇప్పుడు విరమించుకోనూ లేరు. విరమించుకుంటే వాళ్లెవరూ బతకరు. మావోయిస్టుల సద్గుణాలలో క్షమాగుణం లేదు. కానీ ఈ ఆదివాసీ హననం ఎంతకాలం సాగగలదు? పరిస్థితిని చేతిలోకి తీసుకొని ఇరుపక్షాలకూ బుద్ధి చెప్పగల వారెవరయినా ఛత్తీస్‌గఢ్‌లో ఉన్నారా? అటువంటి వారి కోసం వెతికే ప్రయత్నం సఫలం కాగలదా?

*ఆంధ్రజ్యోతి దినపత్రిక*
*26 మే 2006*

# ఛత్తీస్‌గఢ్: హితవు చెప్పగల బుద్ధిజీవుల కోసం...

మధ్యతరగతి బుద్ధిజీవుల కంఠశోష వృథా అనే అభిప్రాయం బాగా ప్రాచుర్యం పొంది ఉంది. బుద్ధిజీవులు సహితం రాయకుండ ఉండలేక రాస్తుంటారు గానీ చేతిలో అధికారం గానీ తుపాకీ గానీ లేనప్పుడు మనమేం చెప్పినా ఏం ప్రయోజనం అని నిస్పృహ చెందుతుంటారు. చేతిలో అధికారము, తుపాకులు ఉండేవారు తమ అవసరాల కోసం ఈ అభిప్రాయాన్ని ప్రోత్సహించడం దానికి బలం చేకూరుస్తున్నది. వివేచన అంటే భయపడే అధికార వర్గాల సంగతి పక్కన పెట్టండి. వివేచనతో కూడిన శాస్త్రీయ దృక్పథం ప్రపంచ మార్పుకు అవసరం అని నమ్మేవారు సహితం బుద్ధిజీవుల పాత్రలను కించపరచడం తరచుగా చూస్తుంటాం.

ఛత్తీస్‌గఢ్ పోయివస్తే ఈ అభిప్రాయం తలక్రిందులయ్యే అవకాశం ఉంది. ఆ రాష్ట్రంలో ఒక నోరున్న ప్రజాతంత్ర మేధావి వర్గం ఉండి ఉంటే ఇప్పుడు జరుగుతున్న దుర్మార్గాలు జరిగేవా అన్న సందేహం అక్కడ రెండు రోజులు గడిపి వచ్చినాక కలుగక మానదు. ఛత్తీస్‌గఢ్ రాష్ట్ర ప్రభుత్వమైనా, మావోయిస్టులైనా అప్పుడు ఇంత అనాలోచితంగా ప్రవర్తించగలుగుతారా అన్న అనుమానం రాక మానదు.

గొప్పలు చెప్పుకోవడం కాదు గానీ ఛత్తీస్‌గఢ్‌ను ఆంధ్రప్రదేశ్‌తో పోలిస్తే ఈ తేడా అర్థం అవుతుంది. మన రాష్ట్ర పోలీసు శాఖలో ఒక

బలమైన వర్గం లోపాయికారీగా నయీం వంటి నక్సలైట్ వ్యతిరేకుల హింసాత్మక చర్యలకు మద్దతు ఇస్తూ ఉందిగానీ ప్రభుత్వమే 'కోబ్రాలు మావాళ్ళే'నని ప్రకటించుకోలేదు. ముఖ్యమంత్రి, హోంమంత్రి కోబ్రాలను అదుపు చేస్తాం అని అప్పుడప్పుడు హూంకరిస్తుంటారు కూడ. ప్రైవేట్ హంతక ముఠాలతో కలిసి తెల్లబట్టల పోలీసులు వివిధ ప్రజాసంఘాల కార్యకర్తలను హతమారుస్తున్నారు గానీ అధికారికంగానే యూనిఫారంలో ఉన్న పోలీసులు వారితో కలిసి దాడులకు దిగరు. మారుమూల అడవులలోకి చొరబడి నక్సలైట్లను జంతువులను వేటాడినట్టు వేటాడి చంపుతుంటారు గానీ చచ్చిన తరువాత మాత్రం వారికి మానవ శవాలకు చేసే చట్టపరమైన సంస్కారాలన్నీ తప్పనిసరిగా చేస్తారు. స్థానిక అడవివాసులను కొట్టయినా, తన్నయినా మృతదేహాలను బయటకు తీసుకొచ్చి పంచనామా, శవపరీక్ష నిర్వహిస్తారు. కుక్కలకూ నక్కలకూ విడిచిపెట్టి ఎంత మందిని చంపామన్న లెక్క సహితం రాసుకోకుండ ఉండరు.

అనాగరిక పరిపాలనకు కూడ కొన్ని హద్దులు ఉంటాయి. ప్రజాసామాన్యం తన నిరసన ద్వారా అమలు చేసే హద్దులను మించింది లేదుగానీ అది లేనప్పుడు బుద్ధిజీవుల విమర్శ ఒక మేరకు పనిచేయగలదు. మన దగ్గర ఆ పాత్ర నిర్వహించే ప్రజాతంత్ర భావాలు గల బుద్ధిజీవుల వర్గం ఉండటం - పత్రికలలో కాలమిస్టుల నుండి వివిధ ఉద్యమసంస్థల ప్రతినిధులు, రచయితల దాకా - ప్రభుత్వానికి పైకి కనిపించని కొన్ని హద్దులు గీయగలిగిందని అటువంటి వర్గం లేని రాష్ట్రాలను చూస్తే తెలుస్తుంది.

ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం మావోయిస్టులకు వ్యతిరేకంగా ప్రోత్సహిస్తున్న 'సల్వాజుడుం' మన దగ్గర రహస్యదాడులు చేస్తున్న కోబ్రాలు, టైగర్‌లతో అన్ని రకాలుగా పోల్చదగినది కాని మాట వాస్తవమే. బలవంతంగా సల్వాజుడుం దాడులలో భాగం చేయబడుతున్న ప్రజలను మినహాయించి ఇష్టపూర్వకంగా అందులో భాగమైన వారినే లెక్కించినా, అది వేల సంఖ్యలో ఉంది. అయిదు వేల మంది ప్రభుత్వం దగ్గర తుపాకులు తీసుకొని స్పెషల్ పోలీస్ ఆఫీసర్లుగా నియమితులయ్యారంటే సల్వాజుడుం కేవలం పిడికెడు మంది దుర్మార్గుల గుంపు కాదని అర్థం అవుతుంది.

అయినప్పటికీ చట్టాన్నీ ప్రజాస్వామ్య పాలనా నియమాలనూ బాహాటంగా గాలికి వదిలి ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం సల్వాజుడుం చేతికి 'శాంతి భద్రతల' నిర్వహణ అధికారాన్ని అప్పగించి పారా మిలటరీ బలగాలను తోడు ఇవ్వడం ఆందోళనే

కాక చాలా ఆశ్చర్యం కూడ కలిగించే విషయం. సమాజంలో ఒక వర్గానికి తుపాకులిచ్చి మీ శత్రువులను మీరు చంపుకోండి, మా పారా మిలటరీని తోడు తీసుకెళ్లండి అని ఏ ప్రభుత్వమైనా అనగలుగుతుందని మనం సులభంగా ఊహించలేం - లోపాయికారీగా ఎన్ని జరుగుతున్నప్పటికీ. ఛత్తీస్‌గఢ్‌లో రాష్ట్ర గవర్నరే స్వయంగా సల్వాజుడుం వీరోచిత 'పోరాటాన్ని' అభినందించి యువకులందరూ ఆ ఉద్యమంలో భాగం కావాలని ఉపన్యాసం ఇచ్చాడు. వాళ్లు కూడ అంతే బహిరంగంగా పదునయిన కత్తులు, విల్లంబులు, ప్రభుత్వం ఇచ్చిన తుపాకులు పట్టుకొని రహదార్లపైన చెక్‌పోస్టులు నెలకొల్పి తనిఖీలు చేస్తూ, ఖర్చులు వసూలు చేసుకుంటూ, తమను విమర్శించే వార్తలు రాసే విలేఖరులను ఊళ్ళ నుండి తన్ని తరిమేస్తూ, తమ మాట సాగని గ్రామాలను తగలబెట్టి బూడిదచేస్తూ, చందాల పేరిట వ్యాపార వర్గాలను దోచుకుంటూ యధేచ్ఛగా ఊళ్ళు ఏలుతున్నారు.

ఇది చాలా అనాగరికమనీ ప్రమాదకరమనీ ప్రభుత్వాన్ని మందలించే స్థాయిగల పెద్దమనుషులు ఆ రాష్ట్రంలో కరువయ్యారు. ఘోరమైన ఈ చిత్రాన్ని వార్తలకెక్కించే పత్రికా రంగమే కరువయ్యింది. ప్రధానమైన హిందీ దినపత్రికలు రాయ్‌పూర్, బిలాస్‌పూర్ ప్రాంతాన్ని దాటి దక్షిణానికి దాదాపు రావు. వచ్చేవన్నీ స్థానిక పత్రికలు. అవి స్థానిక రౌడీలను విమర్శించి బతకడం కష్టం.

హితవు చెప్పగల పెద్దమనుషుల లేమి ప్రభుత్వానికే కాదు, మావోయిస్టులకు కూడ ప్రమాదకరమైన 'లైసెన్స్' ఇచ్చింది. ఛత్తీస్‌గఢ్‌లో మావోయిస్టులు చేసిన కొన్ని పనులు ఇక్కడయితే జరిగేవా అన్న సందేహం కలుగుతుంది. మన దగ్గర కొన్ని మారుమూల ప్రాంతాలలో వాళ్ళు రోడ్లు వేయనివ్వలేదన్న నింద తరచుగా వినబడిన రోజులుండేవి. అది తప్పు అన్న విమర్శ ప్రభుత్వం నుండి, పోలీసుల నుండే కాక మావోయిస్టులకు సన్నిహితులయిన వారి నుండి కూడ బలంగా వచ్చేసరికి ఇప్పుడు దాదాపు ఎక్కడా రోడ్లు వేయడాన్ని వాళ్ళు ఆపడం లేదు. ఛత్తీస్‌గఢ్‌లో అటువంటి విమర్శలూ లేవు, మావోయిస్టులు తమ పద్ధతులు మార్చుకున్నదీ లేదు. వారి ప్రాబల్యం ఉన్న ప్రాంతాలలో కొత్త రోడ్లు వేయనీయక పోవడమే కాదు, పాత రోడ్లన్నింటినీ తవ్వేసారని జనం వాపోతున్నారు.

హింస మన దగ్గర కూడ మావోయిస్టులు చేస్తూనే ఉన్నారు గానీ వారు క్రూరంగా లేక విచ్చలవిడిగా ప్రవర్తించినప్పుడల్లా వారి సిద్ధాంతంపట్ల, లేక లక్ష్యం పట్ల గౌరవం ఉన్నవారి నుండే విమర్శ బలంగా వినపడుతుంది. మొన్నటి ఫిబ్రవరి 28న డోర్నపాల్ అనే గ్రామంలో జరిగిన సల్వాజుడుం సభకు హాజరై టిప్పర్‌లో

వెనక్కి వస్తున్న వారిపైన మావోయిస్టులు మందుపాతర ప్రయోగించి 26 మందిని చంపారు. మందుపాతరతోనే అందరూ చనిపోలేదనీ, బతికి బయటపడి పారిపోతున్న వారి గొంతులు కోసి మరీ చంపారనీ దాదాపు అందరూ అంటున్నారు. ఏప్రిల్ 29న సల్వాజుడుం క్యాంపు నుండి తమ గ్రామానికి వెళ్ళిన మణికొంట గ్రామస్తులను మావోయిస్టులు మూకుమ్మడిగా కిడ్నాప్ చేసి అందులో యువకులయిన 15 మంది గొంతులు కోసి చంపారు.

మన దగ్గర ఇటువంటి ఘటనలు జరిగినప్పుడు చాలా చర్చ జరుగుతుంది. పోలీసులు, ప్రభుత్వము పెట్టే చర్చకు విలువ లేదు కానీ వామపక్షవాదులే ఎవరో ఒకరు చర్చ లేవదీస్తారు. ఇది మార్క్సిజం కానేకాదు అని ఒకరంటారు. విప్లవంలో హింసకు చోటు ఉండవచ్చుగానీ క్రూరత్వానికి లేదు అని మరొకరు అంటారు. దీనికి మావోయిస్టులు, వారికి సన్నిహితులయిన వారు ఏవో జవాబులు చెప్తుంటారు. ఎవరూ వినడం లేదని, ఈ హితోపదేశాలకు విలువ లేదని విమర్శ పెట్టేవారు నిస్పృహ చెందుతుండవచ్చును గానీ దాని ప్రభావం ఉందని అటువంటి విమర్శ, విమర్శకులు లేని ప్రాంతాలను చూసినప్పుడు అర్థం అవుతుంది.

ఏ విధంగానయినా ముందు శాంతి నెలకొంటే మిగిలిన విషయాలు తరువాత చర్చించుకోవచ్చునని ఛత్తీస్‌గఢ్‌లో ప్రజల నోట వింటున్నాం. మావోయిస్టు - సల్వాజుడుం ఘర్షణలో రెండు వైపులా చనిపోతున్నది ప్రధానంగా ఆదివాసులే. గడిచిన 12 నెలల కాలంలో 400 మంది దాకా ఒక్క దంతెవాడ జిల్లాలోనే చనిపోయారు. అందువల్ల ఈ ఆదివాసీ హననం ఆగాలన్న కోరిక బలంగా ఉంది. మన దగ్గర 2004 సంవత్సరంలో కేవలం 6 నెలలు నిలిచిన కాల్పుల విరమణ కోసం పౌరస్పందన వేదిక 6 సంవత్సరాలకు పైగా కృషి చేయవలసి వచ్చింది. ఛత్తీస్‌గఢ్ బుద్ధిజీవులలో అటువంటి ప్రయత్నం చేయగలవారు లేని లోటు ఇప్పుడు స్పష్టంగానే తెలుస్తున్నది.

*ప్రజాతంత్ర వారపత్రిక*
*21 మే 2006*

*తేదీల వారీగా చూస్తే 'దంతెవాడ దమనకాండ ఇంకెంత కాలం?' వ్యాసం కంటే ఇదే ముందు రావాలి కాని విషయపరంగా ఇది దానికి కొనసాగింపుగా ఉండడం వల్ల ఇలా మార్చాం.*

# బస్తర్ మారణకాండ ఇప్పట్లో ఆగేనా?

ఛత్తీస్‌గఢ్ వార్తలు మళ్లీ చాలా కలవరం పుట్టిస్తున్నాయి. కుంట తాలుకాలో మావోయిస్టులు మూడవ దఫా పెద్ద నరమేధానికి పాల్పడ్డారు. దర్భగూడలో గతంలో టిప్పర్‌ను పేల్చి, చనిపోని వారి గొంతులు కోసి 26 మందిని చంపారు. ఆ తరువాత మణికొంటలో 36 మందిని అపహరించి 15 మందిని చంపారు. ఇప్పుడు ఎర్రబోరులో పెద్దసంఖ్యలో జనాన్ని అపహరించి ఇళ్లు తగలబెట్టి 30 చిల్లర మందిని హతమార్చారు.

ఏ కారణంగానో మావోయిస్టులు చంపిన వార్తలు మన పత్రికలలో వచ్చిన దానిలో శతాంశం కూడ వాళ్లు, వాళ్ల సానుభూతి పరులు చనిపోయిన వార్తలు రావు. మన దగ్గర పత్రికా రంగం మరీ అంత పక్షపాత బుద్ధితో ఉందనలేము. అయినప్పటికీ వార్తల ప్రచురణలో ఈ వివక్ష ఉండడానికి రెండు కారణాలున్నాయి. ఛత్తీస్‌గఢ్‌లో పత్రికారంగం చాలా అపరిపక్వంగా ఉంది. మన దగ్గరున్నట్టు గ్రామీణ విలేఖర్ల వ్యవస్థ లేదు (కనీసం బస్తర్ ప్రాంతంలో లేదు). అందువల్ల అధికార యంత్రాంగం ఇచ్చిన వార్తలే వార్తలు. అక్కడి అధికార యంత్రాంగం సల్వాజుడుం, పారా మిలిటరీ బలగాలు విడివిడిగానూ, ఒకటిగానూ చేస్తున్న హత్యల గురించి మాట్లాడదు. పత్రికా ప్రకటనలు ఇవ్వకపోవడమే కాదు. కనీసం తన అవసరాల కోసం కూడ ఆ సమాచారం సేకరించదు. బస్తర్‌లో సాగుతున్న

యుద్ధంలో అవతలివైపు ఎంతమంది చనిపోయారన్న సమాచారం ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం దగ్గర సహితం లేదు.

ఉదాహరణకు దాదాపు నెల రోజుల క్రింద దేవరపల్లి అనే ఊరిలోనో ఊరిదగ్గరో సల్వాజుడుం గుంపు, పారామిలిటరీ బలగాలు కలిసి 50 మందికి పైగా మావోయిస్టు సానుభూతిపరులను చంపినట్టు ఉత్తర భారతదేశంలోని పత్రికలు చిన్న వార్త ప్రచురించాయి. తెలుగు పత్రికలలోగానీ మన దగ్గర ప్రచురితమయ్యే ఆంగ్ల పత్రికలలో గానీ ఈ వార్త రాలేదు. అయినప్పటికీ ఇది విశ్వసనీయమైన వార్తే - ఎందుకంటే ఈ విషయం బయటపెట్టింది సి.పి.ఐకి చెందిన కుంట మాజీ ఎం.ఎల్.ఏ మనీష్ కుంజం. అతను ఇటు మావోయిస్టులను, అటు సల్వాజుడుంను కూడ వ్యతిరేకిస్తున్న వ్యక్తి కాబట్టి ఒకరికి అనుకూలంగా అబద్ధాలు చెప్పవలసిన అగత్యం అతనికి లేదు.

ఈ హత్య, ప్రతిహత్యల కాండలో స్పష్టంగా కనిపిస్తున్న వికారమైన వాస్తవం ఏమిటంటే సల్వాజుడుం ఎంత నిర్విచక్షణగా చంపుతున్నదో మావోయిస్టులూ అంతే నిర్వచక్షణగా చంపుతుండడం. మన దగ్గర కూడ కాలక్రమంలో విచక్షణారాహిత్యం పెరిగింది. ఎవరి మీద సహేతుకమైన ఆగ్రహం ఉందో వారిని మాత్రమే శిక్షించాలన్న నియమాన్ని మావోయిస్టులు కొద్ది కొద్దిగా అతిక్రమిస్తూ వచ్చారు. పోలీసుల విషయంలో ఇది చాలా దూరం పోయింది. మందుపాతర పెట్టి పోలీసు వాహనాలు పేల్చేసేటప్పుడు అందులో ఎవరుంటే వారంతా చనిపోతారు. అంతేకాక, మారుమూల ప్రాంతాలలో నిరాయుధులుగా చేతికి చిక్కిన పోలీసు సిబ్బందినెవరినయినా చంపడం కొంత కాలంగా జరుగుతున్నది. ఇతర 'శత్రువర్గాలకు' కూడ ఈ విచక్షణా రాహిత్యాన్ని క్రమంగా వ్యాపింపజేసారు. ప్రభుత్వ నిర్బంధ విధానాల పట్ల నిరసన తెలిపే పేరుతో పాలక పార్టీ స్థానిక ప్రతినిధులెవరిపైనయినా దాడి చేయడం చాలా కాలంగా జరుగుతున్నది. ఒకరి పైన దాడి చేసేటప్పుడు పక్కన వేరే ఎవరయినా ఉన్నట్టయితే వారికి కూడ హాని జరుగుతుందని ఆగిన రోజులు ఉండే ఉంటాయి. కాని ఇప్పుడు ఆ నియమమూ అన్ని సందర్భాలలో మావోయిస్టులు పాటించడం లేదు. మక్తల్ ఎం.ఎల్.ఏ నర్సిరెడ్డిని ఎందుకు చంపారో చెప్పలేదు సరికదా, అతనితోపాటు మరొక పదిమందిని ఎందుకు కాల్చి చంపారన్న దానికి వివరణ లేదు. సంజాయిషీ లేదు.

ఛత్తీస్‌గఢ్‌కు తిరిగి వస్తే, తెలుగు పత్రికలు ఏ కారణంగానో మావోయిస్టు - సల్వాజుడుంల ఘర్షణను గొత్తికోయ, కోయ తెగల మధ్య ఘర్షణగా

వ్యాఖ్యానిస్తున్నాయి. భద్రాచలంలో పుట్టిన ఈ వ్యాఖ్యను బస్తర్‌లో ఎవరూ సమర్థించడం లేదు. అటువంటి వ్యాఖ్య చేస్తున్నారా అని ఆశ్చర్యపోతున్నారు కూడ. కీడెంచి మేలెంచమన్న సూక్తిలో విజ్ఞత ఉన్నమాట కాదనలేము గానీ అదే పనిగా కీడెంచడం వల్ల ఆ కీడును నిజం చేసే ప్రమాదం లేకపోలేదని కూడ గుర్తించడం అవసరం. అడవి లోతట్టు ప్రాంతాలలో గొత్తికోయల జనాభా సాపేక్షంగా ఎక్కువ ఉండడం వల్ల మావోయిస్టు అనుయాయులలో గొత్తి కోయలు సాపేక్షంగా ఎక్కువగా ఉన్నారు. రహదారి సమీప గ్రామాల్లో కోయలు ఎక్కువ ఉండడం వల్ల సల్వాజుడుంలో సాపేక్షంగా వారి సంఖ్య ఎక్కువ ఉంది. అంతకు మించి ఇక్కడ గొత్తికోయ - కోయ అన్న వైరుధ్యం లేదని బస్తర్‌లో అంటున్నారు. నిజానికి సల్వాజుడుం అగ్రనేత మహేంద్రకర్మ స్వయాన గొత్తికోయ తెగకు చెందినవాడు.

ఇది చెప్పడం అవసరం. ఎందుకంటే బస్తర్ సంగతి ఎట్లాగున్నా అక్కడి నుండి వలస వచ్చిన గొత్తికోయల 'భూమి దాహం' కారణంగా భద్రాచలం ప్రాంతం కోయలలో వారి పట్ల కొంత వ్యతిరేకత కొంతకాలం ఉండింది. వ్యతిరేకతకు తొలుత ఏ కారణం ఉన్నా అది కులంతో లేక తెగతో ముడిపడినట్టయితే ఆ తరువాత తొలినాటి కారణంతో నిమిత్తం లేకుండా పెరగగలదు. చాలా ప్రమాదకరంగానూ తయారుకాగలదు. అదృష్టవశాత్తు భద్రాచలం ప్రాంతంలో ఈ వ్యతిరేకత కాలక్రమంలో తగ్గింది. అందులో ఆదివాసీ సంఘాల పాత్ర గణనీయంగా ఉండడం చెప్పుకోదగ్గ విషయం. భద్రాచలం ప్రాంతంలోని ఆదివాసీ సంఘాల నాయకులంతా కోయలే అయినప్పటికీ తమ వారిలో గొత్తికోయల పట్ల ఉన్న అనుమానాలనూ వ్యతిరేకతనూ పోగొట్టడానికి వారు చేసిన కృషి హర్షణీయం. బహుశా ఈ జ్ఞాపకాల కారణంగానేమో మావోయిస్టు-సల్వాజుడుం వైరాన్ని గురించి బస్తర్‌లో చేయని వ్యాఖ్య భద్రాచలంలో చేస్తున్నారు.

ఒకటి మాత్రం నిజం. గొత్తి కోయలయినా కోయలయినా ఆదివాసులలో మిలిటెన్సీ ఎక్కువ. దానిని ఇరుపక్షాల నాయకులూ నిర్మొహమాటంగా వాడుకుంటున్నారు. తమ ప్రత్యర్థులుగా భావించిన వారిపైన మూకుమ్మడిగా దాడి చేయడానికి, గొర్రెలను నరికినట్టు నరకడానికి ఆదివాసులు వెనకాడరు. ఈ గుణాన్ని అటు సల్వాజుడుం నాయకులు, ఇటు మావోయిస్టు నాయకులూ కూడ ప్రోత్సహిస్తున్నారు, వాడుకుంటున్నారు. 'వాళ్లు చేస్తున్నారు కాబట్టి మేము చేయకతప్పదు' అని ఇద్దరూ అనొచ్చు. ఏమయితేనేం ఇది జరుగుతున్న మాట సత్యం. దీని ఫలితం ఆదివాసీ హననం. ఒక సంవత్సర కాలంలోనే ఒక్క దంతెవాడ

జిల్లాలోనే ఈ హత్యాకాండలో 500 ప్రాణాల దాకా పోయాయి. అందులో 95 శాతం స్థానిక ఆదివాసులే. విప్లవ సానుభూతిపరులు కావచ్చు, విప్లవ వ్యతిరేకులు కావచ్చు, సాదా కమ్యూనిస్టులు కావచ్చు, కాంగ్రెస్ అనుయాయులు కావచ్చు. అత్యధిక భాగం ఇవేవీ కాని అడవిబిడ్డలు కావచ్చు. మొత్తానికి అంతా ఆదివాసులే. వారి మిలిటెన్సీ వారి పేరు మీద సాగుతున్న ఘర్షణలో ఒక సాధనమై వారి ప్రాణం మీదికి తెచ్చింది.

భద్రాచలం ప్రాంత గ్రామాలలో ఈ ఆవేదన చాలా వినిపిస్తుంది. 'రెండు వైపులా ఉన్నది మావాళ్లే. చనిపోతే పలకరింపుకు పోదామన్నా భయంగా ఉంది. ఎవరైనా ఈ మారణకాండను ఆపండి. ఎట్లాగయినా ఆపండి' అని చింతూరుకు చెందిన ఆదివాసులు అంటున్నారు. రాజకీయాలు, సామాజిక భద్రత, విప్లవం అనేవి తప్ప మనుషులు కనిపించని వారికి ఈ ఆవేదన అర్థం కాకపోవచ్చు. కానీ ఇది చాలా విస్తృతంగా వినిపిస్తున్న ఆవేదన.

ప్రభుత్వాలు దీనిని వినిపించుకునే స్థితిలో లేవు. అమర్యాద అనుకుంటే అనుకోండిగానీ, మావోయిస్టు ఉద్యమం దేశానికి ప్రధాన ఆంతరంగిక ప్రమాదం అన్న బుద్ధి లేని వ్యాఖ్య దేశ ప్రధానమంత్రి స్వయంగా చేయడం పాలనా వైఖరిని సూచిస్తుంది. దానిని భద్రతా ప్రమాదంగా చూసిన తరువాత సైనిక చర్యలు తప్ప వేరే ఏ ఆలోచనలు రాగలవు ప్రభుత్వానికి? ప్రభుత్వ పారామిలిటరీకి తోడు సల్వాజుడుం పేరిట ప్రైవేట్ పారామిలటరీని కూడ తయారుచేసి మావోయిస్టులను 'ఎదుర్కొంటున్న' ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వ వ్యూహాన్ని దేశ ఆంతరంగిక భద్రతా వ్యూహకర్తలు ఆసక్తిగా చూస్తున్నారని వింటున్నాం. 'మీరు చెప్పే నీతులు ప్రభుత్వం వినదు కాబట్టి మేము కూడ వినము' అనే జవాబు ఆ పైన మావోయిస్టుల నుండి సులభంగానే వస్తుంది. ఈ పరిస్థితులలో సమీప భవిష్యత్తులో ఈ మారణకాండ ఆగుతుందని ఆశించగలమా?

*ప్రజాతంత్ర వారపత్రిక*

*23 జూలై 2006*

# నక్సలైట్ ఉద్యమం భవిష్యత్తే కాదు... ప్రజా ఉద్యమాల భవిష్యత్తు ఏమిటి?

నక్సలైట్ ఉద్యమం ఈ రోజు ఉన్నంత బలహీనంగా గతంలో ఎప్పుడూ లేకుండవచ్చు. 'ఎన్‌కౌంటర్ల' సంఖ్య దీనికి ప్రమాణం కాదు. ఈ మోతాదులో 'ఎన్‌కౌంటర్లు' గతంలోనూ జరిగాయి. అయితే పార్టీ నాయకులు, ప్రధాన శ్రేణి కార్యకర్తలు, ఈ రోజు చనిపోతున్నంత తరచుగా గతంలో ఎప్పుడూ చనిపోలేదు. ఈ రోజు దొరుకుతున్నంత సులభంగా వాళ్ల ఆచూకీ గతంలో తెలిసేది కాదు. ఎన్‌కౌంటర్ల పేరిట అన్నం పెట్టిన వాళ్లను, ఆశ్రయం ఇచ్చిన వాళ్లను పట్టుకుపోయి చంపుతున్నారు అని అభియోగం వేసిన రోజులుండేవి. పట్టుకుపోయి చంపుతుండడం ఇప్పటికీ నిజమేకానీ, అన్నం పెట్టిన వాళ్లను ఆశ్రయం ఇచ్చిన వాళ్లనూ కాదు, అసలయిన వాళ్లనే చంపుతున్నారు. ఒక్కొక్కసారి పట్టుకుపోయి చంపుతున్నారు. ఒక్కొక్కసారి చుట్టుముట్టి కాల్చి చంపుతున్నారు. ఆముదాలపల్లిలోనయితే వాళ్లు పండుకున్న ఇంటి కింద మందు పాతర పెట్టి పేల్చి చంపారు. అయినప్పటికీ నక్సలైట్ ఉద్యమ ముఖ్యశ్రేణులను, ఇతర సాయుధ కార్యకర్తలనే పోలీసులు ప్రధానంగా చంపుతున్నారు. 'ఎన్‌కౌంటర్లు' అన్నీ అప్పుడూ ఇప్పుడూ బూటకమే. కానీ ఇప్పుడు చనిపోతున్నది - ఒకటి రెండు మినహాయింపులతో - సాధారణ ప్రజలు కారు.

'నక్సలైట్ ఉద్యమం భవిష్యత్తు ఏమిటి?' అనే ప్రశ్న ఇప్పుడు చాలామంది వేస్తున్నారు. వాళ్ల రాజకీయాల పట్ల విభేదం ఉన్నవాళ్లు,

వ్యతిరేకత ఉన్నవాళ్లు సహితం ఈ ప్రశ్న కొంత ఆదుర్దాగానే వేస్తున్నారు. రాజకీయాల ఉచితానుచితాలు ఎట్లాగున్నా, నక్సలైట్లు సామాజికంగా ఉపయోగకరమైన పాత్ర నిర్వహించారని ఒప్పుకోవడానికి మన సమాజంలో చాలామంది - బహుశా మెజారిటీ - సిద్ధంగా ఉన్నారనుకుంటాను. ఆ పాత్ర నిర్వహించేవాళ్లు ఎవరూ లేకపోవడం సమాజానికి నష్టకరం అన్న అభిప్రాయం పైన చెప్పిన ఆదుర్దా వెనక ఉన్న కారణం.

పైగా, పాలక వర్గాల గురించి నక్సలైట్లు ఇచ్చిన చిత్రం గతంలో కంటే ఎక్కువ మందికి నమ్మదగ్గదిగా కనిపించే స్థితిని పాలకులే తీసుకొచ్చారు. ఏమరపాటులో పేదలకిచ్చిన ప్రభుత్వ భూములను ముప్పై ఏళ్లు అనుభవించేసానని ముఖ్యమంత్రే చిద్విలాసంతో ఒప్పేసుకునే పాలనను 'ఇది దొంగల రాజ్యం, దోపిడీ రాజ్యం' అని వర్ణించడం అతివాదం అనుకోవడానికి ఇంకా ఎంతమంది సిద్ధంగా ఉంటారు? 'భూములెప్పుడో పంచేసాం - ఇంకెక్కడి భూమి పోరాటం?' అని రెండేళ్ల నాడు దబాయించిన ప్రభుత్వం, పంచిన దానిలో 10 లక్షల ఎకరాలు అన్యాక్రాంతం అయిపోయాయని తెలిసీ తానేమీ చేయలేదని ఒప్పుకుంటుంటే భూమి పోరాటాలు శుష్కనినాదం అని ఇంకా ఎంతమంది అనుకోగలరు? పేదలకు రాయితీలిస్తే ఆర్థిక వ్యవస్థ కుప్పకూలిపోతుందని ఒకటిన్నర దశాబ్దంగా ఆర్థిక నీతి వల్లిస్తున్న పాలకులు ప్రత్యేక ఆర్థిక మండలులలో పెట్టుబడి పెట్టడానికి ముందుకొచ్చే కంపెనీలకు టోకున ఒక లక్ష కోట్ల రూపాయల పన్ను రాయితీ ఇవ్వడానికి సిద్ధపడుతుండడం చూసిన తరువాత పాలనా నీతి వర్గనీతి అన్న సూత్రీకరణను వాగాడంబరంగా భావించే వాళ్లు ఇంకా ఎంతమంది మిగులుతారు?

గ్రేహౌండ్స్ నక్సలైట్లను సమర్థంగా మట్టుబెడుతున్నారని మురిసిపోతున్న పాలకులు, తమ పాలనానీతి నక్సలిజాన్ని సజీవంగా ఉంచుతున్నదని గుర్తిస్తున్నట్టు లేరు. దీనికి సాధారణ ప్రజలు పెద్దగా చింతించకపోవచ్చు. ఎందుకంటే సాధారణ ప్రజలకు సంబంధించినంత వరకు హింస అనేది నక్సలిజంలో ఒకానొక అంశం మాత్రమే. అదే మొత్తం కాదు. కాబట్టి నక్సలిజం ఒక రాజకీయపంథాగా సజీవంగా ఉండడం పెద్దగా ఆందోళన చెందవలసిన విషయమూ కాదు.

ఈ పరిస్థితిని ఆసరా చేసుకొని నక్సలైట్ ఉద్యమం మళ్లీ బలం పుంజుకుంటుందా అన్న ఊహ చేయడంలో పెద్దగా అర్థం లేదు. నక్సలైట్ పార్టీలు తమ ప్రస్తుత పరిస్థితిని ఏ విధంగా అర్థం చేసుకుంటున్నారో తెలియకుండ అటువంటి ఊహలు చేస్తే ఒరిగేదేమీ లేదు. వాళ్లు ఎదుర్కొంటున్న సమస్య కేవలం గ్రేహౌండ్స్‌ను ఏ విధంగా తిప్పికొట్టాలన్నది కాదు. అంతకంటే పెద్ద సమస్యలే

ఎదుర్కొంటున్నారు. హింసకు ఆద్యులెవరన్న చర్చ ఎట్లాగున్నా, హింసా ప్రతిహింసల వలయం చాలా దూరం పోయిందనేది వాస్తవం. రెండు వైపులా చాలా ప్రాణాలు అనవసరంగా పోయాయన్నదీ వాస్తవం. ప్రజలు చాలా భయాన్నీ విధ్వంసాన్నీ చవిచూసారన్నది కూడ వాస్తవం. అయితే ఈ హింసా వలయం ప్రభావం అక్కడితో ఆగిపోలేదు. నక్సలైట్ పార్టీల అంతర్గత నిర్మాణం మీద కూడ అది పడింది. నైతికత నుండి పరస్పర విశ్వసనీయత దాకా అన్నిటి మీదా పడింది.

సిద్ధాంత రీత్యానూ తీవ్రమైన సమస్యలే ఉన్నాయి. 20వ శతాబ్దంలో ఒక వెల్లువగా ముందుకొచ్చిన రాడికల్ విప్లవాలు ఆ శతాబ్దం చివరికి ఆనవాలు లేకుండ పోవడానికి గల కారణాలను హేతుబద్ధంగా విశ్లేషించని కమ్యూనిస్టు పార్టీ ఏదీ కూడ తాను ప్రకటించుకున్న దీర్ఘకాలిక రాజకీయ లక్ష్యం వైపు ముందుకు పోతుందనీ పోగలదనీ నమ్మడం కష్టం. ఇది నక్సలైట్లకే కాదు, సి.పి.ఐ, సి.పి.ఐ (ఎం) వంటి పార్టీలకు కూడ వర్తిస్తుంది. వారెవ్వరి దగ్గరా ఆత్మ సంతృప్తి కోసం చెప్పుకునే జవాబులే తప్ప 1917-1989 మధ్యకాలం చరిత్ర గురించి మరొకరికి సంతృప్తి కలిగించగల విశ్లేషణ లేదు.

పోరాట పంథా ఎంతవరకు సమంజసమైనది అనేది కూడ సిద్ధాంత సంబంధమైన ప్రశ్నే. అప్పుడెప్పుడో చైనాలో సాధ్యమయింది శక్తివంతమైన భారతరాజ్యం ఎదుట సాధ్యమవుతుందా అన్న ప్రశ్న చాలామంది చాలాకాలంగా వేస్తున్నారు. పోలీసు, పారా మిలటరీ బలగాల శక్తి మాత్రమే కాదు, నీతి మాలిన యుక్తి కూడ భారత పాలకుల వద్ద దండిగా ఉంది. 'కోబ్రాల' వంటి నక్సలైట్ వ్యతిరేక ముఠాలకు నేరాలు చేసే స్వేచ్ఛ ఇవ్వడం దగ్గర మొదలుపెట్టి, ఛత్తీస్‌గఢ్‌లో ప్రజలనే రెండుగా చీల్చి సల్వాజుడుం పేరిట అంతర్యుద్ధం రగిల్చారు. ఇటువంటి రాజ్యం మీద సాయుధ పోరాటం చేయడం చావుల పట్టికను పెంచడమేనన్న అభిప్రాయాన్ని సీరియస్‌గా తీసుకోవలసిందే. దీనికి బాధ్యులెవరు అనేది ఈ ప్రశ్నకు జవాబు కాదు. బాధ్యులెవరైనప్పటికీ దీనిని కొనసాగించడంలోని రాజకీయ విజ్ఞత ఎంత అనేది జవాబు చెప్పవలసిన ప్రశ్న.

ఈ మాట అనేటప్పుడు ప్రత్యామ్నాయాలు ఏమంత ఆశాజనకంగా లేవని కూడ చెప్పుకోకపోతే నిజాయితీ అనిపించుకోదు. పార్లమెంటరీ రాజకీయాలలోకి దిగిన పార్టీలు అవినీతిని తప్పించుకున్నా అవకాశవాదాన్ని తప్పించుకోలేక పోతున్నాయి. లేదా అశక్తంగా ఉండిపోతున్నాయి. సి.పి.ఐ(ఎం) నుండి బహుజన సమాజ్ పార్టీ దాకా అన్ని ప్రత్యామ్నాయ రాజకీయ వేదికలకూ ఇది వర్తిస్తుంది. ఇక

నర్మదా బచావో ఆందోళన్ లాగ ప్రజా సమీకరణనే నమ్ముకున్న ఉద్యమాలు అవినీతికీ అవకాశవాదానికీ దూరంగా ఉన్నప్పటికీ ప్రభుత్వ విధానాల పైన ఒక మోతాదు మించి ప్రభావం వేయలేక పోతున్నాయి. ఏదో జరిగి ప్రజలు ఉవ్వెత్తున లేస్తారని అన్ని రాజకీయ పంథాల వాళ్లూ ఎదురు చూస్తున్నారు తప్ప ఎవరి దగ్గరా ఆచరణీయమైన పంథా లేదు.

అవసరం మాత్రం దండిగా ఉంది. నిజానికి నక్సలైట్ ఉద్యమం భవిష్యతేమిటి అనే చర్చ కంటే, రోజు రోజుకూ దిగజారుతున్న పరిస్థితులలో ప్రజలు అనుసరించగల సమర్థవంతమైన ఉద్యమ మార్గాలేమిటి అని చర్చించడం ఉపయోగకరంగా ఉంటుంది. దాని నుండే నక్సలైట్లకయినా, సంక్షోభంలో పడిన ఇతర ప్రజాతంత్ర రాజకీయ ఉద్యమాలకయినా తగిన సలహాలు దొరకగలవు. జీవితానికి మౌలిక వనరులయిన సాగుభూమి, నీళ్లు, అడవులు శరవేగంగా ప్రజలకు అందుబాట్లో లేకుండా పోతున్నాయి. వాటి మీద ప్రజలకు సంప్రదాయకంగా ఉండే హక్కులను గుర్తించే చట్టాలు ఎప్పుడూ అరకొరగానే ఉన్నాయి. ఆ అరకొర గుర్తింపుకు సహితం స్థానం లేకుండా పోయింది. పెద్ద మొత్తంలో పెట్టుబడి పెట్టి లాభాలు పిండగల వాళ్లకు ఈ వనరులపైన హక్కు కల్పించడమే 10 శాతం పెరుగుదల రేటుకు తగిన వ్యూహం అని మన పాలకులు ఏకగ్రీవంగా భావిస్తున్నారు. ఇది ఆయా ప్రాంతాలలో తీవ్ర ఘర్షణలకు దారి తీస్తున్నది. కళింగనగర్‌లో లాగ కాల్పులు జరిగి ప్రాణాలు పోయినప్పుడు వార్త అవుతున్నది గానీ ఎంత గట్టి పోరాటాలయినా ప్రభుత్వాన్ని తాత్కాలికంగా తప్ప ఆపలేకపోతున్నాయి.

ఈ సమస్య దేశమంతటా ఉంది గానీ ఖనిజసంపద అధికంగా ఉన్న మధ్య భారత అటవీ ప్రాంతంలో అత్యధికంగా ఉంది. ఎక్కువగా ఆదివాసులు నివసించే ఈ ప్రాంతంలో ఒరిస్సా, ఛత్తీస్‌గఢ్, జార్ఖండ్ రాష్ట్ర ప్రభుత్వాలు కలిసి 5 లక్షల కోట్ల రూపాయల పెట్టుబడులు పెట్టడానికి కావలసిన ఒప్పందాలు వివిధ బడా పెట్టుబడిదారీ కంపెనీలతో చేసుకున్నాయి. ఒరిస్సాలోని కళింగనగర్ పారిశ్రామిక ప్రాంతం దీనిలో ఒక క్షేత్రం మాత్రమే. ఆదిలోనే అక్కడ తీవ్ర ప్రతిఘటన ఎదురయి 11 ప్రాణాలు పోయాయి. ఆ తరువాత ఆదివాసీ సంఘాలు సుదీర్ఘమయిన రాస్తారోకో చేపట్టాయి. ఒరిస్సా ప్రభుత్వ ఆధునీకరణ ప్రయోగాలకు బలమైన సవాలే విసిరాయి. అయినప్పటికీ పాలక విధానాలకు బ్రేక్ పడలేదు. పెట్టుబడిదారీ కంపెనీలతో చేసుకుంటున్న ఒప్పందాల జోరు తగ్గలేదు. ఆ ఉద్యమాలు స్థానిక సంచలనంగా ఉండిపోయాయి.

నిజానికి ఈ ప్రాంతమంతా నక్సలైట్ ఉద్యమానికి - ప్రధానంగా మావోయిస్టులకు - చాలాకాలంగా బలం ఉన్నది. అయితే వారి విధానాలు, పోరాట పద్ధతులు సంప్రదాయ పెత్తందారీ ఆధిపత్యాన్ని బలహీనపరచడానికి ఉపయోగపడినంతగా పెట్టుబడి వ్యాప్తిని నిరోధించడానికి ఉపయోగపడవు. కాగా, తీవ్రమైన ప్రభుత్వ నిర్బంధం వల్ల కొంత, తమ స్వయంకృతాపరాధాల వల్ల కొంత వారి ప్రభావం ఈ మధ్య కాలంలో బాగా తగ్గిపోయింది.

ఈ స్థితి నుండి ప్రజలు బయటపడి సమర్థమైన ఉద్యమ మార్గాన్ని వెతుక్కునే లోపల ప్రభుత్వ నయా ఉదారవాదం తన పని ముగించేసుకుంటుందా? జీవన వనరుల బదలాయింపు పూర్తి అయిపోతుందా? ఆ తరువాత ఏం గతి?

*ఎక్కడ అచ్చయిందీ తెలీదు*
*అక్టోబర్ 2006 కావచ్చు*

# అధికారం, అహంకారం, అవకాశవాదం...

మార్చి 14న నందిగ్రాంలో జరిగిన కాల్పుల నేపథ్యంలో సి.పి.ఐ(ఎం) గురించి గతంలో అన్న మాటలే మళ్ళీ అనవలసి వస్తున్నది. ఆ పార్టీ అనుసరిస్తున్న రెండు నాల్కల వైఖరి మొత్తంగా ప్రజాతంత్ర ఉద్యమానికే నష్టం చేస్తున్నది. వాళ్ళ పరువు మాత్రమే పోతే అది వారి సమస్యే అనుకొని దులిపేసుకుందుము. కానీ అనేక విషయాలలో ఇతర ప్రజాతంత్ర ఉద్యమాలతో సి.పి.ఐ(ఎం) గొంతు, చేతులు కలిపి పని చేస్తుంటుంది. అయితే తనకు అధికారం ఉన్నచోట ఇతర పాలక పార్టీలలాగే ఆ పార్టీ వ్యవహరిస్తే, అది పంపే సంకేతం ఏమిటి? 'బాధ్యత' (అంటే అధికారం) లేనప్పుడు ఏమైనా మాట్లాడవచ్చును గానీ బాధ్యత అనే అధికారం ఉన్నప్పుడు ఎవరైనా చేసేది అదేననే కదా? ఈ సవాలే కదా పాలకపార్టీలు ప్రజాతంత్ర ఉద్యమాలకు విసురుతుంటాయి? మీరు అధికారం చేపట్టి చూడండి - మా కుర్చీలో కూర్చొని చూడండి - ఇంతకంటే భిన్నంగా నడుచుకుంటారేమో చూద్దామనే కదా వారనేది? అది నిజమేనని రుజువు చేసే పద్ధతిలో నడుచుకోవడం ప్రజాతంత్ర ఉద్యమానికి మొత్తంగానే నష్టకరం కాదా?

నందిగ్రాం కాల్పులకు కారణం అవకాశవాదులు (తృణమూల్ కాంగ్రెస్ అని చదువుకోండి), తీవ్రవాదులు (మావోయిస్టు పార్టీ అని చదువుకోండి), మతవాదులు (జమాతే ఇస్లామీ హింద్ అని చదువుకోండి)

ప్రజలలో లేని పోని భయాలు కల్పించి రెచ్చగొట్టడమేనని పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం అంటున్నది. అయితే ఎన్‌డిటివి వాళ్ళు పశ్చిమబెంగాల్‌లో కార్యక్రమాలు నిర్వహించే మావోయిస్టు పార్టీ జోనల్ కమిటీ బాధ్యుడిని ఇంటర్వ్యూ చేయగా, నందిగ్రాం ప్రాంతంలో తమకు కార్యకర్తలు గానీ ఉద్యమం గానీ లేదని అతను స్పష్టంగా చెప్పాడు. తమ పాత్ర అంటూ ఏమైనా ఉంటే మావోయిస్టులు కొంచెం ఎక్కువ చేసి చెప్పుకుంటారంటే నమ్ముతామేమోగాని తక్కువ చేసి చెప్పుకోవడం జరగదు కాబట్టి దీనిని నమ్మవచ్చు. ఇక మిగిలింది తృణమూల్ కాంగ్రెస్, జమాతె ఇస్లామీ. మమతా బెనర్జీ అజెండా కోసం వెతుకుతున్న రాజకీయ నిరుద్యోగి అనడంలో సందేహమేమీ లేదు. అందువల్ల అజెండా దొరికితే దానిని నిస్సంకోచంగా వాడుకుంటుంది. రెచ్చగొట్టి పెంచుతుంది. అయితే అధికార లక్ష్యం గల రాజకీయాలలో ఇది సర్వత్రా ఉండేదే కాబట్టి ఆమెను ప్రత్యేకించి తప్పు పట్టనక్కరలేదు. అధికారానికి దరిదాపులలో లేని రాష్ట్రాలలో - ఆంధ్రప్రదేశ్‌ను ఒక ఉదాహరణగా తీసుకోవచ్చు - సి.పి.ఐ(ఎం) కూడ ఇలానే చేస్తున్నదని ఎవరైనా అంటే ఏం సమాధానం చెప్తారు? ఇక జమాతె ఇస్లామీ గురించి పెద్దగా చెప్పుకోవలసిన అవసరం లేదు. నందిగ్రాంలో భూములు కోల్పోగల రైతులలో ముస్లింలు పెద్దసంఖ్యలో ఉండడం వల్ల వారు ఆందోళనలో భాగం అయినట్టున్నారే గానీ వామపక్ష ప్రభుత్వాన్ని కూలదోసి ఏదో సాధించాలన్న లక్ష్యం వాళ్ళకు లేదు.

నందిగ్రాంలో ప్రత్యేక ఆర్థిక మండలి నెలకొల్పే ఉద్దేశ్యం తమకు లేదని చెప్పినా కూడ ఆందోళనకారులు ప్రభుత్వ అధికారులను ఆ గ్రామాలకు రానీయకుండ భౌతిక ఆటంకాలు కల్పించారని సి.పి.ఐ(ఎం) నాయకులు అంటున్నారు. ఏదో ఒక రకంగా రాజకీయంగా బతికి ఉండాలన్న తృణమూల్ కాంగ్రెస్ ఆరాటమే తప్ప ఈ వ్యతిరేకతలో వేరే ఏమీ లేదని వారు అనదలచుకున్నారు. తృణమూల్ కాంగ్రెస్ సంగతి పక్కన పెడదాం. రైతాంగం ఈ హామీని సందేహించడం సహించరాని విషయం కాగలదా? అడ్డంకులు తొలగించుకోవడం కోసం అటువంటి హామీలు ఇస్తారుగానీ తొలగిపోయిన తరువాత కథ మళ్లీ మొదటికొస్తుందని వారు అనుమానించి ఉంటే మన దేశంలో ప్రభుత్వాల వ్యవహార శైలిని దృష్టిలో ఉంచుకున్నప్పుడు అది అహేతుకమైన వైఖరి అనిపించుకోగలదా?

అంతకంటే ముఖ్యమైన ప్రశ్న ఏమిటంటే, ప్రత్యేక ఆర్థిక మండలిని అక్కడ నెలకొల్పే ఉద్దేశ్యం లేనప్పుడు, పోలీసులను పెద్ద సంఖ్యలో దించి నందిగ్రాంను బలప్రయోగంతో విముక్తం చేయవలసిన అవసరం ఏమొచ్చింది? అక్కడున్నది

కొద్దిమంది అవకాశవాదులు, అతివాదులు కల్పించిన ఆటంకమేనని కొంచెంసేపు అనుకున్నా దానిని తొలగించడానికి తొందరేమొచ్చింది? హక్కుల ఉద్యమాలు, ప్రజాతంత్ర ఉద్యమాలు ఈ ప్రశ్నను చాలా సందర్భాలలో లేవదీసాయి. ఒక ఆందోళన, లేక ఉద్యమం ఎంత మూర్ఖంగా లేదా ఎంత అహేతుకంగా ఉందని ప్రభుత్వానికి అనిపించినా అందులో సాధారణ ప్రజలు పెద్దసంఖ్యలో భాగస్వాములయినప్పుడు బలప్రయోగంతో దాని మెడలు వంచే ప్రయత్నం సామాన్య పౌరుల ప్రాణాలు తీయగలదు కాబట్టి ఓపికగా వ్యవహరించడమే సరైన మార్గం అని ఇప్పటికి వంద సందర్భాలలో వంద సార్లు అని ఉంటాం. ప్రజల వల్ల వచ్చిన రాజకీయ పలుకుబడి, చట్టం ఇచ్చిన అధికారం అన్నీ ఉండి, ఇవేవీ లేనివాళ్లు పాలనకు అడ్డుపడుతుంటే నిస్సహాయంగా చూస్తూ ఉండిపోవాలా అన్న ఉక్రోషం తగదని చెప్పి ఉన్నాం. ఈ అభిప్రాయంతో సి.పి.ఐ(ఎం) వేరే సందర్భాలలో ఏకీభవించి ఉంది. తనదాకా వచ్చేసరికి మరిచిపోయేటట్లయితే అది నిజమయిన ఏకీభావం అనుకోగలమా?

వాస్తవమేమిటంటే తమకు ఇష్టం లేని ఆందోళనల పట్ల, తమను వ్యతిరేకించే ఆందోళనల పట్ల ప్రజాస్వామికంగా వ్యవహరించాలన్న స్పృహ సి.పి.ఐ(ఎం)కే కాదు, ఏ కమ్యూనిస్టు పార్టీకీ సూత్రబద్ధమైన అవగాహన కాదు. అవసరం కొద్దీ ప్రజాస్వామ్య సూత్రాలను సార్వజనీన సూత్రాలుగా ప్రస్తావించడం కమ్యూనిస్టు పార్టీలు నేర్చుకున్నాయి గానీ వారి సిద్ధాంత అవగాహన అది కాదు. అందులో మార్పేమీ రాలేదు. నందిగ్రాం జరిగిన కొన్ని గంటల వ్యవధిలోనే - మార్చి 14,1 5 మధ్య రాత్రి - ఛత్తీస్‌గఢ్‌లోని రాణిబొదిలిలో మావోయిస్టులు జరిపిన మారణకాండ ఇంకొక సందర్భంలో ఇదే వాస్తవానికి నిదర్శనం. సల్వాజుడుం మావోయిస్టుల అనుయాయులయిన సాధారణ ఆదివాసులపైన అతిక్రూరమైన హింస, అణచివేత ప్రయోగించిన మాట వాస్తవమే. ప్రత్యేకించి, ఆ రాష్ట్ర ప్రభుత్వం తుపాకులిచ్చి 'స్పెషల్ పోలీస్ అధికారి' అని నామకరణం చేసిన సాయుధ సల్వాజుడుం కార్యకర్తలు నిరాయుధ పౌరుల పట్ల యమభటులన్నదీ వాస్తవమే. అయినప్పటికీ సల్వాజుడుం నాయకత్వానికీ కార్యకర్తలకూ తేడా చూడకుండ, సాధారణ సల్వాజుడుం కార్యకర్తలు (గుంపులో భాగంగా ఎంత క్రూరంగా వ్యవహరించినప్పటికీ) తమ అనుచరులంత దుర్బలులేననీ, తమకు సహితం పాత్ర ఉన్న పరిణామాల క్రమం వారిని అటువైపు నిలబెట్టిందనీ గుర్తించకుండ మూకుమ్మడి ప్రతీకారానికి పాల్పడడం మావోయిస్టుల విధానం అయింది. దర్భగూడ, మణికొంట, ఇంజరం, ఎర్రబోరు, ఇప్పుడు రాణిబొదిలి ఘటనలలో

100 మందికి పైగా ఇటువంటి వాళ్ళను మావోయిస్టులు తుపాకులతో కాల్చి, మందుపాతరలు పెట్టి పేల్చి, గొంతులు కోసి చంపారు. ఇది విచక్షణ కోల్పోయిన, రాజకీయ విశ్లేషణ కొరవడిన ప్రతీకారం తప్ప విజ్ఞత గల రాజకీయ చర్య కాదు.

నందిగ్రాంకు తిరిగివద్దాం. మమత బెనర్జీ ఆరాటాన్ని (అది వట్టి అవకాశవాదమేనని సి.పి.ఐ(ఎం) నిందించినప్పటికీ) అర్థం చేసుకోవచ్చు కానీ అర్థరహితమైనది బి.జె.పి, కాంగ్రెస్ పార్టీల ఆందోళన. గుజరాత్ నుండి ఆంధ్రప్రదేశ్ దాకా వారి ప్రభుత్వాలు వేల ఎకరాల ఎస్ఇజడ్‌లకు భూసేకరణ చేస్తున్నాయి. కొంత బలప్రయోగంతో, ఎక్కువ భాగం కుతంత్రంతో రైతుల భూములు స్వాధీనం చేసుకుంటున్నాయి. కుతంత్రం తగినంత చేతకాకనో, సందర్భం అనుకూలించకనో బలప్రయోగాన్నే నూరుశాతం ఆశ్రయించిన సి.పి.ఐ (ఎం) పట్ల తామెవ్వరూ చేయని పని ఏదో చేసినట్టు వారు నటించడం వెగటు పుట్టించే చర్య.

ఎస్ఇజడ్‌ల భూసేకరణకు ఒక చారిత్రక ప్రత్యేకత ఉంది. ఇప్పటివరకు మూకుమ్మడి భూసేకరణ నీటిపారుదల ప్రాజెక్టుల కోసమే ఎక్కువ జరిగింది. అవి ప్రధానంగా ఆదివాసీ ప్రాంతాలలో ఉన్నాయి. అందువల్ల ప్రధానంగా నిర్వాసితులయింది ఆదివాసులే. ఆదివాసులు దేశ జనాభాలో కేవలం 8 శాతం కాగా, ప్రాజెక్టుల కింద నిర్వాసితులయిన వారిలో 40 శాతం పైగా వారేనన్నది ఎవ్వరూ కాదనడానికి సాహసం చేయని వాస్తవం. ఆదివాసులు సంఘటితమైతే గట్టిపోరాటమే చేయగలరు గానీ వారు సంఘటితం కావడానికి అనేక ఆటంకాలున్నాయి.

ఇప్పుడు మొట్టమొదటిసారిగా మైదాన ప్రాంతాలలో పెద్దెత్తున మూకుమ్మడి భూసేకరణ జరుపుతున్నారు. ఒకే దగ్గర అనేక గ్రామాలను మొత్తంగానే ఖాళీ చేయిస్తున్నారు. వర్గాలుగా, కులాలుగా, రాజకీయ పార్టీలుగా విడిపోయిన గ్రామాలలో చాణక్యం ప్రదర్శించి ఈ భూసేకరణ సాగించుకోగలరుగానీ ఏ కారణంగానయినా గ్రామస్తులంతా ఒకటైతే - వీరు ఆదివాసులలాగ సామాజికంగా ఆర్థికంగా దుర్బలులు కారు, రాజకీయంగా ఒంటరి కారు - అది పెద్ద ప్రతిఘటనకు దారి తీయగలదు, రక్తపాతం జరగగలదు. నందిగ్రాం దీనికి మొదటి ఉదాహరణే తప్ప కేవలం బెంగాల్‌లో మాత్రమే జరగగల ఘటన కాదని బి.జె.పి, కాంగ్రెస్‌లు గుర్తించినట్టయితే అవకాశవాదపు ఆందోళన విడిచిపెట్టి ఎస్ఇజడ్‌ల గురించి కొంతయినా పునరాలోచన చేయడం సాధ్యమవుతుందేమో.

*ప్రజాతంత్ర వారపత్రిక*

*18 మార్చి 2007*

# శ్రీకాకుళ ఉద్యమం: భవిష్యత్‌పై చర్చను రేకెత్తించింది

విప్లవ పోరాటాల ఫలితాల గురించి విప్లవకారులను అడిగితే రాజకీయ కోణం నుండి జవాబు వెతుకుతారు. ఆ పోరాటం అనుసరించిన వ్యూహం ఫలవంతమైనదా, విప్లవ లక్ష్యాన్ని అది ముందుకు తీసుకుపోయిందా ఇత్యాది ప్రశ్నలు వేసుకుంటారు.

ఈ ప్రశ్నకు జవాబు వేరే కోణం నుండి కూడ చెప్పుకోవచ్చు. పోరాటాలను అణచడానికి ఎంత అవసరమో అంత బలప్రయోగం చేసిన ప్రభుత్వం ఆ పోరాటాలు తిరిగి బలం పుంజుకోకుండా ఉండడానికి ప్రవేశపెట్టే సంస్కరణలు; ఇక పెత్తనం సాగదని గుర్తించిన పెత్తందారీ వర్గాలు అనుసరించే కొత్త పోకడలు; ప్రజలకు ఏడవడమే కాదు తిరగబడడమూ చేతనవునని గుర్తించాక సమాజం అలవరచుకునే ఆదర భావము; ఇవన్నీ ప్రజల జీవితంపైన ప్రభావం వేసే ఫలితాలే.

గ్రామీణ పేద ప్రజలకు సంబంధించి మన రాష్ట్రంలో ప్రభుత్వం చేపట్టిన అనేక సంస్కరణలు 1970లలో వచ్చాయి. వాటిలో ఆదివాసులకు సంబంధించినవి ప్రత్యక్షంగా శ్రీకాకుళ పోరాటం నుండి పుట్టినవి కాగా తక్కినవి చాలావరకు నక్సలైట్ ఉద్యమాన్ని రాజకీయంగా ఎదుర్కొనడానికి చేపట్టినవి. మన దేశంలో మొదటి విడత భూగరిష్ట పరిమితి (సీలింగ్) చట్టాలను వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు 1950లలో చేయగా, సీలింగ్ తగ్గించిన రెండవ విడత చట్టాలను నక్సలైట్ ఉద్యమం ఫలితంగానే చేపట్టామని కాంగ్రెస్ నాయకులు

స్వయంగా ఒప్పుకున్నారు. అది తన ముందుచూపు ఫలితమేనని పి.వి. నరసింహారావు గర్వంగా కూడ చెప్పుకున్నారు. పేదలకు భూములు పంచకపోతే హరిత విప్లవం ఎర్రబడే ప్రమాదం ఉందని గుర్తించినట్టు కూడ వారు చెప్పుకున్నారు.

శ్రీకాకుళ పోరాటం ఆదివాసీ పోరాటం కావడం వల్ల ఆదివాసీ ప్రజల మేలుకోసం ప్రభుత్వం ప్రత్యేకంగా కొన్ని సంస్కరణలు చేపట్టక తప్పలేదు. ఆదివాసులు తమకు వరంగా భావించే 'వన్ ఆఫ్ సెవెన్టీ' (1/70) రెగ్యులేషన్ దీనిలో ముఖ్యమైనది. అంతకు ముందు కూడ ఆదివాసీ భూములను గిరిజనేతరులు కొనుగోలు చేయడాన్ని నియంత్రించే చట్టం ఉండింది. అయితే అది బలహీనంగా ఉండింది. కలెక్టర్ (ఏజెంట్) అనుమతితో కొనుగోలు చేసే అవకాశం ఉండింది. 'వన్ ఆఫ్ సెవెన్టీ' దానిని తొలగించడమే కాక మరికొన్ని కీలకమైన మార్పులు కూడ తెచ్చింది. అప్పటికే ఏజెన్సీలో గిరిజనేతరులు చాలా భూమి ఆక్రమించుకున్నారు కాబట్టి ఇక వాళ్ళు భూమిని పొందలేకుండా చేసిందది. గిరిజనేతరులు గిరిజనుల నుండే కాదు, గిరిజనేతరుల నుండీ, ప్రభుత్వం నుండీ కూడ భూమి పొందడానికి వీలు లేకుండా చేసిందది. భూమి బదలాయింపుపై విచారణలు అంతకుముందు కూడ అప్పుడప్పుడు జరిగాయి గానీ 1970 తరువాతే పెద్ద సంఖ్యలో కేసులు చేపట్టడం జరిగింది. అధిక భాగం కేసులు గిరిజనేతరులకు అనుకూలంగా ముగిసినప్పటికీ 1 లక్ష 30 వేల ఎకరాల దాకా గిరిజనేతరుల నుండి ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడం జరిగింది.

ఐటిడిఏ ఏర్పాటు కూడ శ్రీకాకుళ పోరాటం ఫలితమే. ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే కాదు, 'ఏజెన్సీ' ఉన్న అన్ని రాష్ట్రాలలోనూ ఐటిడిఏలు ఏర్పాటయ్యాయి. పాలనా యంత్రాంగానికి సహజమైపోయిన అవినీతి వల్ల ఆశించినంత ఫలితం రాకపోయినప్పటికీ విద్య, వ్యవసాయం, స్వయం ఉపాధి పథకాలు మొదలయిన రంగాల్లో ఐటిడిఏ వల్ల మేలు జరిగిందనే చెప్పుకోవచ్చు. మన రాష్ట్రంలోనైతే ఏజెన్సీ ప్రాంతంలో పాలన యావత్తు ఐటిడిఏ ద్వారా జరుగుతుండడం వల్ల సమస్యలు చెప్పుకోవడానికీ, ఫిర్యాదులు చేయడానికీ పాలన అందుబాట్లోకి వచ్చినట్లయింది.

సమాజం విషయానికొస్తే ఆదివాసుల పట్ల చులకన భావం, ఏం చేసినా చెల్లుతుందనే అహంకారం ఇతర వర్గాలలో తగ్గాయనే చెప్పుకోవచ్చు. శ్రీకాకుళ పోరాటంతో ఆదివాసీ ప్రాంతాలలో ప్రారంభమైన పోరాటాలు ఆదివాసీ యువతకు బయటి ప్రపంచపు తలుపులు తెరిచాయి. విప్లవం చూపించిన ప్రపంచమే కాక ఇంకా చాలా వారి అనుభవంలోకి వచ్చింది. మేల్కొలిపిన వారు ఉద్దేశించిన దాన్ని

మించిన మేల్కొలుపు వచ్చింది. తాము ఏమిటి, తమ భవిత ఏమిటి అన్న చర్చ వారిలో మొదలయింది. ఆ చర్చ విప్లవకారులు ఉద్దేశించిన దిశలో సాగకున్నా సరే ఆదివాసులకయితే చాలా మేలు చేస్తుంది. పోరాటాల ఫలితంగా వచ్చిన సంస్కరణలలో భాగంగా, ఏజెన్సీ విద్యాలయాలలోని అధ్యాపక పదవులు నూటికి నూరు శాతం ఆదివాసులకే రిజర్వ్ కావడం వల్ల ఒక ఆదివాసీ మేధావి వర్గం ఏర్పడింది. ఆ వర్గం ఆదివాసీ ప్రజల భవిష్యత్తుకు సంబంధించిన చర్చలో నిర్ణాయక పాత్ర వహించడం ఇప్పటికే మొదలైంది.

*ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం*
*28 అక్టోబర్ 2007*

*'సిక్కోలు నెగళ్ళకు నలభయ్యేళ్ళు' శీర్షికతో వచ్చిన కవర్‌స్టోరీలో భాగం.*

# నక్సలైట్ ఉద్యమం

నక్సలైట్ ఉద్యమానికి సామాజిక, ఆర్థిక నేపథ్యం ఉందని అంటూ ఉంటాం. నేపథ్యం ఉన్నమాట వాస్తవమే కానీ ఆ నేపథ్యం నుంచే నేరుగా ఆ ఉద్యమం పుట్టలేదు. సామాజిక, ఆర్థిక నేపథ్యం ఒక సందర్భం. దానితో పాటు రాజకీయ నిర్ణయం కూడ ఒక సందర్భం. భారతదేశంలో కమ్యూనిస్టు విప్లవం లేదా సోషలిస్టు పరిపాలన, సోషలిస్టు సమాజం అనేవి పార్లమెంటరీ పంథా ద్వారా రావు, వాటి కోసం ప్రత్యక్షంగానే సాయుధపోరాటం అవసరం అనే నిర్ణయం తీసుకోకపోతే నక్సలిజం వచ్చేది కాదు. కానీ ఆ నిర్ణయమే దానికి కారణం కాదు. అది రాజకీయ నిర్ణయం. ఒక సామాజిక సందర్భం కూడ ఉండింది. పశ్చిమ బెంగాల్, బీహార్‌ల విషయం అలా ఉంచితే ఆంధ్రప్రదేశ్‌కు వచ్చేటప్పటికి రెండు ప్రధానమైన సందర్భాలున్నాయి.

ఒకటి, ఆదివాసీ ప్రాంతాలలో ఉన్న పరిస్థితులు. రెండవది తెలంగాణ మైదాన ప్రాంతాలలో ఇవ్వాళ మనం ఊహించలేనటువంటి తీవ్రమైన ఫ్యూడల్ దోపిడి, కులపెత్తనం. రెండో మూడో కులాల వాళ్ళు ఆర్థికంగా, రాజకీయంగా మాత్రమే కాకుండా, సామాజికంగా కూడ సంపూర్ణంగా ప్రజల శ్రమను, వాళ్ళ ఆత్మగౌరవాన్ని తమ గుప్పిట్లో పెట్టుకున్న పరిస్థితి. ఈ రెండూ ఉండేవి.

ఆదివాసీ ప్రాంతాల మాటకొస్తే ఇవ్వాళ మనం ఆదివాసుల హక్కుల గురించి ప్రధానంగా మాట్లాడుకుంటున్న విషయాలేవీ ఆ

రోజుల్లో లేవు. నిజానికి అవన్నీ కూడ శ్రీకాకుళ పోరాటం ఫలితమే. శ్రీకాకుళ పోరాటం వల్ల వచ్చినటువంటి ప్రత్యక్ష ప్రయోజనం ఏమిటీ అంటే 1/70 చట్టం, ఐటిడిఏ లాంటి వ్యవస్థల ఏర్పాటు, గిరిజన సహకార కార్పొరేషన్లు పటిష్టం కావడం. వాటికోసం నక్సలైట్లు పోరాటం చెయ్యలేదు కానీ వాళ్ళ పోరాట ఫలితాలే అవి. అంతకు ముందు ఆదివాసులకు చట్టపరమైనటువంటి రక్షణగాని, హక్కులుగాని చాలా తక్కువగా ఉండేవి, నామమాత్రంగానే ఉండేవి. అవి కూడ అమలయ్యేవి కావు.

తెలంగాణ విషయానికొస్తే ముఖ్యంగా రెండు మూడు కులాల - వెలమ, రెడ్డి, బ్రాహ్మణ - ఆధిపత్యం సంపూర్ణంగా ఉండేది. తక్కువ కూలి ఇవ్వడమనేదే కాదు, అన్ని రకాల శ్రమ దోపిడీ - మామూలుగా ఫ్యూడల్ అనే మాట వాడతాం మనం - చాలా విస్తృతంగా ఉండేది. తెలంగాణ మైదాన ప్రాంతాలలో నక్సలైట్ ఉద్యమం ప్రధానమైన ఫలితం ఈ సామాజిక సంబంధాలను తల్లక్రిందులు చెయ్యడం. 25 - 30 సంవత్సరాల కింద తెలంగాణను చూసినటువంటి వాళ్ళు, అక్కడ బ్రతికినటువంటి వాళ్ళు ఈ మార్పును స్పష్టంగా గుర్తించగలరు. సామాజిక సంబంధాలలో వచ్చిన మార్పు వల్ల నోరులేని వాళ్ళు నోరున్నవాళ్ళయ్యారు. మాకు చాలా నోరుంది అనుకున్న వాళ్ళు గ్రామాలే విడిచిపెట్టి వెళ్ళిపోయే పరిస్థితి వచ్చింది. నా దృష్టిలో నక్సలైట్లు సాధించిన ఈ సామాజిక విజయం చిరస్థాయిగా నిలిచిపోయేటటువంటి కంట్రిబ్యూషన్. నోరులేని ప్రజానీకానికి ఆత్మగౌరవాన్ని, నోరును ఇచ్చారు.

అయితే వారి వల్ల ఆర్థిక ప్రయోజనం ఎంతొచ్చిందో చెప్పలేము. ఎందుకంటే తమ పోరాటం ప్రధానంగా భూమి కోసం అని నక్సలైట్లు భావించినప్పటికీ, ఏజెన్సీ ప్రాంతాలలో, అంటే ఆదివాసీ ప్రాంతాలలో వాళ్లు ఆదివాసీయేతరుల నుంచి భూములు పెద్దగా లాక్కోలేకపోయారు. కాని ప్రభుత్వ ఆధీనంలోని అటవీ భూములను మట్టుకు చాలా పెద్దఎత్తునే ఆదివాసులకు ఆనాడు వాళ్ళు పంచగలిగేరు. అడవి కొట్టుకొని ఆదివాసులు ఆ భూముల్లో వ్యవసాయం చేసుకున్నారు. అందుకు చాలా నిర్బంధం కూడ అనుభవించారు. పదే పదే అటవీ శాఖవాళ్ళు, పోలీసులు వాళ్ళమీద పడడం, కొట్టడం, తన్నడం, ఇళ్ళు కాలబెట్టడం, కేసులు పెట్టడం జరుగుతూనే ఉండింది. ఇవ్వాళ కొత్తగా వచ్చినటువంటి అటవీహక్కుల చట్టం ఫలితంగా నక్సలైట్ ఉద్యమం ద్వారా సాధించుకున్నటువంటి ఆ అడవి భూమికి ఆదివాసులు బహుశా పట్టా పొందగలరు. అందరూ కాకపోయినా

కొంతమందయినా పొందుతారు. ఆ రకంగా అదొక విజయంగా - చట్టపరమయిన విజయంగా - కూడ చెప్పుకోవచ్చు, ఉద్యమం నడిపిన వాళ్ళ ఉద్దేశ్యం అది కాకపోయినప్పటికీ.

మైదాన ప్రాంతాలలో మాత్రం భూమి పోరాటం పెద్దగా జరిగిందని చెప్పలేము. ఎంతమేరకయితే సాధ్యం అవుతుందనో, సాధ్యం కావాలని వాళ్ళు భావించారో దాంట్లో ఒక చిన్న నిష్పత్తి మాత్రమే వాస్తవానికి సాధ్యమయ్యింది. అది కూడ భూస్వాములు ఆ భూములు విడిచిపెట్టి వెళ్ళిపోవడం వల్ల మాత్రమే జరిగింది. అయితే దానిని పేద ప్రజానీకానికి పంచడం గానీ, వాళ్లు దానిని నిలబెట్టుకోవడం గానీ జరగలేదు. నిజానికి పేదలకు భూపంపకం నక్సలైట్ల ద్వారా జరగకూడదనుకుంటే ప్రభుత్వం తన ద్వారా చేసి ఉండవచ్చును... తనే పట్టాలిచ్చి ఉండవచ్చును... సీలింగ్ చట్టాలు సక్రమంగా అమలుచేసి ఆ భూమిని తానే పేదలకు పంచి ఉండవచ్చు. కాని ఆ పని చేస్తే నక్సలైట్లకు విజయం అవుతుంది అనేటటువంటి ఒక తప్పుడు భావనతో చేయలేదు. ఆ భూములంతా కూడ బీడుపెట్టే పరిస్థితి కల్పించింది. ఇవ్వాళ్టికీ కొన్ని వేల ఎకరాలు బీడుపడే ఉన్నాయి తెలంగాణ జిల్లాలలో. కాబట్టి పేదలకు భూమి చాలా వచ్చిందని చెప్పలేము. భూస్వాముల భూములు గానీ, ప్రభుత్వ భూములు గానీ వారు కొంతమేరకు మాత్రమే ఆక్రమించుకోగలిగారు.

నక్సలైట్ల వల్ల కూలి రేట్లు, తునికాకు రేట్లు కొంత పెరిగాయి గానీ, బహుశా అవి ఇతరత్రా కూడ పెరిగి ఉండేవేమో! ప్రధానమైన విజయం మాత్రం స్వాభావికంగా కొందరు ఎక్కువ, కొందరు తక్కువ అనేటటువంటి ఫ్యూడల్ భావజాలాన్ని తల్లక్రిందులు చేయడం. మాల, మాదిగ, బి.సి. కులాలు, ఆదివాసీ ప్రజానీకం అందరూ మేమూ మనుషులమే, అందరం సమానులమే, మేమూ నిర్ణయాలు చేస్తాము, ఏది మంచో ఏది చెడో చెబుతాము అని చెప్పగల ఆత్మధైర్యాన్ని ఆ ఉద్యమం ఇవ్వగలిగింది. అది చాలా పాజిటివ్ కంట్రిబ్యూషన్.

ఎటొచ్చీ ఇదంతా కూడ ఒక రాజకీయ వ్యూహంలో అంతర్భాగంగా జరిగింది. అలా జరగకూడదని కాదుగానీ, జరిగిన మాట వాస్తవం. జరగొచ్చా, జరగకూడదా అనేది ఇక్కడ విషయం కాదు. జరిగింది. ఆ వ్యూహం ఏమిటీ అనంటే ఇటువంటి చిన్న చిన్న మార్పులు చేసుకుంటూపోతే సమాజం మారుతుందా అంటే మారదు. ఈ మార్పులన్నీ భారతరాజ్యానికి వ్యతిరేకంగా ఒక సాయుధ పోరాటాన్ని నిర్మించే, దానిని కూలదోసి ప్రజారాజ్యాన్ని నిర్మించే క్రమంలో భాగమే అన్న మావోయిస్టుల

- ఇవ్వాళ మావోయిస్టులంటున్నాం వాళ్ళను, ఆ రోజులలో నక్సలైట్ పార్టీలనేది ఎం.ఎల్ పార్టీలనేది - అవగాహనలో అంతర్భాగంగా జరిగాయి. దాని వల్లే వాళ్ళు హింసను ప్రయోగించడం, సందర్భానికి అవసరమయిన దానికి మించి కూడ ప్రయోగించడం జరిగింది. ఎందుకంటే వారికి ఒక రాజకీయ లక్ష్యం దానికి అనుబంధంగా ఉంది కాబట్టి.

ప్రభుత్వం కూడ దీనిని కేవలం పేదల పోరాటంగా చూడలేదు. దాని వెనకున్నటువంటి రాజకీయ పోరాటాన్ని లక్ష్యంగా పెట్టుకొనే చాలా తీవ్రమైన అణచివేతను ప్రయోగించింది. నిజానికి నక్సలైట్లు ఇంకా పెద్దగా హింస చేయడం మొదలుపెట్టక ముందే ఆ పని చేసింది. అది కూడ వాళ్ళు ప్రధానంగా రైతు కూలీ సంఘాలు, గిరిజన సంఘాల ద్వారా పనిచేస్తున్న కాలంలోనే. మహా అయితే ఎప్పుడైనా ఒక నాటుబాంబు తప్ప వాళ్లు అప్పటికి వేరే ఆయుధాలు ప్రయోగించే వాళ్ళు కాదు. అయినా అప్పటి పరిస్థితులతో ఏమీ సంబంధం లేనటువంటి నిర్బంధాన్ని ప్రయోగించారు. గ్రామాల్లో పోలీసు క్యాంపులు పెట్టి, విపరీతంగా చిత్రహింసలు పెట్టి, కూలిరేట్లు పెంచమని అడిగినవాళ్ళను, భూములు పంచమని అడిగిన వాళ్ళను, దొరల పెత్తనాన్ని వ్యతిరేకించిన వాళ్ళను చాలా హింసించారు. వరంగల్‌లో మేము ఆ రోజులలో వీటిని ప్రత్యక్షంగా చూసాము. వరంగల్, కరీంనగర్‌లలో ఎవరైనా 'ఏమిటి ఇంత నిర్బంధం? ఎందుకు?' అని అడిగితే ప్రభుత్వం దగ్గర జవాబేమీ లేదు గానీ, ఒక దీర్ఘకాల రాజకీయ లక్ష్యం వారి నిర్బంధం వెనకాలుండింది. నక్సలైట్ ఉద్యమం బలపడకూడదు. దీర్ఘకాలంలో ప్రభుత్వ పరిపాలనా భద్రతకు అది భంగకరం అవుతుంది, నష్టకరం అవుతుంది, హాని చేస్తుంది అనే ఉద్దేశ్యంతో చేశారు. చాలా దూరం వెళ్ళిందది.

అక్కడ మొదలయి - అంటే ప్రజలలో పనిచేస్తూ, ప్రజా సంఘాల ద్వారా పనిచేస్తూ, ఆదివాసీ ప్రాంతాలలోనయినా, వరంగల్, కరీంనగర్, నిజామాబాద్, మెదక్‌లాంటి జిల్లాల మైదాన ప్రాంతాలలోనయినా వారు ప్రజలకు మానసిక బలాన్నీ, సామాజిక సమానతనూ, కొంతమేరకు ఆర్థిక ప్రయోజనాలనూ ఇస్తున్నటువంటి సమయంలో చాలా తీవ్రమైనటువంటి అణచివేతను ప్రభుత్వం ప్రయోగించడంతో బహుశా ఒక నిర్ణయం - దానిని ఏ రకంగా ఎదుర్కోవాలనే నిర్ణయం వాళ్ళు చేశారు. అది చాలా కీలకం. బలప్రయోగంతో తిప్పికొట్టాలి, దెబ్బను దెబ్బతో తిప్పి కొట్టాలి అనే నిర్ణయం తీసుకోవడం, ఆ నిర్ణయాన్ని అమలు చేయడం జరిగింది. దానితో క్రమంగా వారి ఆయుధ సంపత్తి పెరగడమూ, మరిన్ని

ఆయుధాలను వాళ్ళు ప్రయోగించడమూ జరిగింది. ప్రభుత్వం కనీసం అప్పటికైనా 'నేను తప్పు చేశాను, నేను చేసిన తప్పు వల్ల వాళ్ళు తిరిగి దాడులు మొదలు పెడుతున్నారు, ఇది ప్రాణానికి, జీవితాలకి హాని కలిగిస్తుంది కాబట్టి వెనక్కి తగ్గుదాం' అనుకోలేదు. నిర్బంధాన్ని మరింత పెంచింది. యాంటీ నక్సలైట్ స్క్వాడ్లు ఏర్పాటు చేసింది. మామూలుగా మస్కట్‌లు మాత్రమే ఉండే పోలీసుస్టేషన్‌లలో క్రమంగా సెల్ఫ్ లోడింగ్ రైఫిల్స్, ఇంకొంత కాలం తరువాత ఎ.కె-47లు వచ్చాయి. వాళ్ళూ అటువంటి ఆయుధాల్నే సంపాదించుకున్నారు. అంటే ప్రభుత్వ అణచివేతను ఇక్కడ ప్రారంభంగా చెప్పుకోవచ్చునేమోగానీ, ఆ అణచివేతను ఎదుర్కోవడానికి వాళ్ళు ఎంచుకున్న మార్గం, దానిని ఎదుర్కోవడానికి ప్రభుత్వం ఎంచుకున్న మార్గం, తిరిగి వాళ్ళు ఎంచుకున్న మార్గం... ఇదొక వలయాన్ని తయారు చేసి చాలా దూరం తీసుకుపోయింది.

ఇవ్వాళ నక్సలైట్ ఉద్యమం - తాత్కాలికంగానే కావచ్చు - ఇంతగా ఎప్పుడూ గతంలో దెబ్బతినలేదు. కానీ అంతమాత్రంతో అయిపోయిందని కూడ ఏమీ కాదు. ఎందుకంటే ఒకప్పటి పరిస్థితి ఏమోగానీ, గత పదిహేను పదహారు సంవత్సరాలుగా ప్రభుత్వాలు అనుసరిస్తున్నటువంటి విధానాలు ఎట్లా ఉన్నాయంటే - మాకు బాగా జ్ఞాపకం... మొదట్లో మేము ఎన్‌కౌంటర్లు, చిత్రహింసలు తప్పు అన్నప్పుడు వాళ్ళు హింస చేసినప్పుడు ప్రభుత్వం ఎందుకు చేయకూడదు అని గట్టిగా వాదన పెట్టుకున్న వర్గాలు కూడ ఇవ్వాళ, ప్రభుత్వాల విధానాలు ఈ విధంగా ఉంటే చెయ్యక ఏంజేస్తారు అనేటటువంటి ఒక మూడ్‌లోకి వస్తున్నారు. గత 30 సంవత్సరాలతో పోలిస్తే ఇవ్వాళ ప్రభుత్వ దుష్పరిపాలనను హింసాత్మకంగా ఎదుర్కోవడం అనే విషయంలో సామాజిక అభిప్రాయం కొంత అనుకూలంగానే తయారయ్యింది. మంచో చెడో వేరే సంగతిగానీ, అనుకూలంగా తయారయిన మాట వాస్తవం.

కాబట్టి ఉద్యమం మళ్ళీ రాదు అనేదేమీ లేదు గానీ, అటువైపు ప్రభుత్వం మాత్రం దీనిని, దీనికున్నటువంటి సామాజిక, ఆర్థిక మూలాలను - పదే పదే ఒక రొటీన్‌గా అంటున్నప్పటికి కూడ - ప్రధానంగా అణచివేత ద్వారానే ఎదుర్కోవాలని భావిస్తున్నది. ప్రభుత్వానికి ఏ రకమైన నీతి గాని, నియమాలు గాని, చట్టం గాని, విలువలు గాని ఏమీ ఉండడం లేదు. రాజ్యాంగాన్ని గౌరవించడం లేదు. ఒకప్పుడు యాంటీ నక్సలైట్ స్క్వాడ్లు, ఇప్పుడేమో గ్రేహౌండ్స్. ఇంకా ముందుకు పోతే కోబ్రాలని, గ్రీన్ టైగర్సని రకరకాల పేర్లతో ప్రైవేట్ గ్యాంగులను తయారు చేసి ఆ విధంగా వారిని ఎదుర్కొనేటటువంటి వ్యూహాన్ని ప్రభుత్వం రచించింది. ఎంత చేసినప్పటికి

కూడ మళ్ళీ ఉద్యమం రాదని కాదు. కాని ఎప్పుడు వచ్చినా కూడ వాళ్ళ విధానాలలో మార్పు లేకపోతే లేదా ప్రభుత్వ స్పందనలో మార్పు లేకపోతే, పదే పదే ప్రభుత్వానికి వాళ్ళకు మధ్య - డింగ్‌డాంగ్ బ్యాటిల్ అంటారు ఇంగ్లీషులో - అంటే నువ్వా నేనా అనేటటువంటి ఒక ఘర్షణగా తప్ప, మళ్ళీ ప్రజల దగ్గరికి పోయి, ప్రజల సామాజిక స్థితిగతులు, వాళ్ళ మనోధైర్యం పెంచేటటువంటి రూపం తీసుకునే అవకాశం ఉందా అంటే - ఇవ్వాళయితే అది ప్రశ్నార్థకమే.

మన రాష్ట్రం స్ఫూర్తితో నక్సలైట్ ఉద్యమం వ్యాపించినటువంటి ఒరిస్సా, జార్ఖండ్, ఛత్తీస్‌గఢ్‌లాంటి ప్రాంతాలను ఒకసారి చూస్తే ఇక్కడ చేసిన దానికంటే కూడ మరింత ఎక్కువ హింస, మరింత విస్తృతస్థాయిలో అక్కడ చేయడం జరుగుతూ ఉంది. మావోయిస్టులు బహుశా ప్రజలను సమీకరించి, రైతు కూలీ సంఘాల ద్వారా ఆర్థిక సామాజిక పోరాటాలు చేసుకుంటూ బలపడే దశ దాటిపోయింది, వేరే దశకు చేరామని అనుకుంటున్నారేమో! వాళ్ళ అంచనా అది. ఏ విధంగా ఆ అంచనాకు వస్తున్నారో గానీ వాళ్ళు ప్రజానీకానికి సామాజిక ప్రయోజనాన్ని, ఆర్థిక ప్రయోజనాన్ని ఇవ్వగల స్థితి తిరిగి వస్తుందా అంటే కొంత సందేహంగానే ఉంది.

ఈ లోపల సమాజమూ మారింది. కొంతవరకు వాళ్ళ పోరాటం వల్ల మారింది. ప్రజలలో రాజకీయ అవగాహన చాలా పెరిగింది. తెలంగాణ జిల్లాలలో ఇవ్వాళ మనం ఎన్ని రకాల రాజకీయ అవగాహనల గురించి మాట్లాడు కుంటున్నామో వాటికి ప్రధానంగా నక్సలైట్ ఉద్యమమే కారణం. తెలంగాణ రాష్ట్రం కావాలన్న ఆకాంక్ష బలంగా ఉందంటే కూడ - ఆ ఆలోచన, ఆ తెలివితేటలు, ఆ విశ్లేషణ, న్యాయం-అన్యాయం, అణచివేత-ప్రతిఘటన అన్న విశ్లేషణ తెలంగాణ ప్రాంతానికి నేర్పించింది నక్సలైట్ ఉద్యమమే. దాని కార్యకర్తలు ఒకప్పుడు నక్సలైట్ ఉద్యమంతో రకరకాల సంబంధాలున్నటువంటి వాళ్ళే. తెలంగాణ జిల్లాలను లేదా మన రాష్ట్రంలాంటి రాష్ట్రాలను కమ్యూనిస్టు ఉద్యమాలు, నక్సలైట్ ఉద్యమాలు లేని రాష్ట్రాలతో, ప్రాంతాలతో పోల్చినప్పుడు ఆ తేడా మనకు బాగా కనిపిస్తుంది. న్యాయం - అన్యాయం, అణచివేత - ప్రతిఘటన అనే చట్రంలో ఆలోచించడమనేది సమాజ పురోగతికి చాలా ఉపయోగకరం. వాళ్లకు దాన్ని నేర్పించింది నక్సలైట్ ఉద్యమమే. బహుశా ముందు నుంచి కమ్యూనిస్టు ప్రభావం ఉన్న రాష్ట్రం కావడం వల్ల కూడ అది వచ్చి ఉండవచ్చును. అదొక పక్క జరిగింది.

కానీ మరొక పక్క - ఈ మధ్య కాలంలో చాలాసార్లు అనిపిస్తుంది -

తెలంగాణ జిల్లాలలో రైతులు ఎక్కువగా ఆత్మహత్యలు చేసుకుంటున్న ప్రాంతాలను చూస్తే, అన్నీ కూడ నక్సలైట్ల ప్రాబల్యం బాగా బలంగా ఉండినటువంటి ప్రాంతాలే. ఇవ్వాళ సింగరేణి ప్రాంతంలో సింగరేణి యాజమాన్యం చాలా పెద్దఎత్తున గ్రామాలకు గ్రామాలను లేపేసి ఓపెన్‌కాస్ట్ మైనింగ్ పేరు మీద, బహుశా రెండు మూడు లక్షల ఎకరాలు తీసేసుకునే ఆలోచన చేస్తూ ఉంది. అదంతా నక్సలైట్ల ప్రాబల్యం బలంగా ఉండినటువంటి ప్రాంతాలే. అక్కడేగాదు, ఏజెన్సీ ప్రాంతాలలో కూడ - విశాఖపట్నంలో గానీ, తూర్పు గోదావరిలో గానీ - అంత ఉద్యమం జరిగిన ప్రాంతాలలో ప్రజలు ఇవ్వాళ స్తబ్దంగా ఎందుకున్నారు అనే ప్రశ్న పదే పదే ముందుకు వస్తుంటుంది. అక్కడ జనంతో మాట్లాడినప్పుడు వాళ్ళు నవ్వుతారు, రకరకాల వ్యాఖ్యానాలు చేస్తారు. ఉద్యమాలు చేస్తే నిర్బంధం వస్తుందని, పోలీసులు వస్తారని మాకనుభవం అయ్యిందని ఆ నవ్వుకు అర్థం కావచ్చు. కానీ మాకేమనిపిస్తుందంటే, అంతకంటే కూడ, ఈ సాయుధ పోరాట రాజకీయాలు తీసుకున్నటువంటి రూపం వల్ల ప్రజలు తమ కోసం తాము చేసుకోవడం అనేదాని కంటే కూడ తమ కోసం చేసిపెట్టేవాళ్ళు ఎవరో ఒకరున్నారు, వాళ్ళకు మనం ఆశ్రయమిస్తాం, వాళ్ళకు మనం అనుచరులుగా ఉంటాం, వాళ్ళకు కావలసినటువంటి అండదండలు ఇస్తాం అనే వైఖరిలోకి వచ్చారని. ఉద్యమకారులే ప్రజలు, ప్రజలే ఉద్యమకారులు అని ఇప్పటికీ సిద్ధాంతపరంగా, భావజాలపరంగా నక్సలైట్లు చెప్పుకుంటూ ఉన్నప్పటికీ, ఉద్యమకారులు, ప్రజలు వేరే వేరే వర్గాలు లేదా వేరే వేరే విషయాలు అయిపోయాయి. పోలీసులు విపరీతంగా నిర్బంధం పెట్టడం వల్ల, చాలా దుర్మార్గంగా తీసుకుపోయి కాల్చిపారేసి ఎన్‌కౌంటర్ కథలల్లడం వల్ల ఇవ్వాళ ఉద్యమకారులు లేరు. రాష్ట్రంలోకి ఒక ముఖ్య నాయకుడు ఎవరైనా వస్తే కొద్ది రోజులలోపే పసిగట్టి వాళ్ళను పట్టుకోవడం, చంపేయడం - అంత విస్తృతమయినటువంటి ఒక ఇన్‌ఫార్మర్ వ్యవస్థను పోలీసులు తయారు చేసుకున్నారు.

వీటి కారణంగా ఇవ్వాళ ఉన్న పరిస్థితి ఏమిటి అనంటే - ఒక పోరాట ప్రాంతం, ఉద్యమ ప్రాంతం, ఉద్యమించిన అనుభవం ఉన్న ప్రాంతంలో కూడ ప్రజలకు ఉండవలసినటువంటి మనోనిబ్బరమూ, బలమూ లేదు. దాని బదులు వాళ్ళు ఉన్నారు, వాళ్ళు చేశారు, ఇప్పుడు వాళ్ళు లేరు... అనే ఒక నిస్సహాయత చాలా ఆశ్చర్యకరంగా కనిపిస్తుంది. ప్రత్యేక ఆర్థిక మండళ్ళు, సెజ్‌లు వంటి వాటికి వ్యతిరేకంగా వేరే రాష్ట్రాలలో జరుగుతున్న పోరాటాలను, ఉద్యమాలను

చూసినప్పుడు అక్కడున్న మనోనిబ్బరం మన దగ్గర కనబడటం లేదు. ఎక్కడ కనబడటం లేదంటే నక్సలైట్ల ప్రభావం చాలా బలంగా ఉన్న ప్రాంతాలలోనే కనబడటం లేదు. అంటే, ఎక్కడో లోపం ఉంది. ఆ ఉద్యమం తీసుకున్నటువంటి రూపంలోనే ఆ లోపం ఉంది. తొలినాడు ఆ పరిస్థితి ఉండేది కాదు. నిర్బంధమూ, నిర్బంధానికి ప్రతిఘటనా, దానిపై మళ్ళా ఎక్కువ నిర్బంధమూ, మళ్ళా ఎక్కువ ప్రతిఘటనా - ఈ వలయం పైకిపోయే క్రమంలో ఎక్కడో ఒక గ్యాప్ లాంటిది ఏర్పడటం వల్ల గావచ్చు. మనకు కనిపించే విషయం ఏమిటంటే పోరాటం చేసే వాళ్ళు చేస్తారు, వాళ్ళు చేసినప్పుడు మనకు ఫలితం వస్తుంది అనే వైఖరి. కూలిరేట్లు బాగా తక్కువ ఉన్నాయి కదా అనంటే 'ఇంకా పోస్టర్లు పడలే, పోస్టర్లు పడితే వస్తాయి' అన్నారు. పోస్టర్లు వేసేటి వాళ్ళు ఎవరో ఉంటారు, వాళ్లు వేస్తే కూలి రేట్లు పెరుగుతాయి, లేకుంటే పెరగవు అనేటటువంటి మాట నేను వరంగల్‌లో రెండుమూడు సార్లు విన్నాను. ఇది కొంత నష్టకరమైనటువంటి పరిస్థితి.

బహుశా ప్రజలు ఒక పునఃసమీక్ష చేసుకోవాలి. ఆ ఉద్యమాలూ చేసుకోవాలి. ఉద్యమాలు ఉండొచ్చు, పోవచ్చు, దెబ్బతినొచ్చు, మళ్ళీ రావచ్చును కానీ - అవి పని చేసిన ప్రాంతంలో ప్రజలకు మనోనిబ్బరం ఇవ్వగలగాలి. సమస్యొస్తే మేము కదులుతాం, మేము ఒకటవుతాం, పరిష్కారం చేసుకుంటాం, పోరాటం చేస్తాం అనేటటువంటి సంస్కృతి, అందుకు కావలసినటువంటి ఆత్మస్థైర్యం ఉద్యమాలు ప్రజలకు ఇవ్వగలిగితే ఆ ఉద్యమం ఏ కారణంగా దూరమైనా ఫలితాన్ని మిగిలించి పోతుంది.

అటువంటి ఫలితం నక్సలైట్ ఉద్యమం మిగిలించలేదేమోననిపిస్తుంది. మొదట్లోనే చెప్పాను - ఈ ఉద్యమం సమాజాన్ని తల్లక్రిందులు చేసింది. నోరులేని వాళ్ళకు నోరిచ్చింది, నిలబెట్టింది, ఆర్థికంగా కొంత మేలు చేసింది. రాజకీయంగా విజ్ఞత చాలా ఇచ్చింది, ఆలోచన చాలా ఇచ్చింది, విశ్లేషణ చాలా ఇచ్చింది. కానీ ఒక బలమైనటువంటి ఉద్యమం పనిచేసిన ప్రాంతాలలో ముఖ్యమైన ఫలితం ఏదైతే ఉండవలసి ఉండెనో అది లేకుండా పోయింది. వేరే ఏదీ కాకపోయినా - ఇవ్వాళ ఆ పార్టీ లేకపోయినా, ఉద్యమాల్లేక పోయినా - మేమున్నాం, మేము ఉద్యమం చేసుకుంటాం, మేము పోరాడుతాం, మేము విడిచిపెట్టం, న్యాయం కొరకు మేము కొట్లాడుతామనేటటువంటి సంస్కృతిని ప్రజలకు ఇవ్వలేకపోయారు. అక్కడ నుంచి మొదలుపెట్టి వాళ్ళు తాము అనుసరించిన విధానాలను పునరాలోచన చేసుకోవాలి.

ఎప్పుడు విమర్శ వచ్చినా నిర్బంధం ఉంది కాబట్టి ఈ పని చేశాము, నిర్బంధాన్ని ఎదుర్కోవడానికి చేయవలసి వచ్చింది, అంతే తప్ప మా అవగాహన లోపం కాదు అని అంటూ ఉంటారు. నిర్బంధానికి ఒక రకంగా మాత్రమే స్పందించాలనేమీ లేదు. వేరే రకంగా కూడ స్పందించి ఉండవచ్చు. వేరే రకంగా స్పందించి ఉంటే ఏ ఫలితం ఉండేది అనంటే అది ఆలోచించుకోవాల్సిన అంశం. వాళ్లు ఎంచుకున్న మార్గాల ఫలితమే గావచ్చు, నిజంగా రాగల ఫలితాన్ని మిగిలించకుండా ఆ ఉద్యమం ఇవ్వాళ దూరం అయ్యింది. తిరిగి రావచ్చును, రాదనేమీ కాదు గానీ, తిరిగొచ్చినా కూడ మళ్ళీ ఇదే రకమైనటువంటి పంథాలో నడిస్తే ఇదే రకమైన ఫలితాలో, ఫలితాల రాహిత్యమో మనకు చివరికి కనిపిస్తే, అది అంతిమంగా ఒక నెగటివ్ కామెంట్‌గానే మిగిలిపోయే అవకాశం ఉంది. ఇప్పుడు మన దేశంలోనే కాదు, ప్రపంచ వ్యాప్తంగా అమలవుతున్న నయా ఉదారవాదం ఫిలాసఫీలో చాలా కీలకమైన ఆలోచన ఏమిటనంటే - ఎవరి వనరులతో వాళ్ళు తమకున్న సామర్థ్యం మేరకు ప్రయోజనం పొందుతూ పోతారు. వనరులు లేనివాళ్ళు చస్తే చస్తారు, బ్రతికితే బ్రతుకుతారు. వనరులున్న వాళ్ల నుంచి ఏమయినా కొంత రాలితే వీళ్ళు ఏరుకొని తింటారు. ఈ ఫిలాసఫీ ఇవ్వాళ ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక వ్యవస్థను శాసిస్తూ ఉంది. వనరులను ప్రభుత్వం ప్రయత్న పూర్వకంగా ప్రజానీకానికి జీవనాన్ని కల్పించే రూపంలో అభివృద్ధి చెయ్యాలనే ఆలోచన పూర్తిగా పక్కకిపోయి వనరులు ఉన్న వాడిదే సొత్తు, లేని వాళ్ళకు బ్రతుకు ఉండేదీ లేనిదీ పరిస్థితులను బట్టి ఉంటుంది అనే అభిప్రాయం వచ్చింది.

ఈ పరిస్థితి పట్ల ప్రజలలో అసంతృప్తి చాలా ఉంది. మన రాష్ట్రంలో గత అయిదారు సంవత్సరాలుగా - చంద్రబాబు నాయుడు పరిపాలనలోని చివరి రెండు సంవత్సరాలు కలిపి రాజశేఖరరెడ్డి పరిపాలనని లెక్కిస్తే - ప్రజల జీవితానికి అవసరమయిన మౌలిక భౌతిక వనరులను చాలా పెద్దఎత్తున బలవంతంగా వాళ్ళకు కాకుండా చేసి అభివృద్ధి పేరుమీద వాటిని కార్పొరేట్ కంపెనీల చేతిలో పెడుతూ ఉన్నారు. అది సెజ్ కానీయండి, సింగరేణి కార్పొరేషన్ వాళ్ళ ఓపెన్ కాస్ట్ గనులు కానీయండి, కోస్టల్ కారిడార్ కానీయండి... అన్ని చోట్లా అదే చేస్తూ ఉన్నారు.

దీనికి ఎంత ప్రతిఘటన అయితే రావలసి ఉండిందో అది రాకపోవడానికి ప్రజలలో ఉన్న నిస్తేజం ఒకటే కాకుండ బలమైన ప్రజా ఉద్యమం ఏదీ లేకపోవడం కూడ ఒక కారణం. అది ఎంత లోటో ఇవ్వాళ మనకు స్పష్టంగా కనిపిస్తూ ఉంది. మరి అటువంటి ఉద్యమం ఒకటి ఇవ్వాళ రాగలుగుతుందా? రావడానికి ఎన్ని

రకాల అవాంతరాలున్నాయి? ఎందుకంటే మన వామపక్ష ఉద్యమాలలో మొదటి నుంచీ కూడ కలుపుకొనిపోయి ఐక్యంగా బలంగా ఉమ్మడిగా ఉండే కంటే ఎవరికి వాళ్ళు చీల్చుకొని పోయేటటువంటి పోకడే ఎక్కువ. అది ఇవ్వాళ చాలా దూరం పోయింది. అది ఒకటి అయితే రెండవది ఒకనాటి తెలంగాణను గాని, ఒకనాటి ఆదివాసీ ప్రాంతాన్ని గాని, ఒకనాటి ఆంధ్రప్రదేశ్‌ను గాని వ్యాఖ్యానించుకోవడానికి ఉపయోగించినటువంటి ఆ సిద్ధాంత చట్రం ఇవ్వాళ పనికొస్తుందా అని ఆలోచించుకోవాలి. నేటి వాస్తవాలను విశ్లేషించడానికి ఏ రకమైనటువంటి చట్రం కావాలి? ఇవ్వాళ ప్రజానీకాన్ని ఏ రకంగా సమీకరించాలి అని ఆలోచించుకోవాలి. ఎందుకంటే గతంలో ఒక దుర్మార్గుడైన దొరను తంతే, కొడితే, చంపేస్తే, బెదిరించి నోరు మూయించేస్తే లేదా జనమంతా ఒకటయి 'ఇక సాగదు నీ ధాష్టీకాలు' అని అంటే అది ఆగిపోయే అవకాశం ఉండింది. కానీ పెట్టుబడిదారీ వ్యవస్థ అట్లాంటిది కాదు. సామ్రాజ్యవాదమనేది, పెట్టుబడిదారీ వ్యవస్థ అనేది ఒక వ్యక్తి కాదు; ఒక చోటు, ఒక స్థలం కాదు - అదొక విస్తృతమైన సామాజిక సంబంధం. ఆ విస్తృతమైన సామాజిక సంబంధానికి వ్యతిరేకంగా చేసే పోరాటంలో చాలా మెలకువతో, చాలా విజ్ఞతతో వ్యవహరించాల్సిన అవసరముంటుంది. దానికి కావాల్సిన సిద్ధాంతం కూడ మరింత గాఢత సంపాదించుకోవాల్సిన అవసరం ఉంది. అటువంటి ఉద్యమాలు ఇవ్వాళైతే కనబడటం లేదు. అయితే తిరుగుబాట్లు బహుశా చాలా జరగబోతాయి. మళ్ళీ వామపక్ష ఉద్యమాలు, నక్సలైటు ఉద్యమాలు ప్రవేశించి కొంత బలం సంపాదించుకోగలిగితే ఆ తిరుగుబాట్లకు వాళ్లు అండగా ఉంటారు గానీ, ఈలోగా వారు తమ ఆలోచనారీతులను, ఆచరణరీతులను చాలా లోతుగా పునః సమీక్షించుకొని ఇప్పటి పరిస్థితులకు అనుగుణంగా తయారుచేసుకోకపోతే ఫలితం ఎంతుంటుందో చెప్పడం కష్టం. ప్రస్తుతానికి మాత్రం నిరాశే ప్రధానమైనటువంటి స్పందనగా ఉంటుంది నా వరకైతే.

మావోయిస్టులు కాకుండా ఇతర ఎం.ఎల్ పార్టీల వాళ్ళు మొదటినుంచి ప్రజలను సమీకరించాలి అనే పంథానే అనుసరిస్తూ వస్తున్నారు కదా అన్న ప్రశ్న వస్తుంది కానీ నిజానికి ఆ పార్టీలు కూడ కారణమేదైనా గానీయండి ఎంత విస్తృతంగా సమస్యలున్నాయో అంత విస్తృతంగా వ్యాపించలేకపోతున్నారు. ఎందుకు వ్యాపించలేకపోతున్నారు? ఎందుకు ప్రజలను సమీకరించలేకపోతున్నారు? లేకపోతే ప్రజలే సమీకృతం కావడం లేదా? ఈ ప్రశ్నలకు జవాబులు ఆలోచించాలంటే చాలా లోతుగా పోవల్సి వస్తుంది.

ఒకనాడు ప్రజలలో మన దీర్ఘకాలికమైనటువంటి బాగు కోసం, రేపటి బాగు కోసం ఇవ్వాళ త్యాగం చేద్దాము అనేటటువంటి ఒక రాజకీయ గుణం, సామాజిక గుణం బలంగా ఉండింది. ఎక్కడో అది కూడ దెబ్బ తినింది.

*హెచ్.ఎం.టి.వి. లైబ్రరీ నుంచి*
*డిసెంబర్ 2008*

*'నాలుగు దశాబ్దాల నక్సల్బరీ' శీర్షికన హెచ్ఎంటివి వాళ్లు జనవరి 2009లో ఒక కార్యక్రమాన్ని ప్రసారం చేశారు. దాని కోసం జర్నలిస్టు అత్తలూరి అరుణ రికార్డు చేసిన వీడియో ట్రాన్స్క్రిప్షన్ ఇది. ఇందులోని కొన్ని భాగాలు మాత్రమే ప్రసారమయ్యాయి.*

# ప్రజాస్వామ్య పునాదులపైనే సోషలిజం

నేపాల్ రాజకీయ పరిణామాల గురించి చాలా వ్యాఖ్యలు వింటున్నాం. వాటన్నిటినీ సమీక్షించడానికి ఒక వ్యాసం సరిపోదుగానీ, నేపాలీ మావోయిస్టులకు లభించింది ఒక చరిత్రాత్మక అవకాశం అన్న విషయాన్ని - ఆ పార్టీతో సహా - ఎంత మంది గుర్తిస్తున్నారు?

ప్రతి చిన్న సందర్భాన్నీ చరిత్రాత్మకం అనడం జర్నలిజం పుణ్యాన అలవాటయిపోయింది కాబట్టి ఇది నిజమైన అర్థంలో చరిత్రాత్మకం అని వివరించాలి.

ప్రజలకు రాజకీయ ప్రజాస్వామ్యాన్ని నిరాకరించి సోషలిజం నిర్మించాలని చూస్తే అది సాగదన్నది 20వ శతాబ్దపు చరిత్ర నేర్పిన ముఖ్య పాఠాలలో ఒకటి. సోవియట్ రష్యాతో మొదలుపెట్టి యూరప్‌లోని అన్ని కమ్యూనిస్టు పాలిత రాజ్యాలూ పతనం కావడానికి ఏకైక కారణం రాజకీయ ప్రజాస్వామ్యం లోపించడమే కాకపోవచ్చు. అయితే ఆ తరువాత అక్కడ నెలకొన్న పాశ్చాత్య తరహా రాజకీయార్థిక వ్యవస్థలోని పెట్టుబడిదారీ అంశాన్ని ఆ దేశాల ప్రజలు త్వరలోనే నిరసించారు గానీ రాజకీయ ప్రజాస్వామ్యాన్ని నిరసించలేదు. మళ్లీ కమ్యూనిస్టు లేక సోషలిస్టు పార్టీల పాలనే కోరుకున్నప్పుడు కూడ వారికి ఓట్లేసి ఎన్నుకున్నారే తప్ప వారికి నియంతలుగా పట్టం గట్టలేదు.

ఇక మీదట సోషలిజం నిర్మించే ప్రయత్నం ఎక్కడ జరిగినా అది ప్రజాస్వామ్య వ్యవస్థ ద్వారానే జరగక తప్పదు. ఒకవేళ ఒక

కమ్యూనిస్టు పార్టీ సాయుధ పోరాటం ద్వారా అధికారానికి వచ్చినా అది సోషలిస్టు సమాజ నిర్మాణానికి సంబంధించిన కృషిని రాజకీయ ప్రజాస్వామ్యాన్ని గౌరవిస్తూనే జరపవలసి ఉంటుంది. ఈ సందేశంతో పాటు, దీనికి అనుసరించవలసిన మార్గమేమిటన్న ప్రశ్నను 20వ శతాబ్దం వదిలి వెళ్లింది.

దీనికి సంబంధించిన సిద్ధాంత చర్చ యూరప్‌లో ఎప్పటి నుండో జరుగుతున్నది గానీ కమ్యూనిస్టు పార్టీలు బలంగా ఉన్న మనబోటి దేశాలలో ఎప్పుడూ జరగలేదు. ఇప్పుడూ జరగడం లేదు. అన్ని వైఫల్యాలకు బయట సామ్రాజ్యవాదం, లోపల రివిజనిజం కారణం అన్న విశ్లేషణ మన దగ్గర కమ్యూనిస్టు మేధావులకు సంతృప్తినిస్తున్నది.

ఈ చర్చను చేసే అవకాశం, దానిని ఆచరణలో పెట్టి మంచిచెడులు గుర్తించే అవకాశం నేపాల్ మావోయిస్టులకు దక్కింది. దానికి కావలసిన విజ్ఞత వారిలో ఉందా అంటే తెలీదనే చెప్పాలి. వారిలో కొంచెం ఇంగ్లీష్ చదువులు, ప్రపంచ చరిత్రా, సిద్ధాంత విశ్లేషణా అలవడ్డవారు మన మార్క్సిస్టు పార్టీ నేతలైన యేచూరి, కారత్‌ల సహవిద్యార్థులనీ, వారు వీరి వద్ద రాజకీయ సలహాలు తీసుకుంటున్నారనీ వింటున్నాం. వీరి రాజకీయ విజ్ఞత ఏ పాటిదో మనం చూస్తూనే ఉన్నాము కాబట్టి వీరి సహాధ్యాయుల నుండి ఆశించగలిగింది కొంచెమే. ఇకపోతే చదువుల కోసం ఢిల్లీకి రాకుండా నేపాల్ కొండలలోనే ఉండిపోయినవారు జీవితానుభవం నుండి, ప్రజలలో పనిచేసిన అనుభవం నుండి నేర్చుకున్న విజ్ఞత ఏమైనా ఉంటే అది ఇప్పుడు అక్కరకు రావచ్చు. కానీ దాని గురించి మనకేం తెలీదు.

రాజ్యాంగ పరిషత్‌లో అందరికంటె ఎక్కువ సీట్లు మావోయిస్టులకు దక్కాయి గానీ అది మొత్తంలో మూడవ వంతే. అయితే మరొక పెద్ద పార్టీ అయిన సి.పి.ఎన్ (యు.ఎం.ఎల్)కు పాలనా విధానాలకు సంబంధించిన చాలా విషయాలలో మావోయిస్టులతో ఏకాభిప్రాయం ఉండే ఉండాలి కాబట్టి రాజ్యాంగ రచనలో వారితో జట్టుకట్టి మెలకువతో మెలిగినట్టయితే సోషలిజాన్ని పాలనా విలువగా వ్యవస్థీకరించే రాజ్యాంగం రాయవచ్చు. రాజ్యాంగాన్ని ఎప్పుడయినా సవరించినా ఈ మౌలిక విలువలకు విరుద్ధంగా తిరగరాయడానికి వీలు లేదన్న నియమం కూడ రాజ్యాంగంలో రాయవచ్చు. ఒకవేళ నేపాలీ కాంగ్రెస్ పార్టీ సోషలిస్టు నమూనా రాజ్యాంగాన్ని రచించడానికే అడ్డు నిలిస్తే రెండు కమ్యూనిస్టు పార్టీలూ ఆ పాయింటు మీదనే రాజీనామా చేసి రాజ్యాంగ పరిషత్‌కు మళ్లీ ఎన్నికలు జరిగే పరిస్థితి కల్పించవచ్చు.

కానీ నేపాల్ మావోయిస్టులు రాజ్యాంగ రచన కంటే ఎక్కువగా మధ్యంతర ప్రభుత్వం మీదనే దృష్టి పెడుతున్నట్టు కనిపిస్తుంది. దానిలో ఎవరికి ఏ పదవులుండాలన్నది ఒక ముఖ్య వివాదంగా ఉన్నట్టుంది. ఈ అభిప్రాయం నిజం కాకపోవచ్చు, వాస్తవాలు పత్రికలలో వార్తల రూపం తీసుకునే ప్రక్రియ నుండి పుట్టిన భ్రమ కావచ్చు. అయితే ప్రచండ అనే ఆ పార్టీ నాయకుడు ఇస్తున్న ఇంటర్వ్యూలు ఇదే అభిప్రాయం కలిగిస్తున్నాయి.

దానికి తోడు తమ ప్రజా సైన్యాన్ని నిరాయుధీకరించడానికి నిరాకరించడం! అన్ని పార్టీలూ ఎన్నికల రంగంలో సమానంగా పోటీ చేయడానికి, రేపు ఆమోదించబోయే రాజ్యాంగ నిర్ణయాలకు అనుగుణంగా పరిపాలించడానికి అంగీకరించినప్పుడు ఒకరి దగ్గర మాత్రం సైన్యం ఉండడం ఏ విధంగా సబబు? మొన్నటి ఎన్నికలలో మావోయిస్టులు 'ప్రజాసైన్యం' సహాయంతో వోట్లు పొందారన్న అభియోగం ఎవరూ వేయలేదు గానీ ఆ అనుమానం ఎప్పుడూ రాకుండా ఉంటుందన్న భరోసా ఏమిటి? ఒకవేళ ఇతరులు తమను సమానంగా చూస్తారని, గెలిస్తే పరిపాలించనిస్తారని నమ్మకం లేనట్టయితే తమ సైన్యం నిరాయుధీకరణకొక గడువయినా సూచించాలి. ఎప్పటికీ ఒక రాజకీయ వ్యవస్థలో ఒక పక్షానికి సాయుధ బలగం ఉండడం ఎట్లా ఆమోదనీయం అవుతుంది? చట్టబద్ధ పాలనకు భరోసా ఏముంటుంది?

నిజానికి రాజ్యాంగ రచన తరువాత మావోయిస్టులు దృష్టి పెట్టవలసింది పరిపాలనా పద్ధతుల మీద. సోషలిస్టు రాజ్యాంగాన్నే రాసుకున్నా దానిపట్ల పూర్తి ఏకీభావం లేని పార్టీలు కూడ రాజకీయ రంగంలో ఉంటాయి. సెక్యులర్ రాజ్యాంగం రాసుకున్న భారత రాజకీయ వ్యవస్థలో భారతీయ జనతా పార్టీ ఉన్నట్టు. వారు తమ పద్ధతులలో భ్రమలు కల్పించో, భయాలు కల్పించో ప్రజలను ఆకట్టుకునే ప్రయత్నం చేస్తారు. రాజకీయ ప్రజాస్వామ్యాన్ని స్వీకరించినప్పుడు వారి స్వేచ్ఛనూ అంగీకరించక తప్పదు. ఎప్పుడయినా ప్రజాస్వామ్య పద్ధతులలోనే ప్రజలు వారి వైపు ఆకర్షితులు కాకుండా అడ్డుకట్ట వేస్తూ ఉండాలి. మళ్లీ మళ్లీ సోషలిజాన్ని నిర్మించే సంకల్పం ఉండే పార్టీనే - ఒంటరిగానైనా ఉమ్మడిగానైనా - గెలిచేటట్టు చూసుకోవాలి.

దీనికి రాజకీయ మెలకువలు చాలా నేర్చుకోవాలి. అధికారం, ఆపైన ఆయుధాలు ఉన్నాయని ప్రజల మీద దాదాగిరీ చేసే బలహీనతకు లోను కాకూడదు. ఇప్పటికే మావోయిస్టు పార్టీకి అనుబంధమైన యువ కమ్యూనిస్టు

లీగ్ కార్యకర్తలు దూకుడుగా నడుచుకోవడం మానుకోలేదన్న అభియోగాలు ఇతర పార్టీలు చేస్తున్నాయి. అయితే ఆ సంస్థను మావోయిస్టులు రద్దు చేయాలన్న ఇతర పార్టీల డిమాండు న్యాయమైనది కాదు. పార్టీకి యువజన సంఘం ఉండడంలో తప్పేమీ లేదు. అయితే వారు ప్రజాస్వామికంగా నడుచుకోవడం నేర్చుకోవాలి. దీని గురించి కూడ మావోయిస్టుల నుండి స్పందన లేదు.

నిజానికి తొలి దశలో ఆర్థిక రంగంలో అవసరమైన రాజీలకు మావోయిస్టులు ఇప్పటికే సిద్ధపడ్డారు. పెట్టుబడిదార్లపైన చర్యలేవీ తీసుకోమనీ, విదేశీ పెట్టుబడిని కూడ ఆహ్వానిస్తామనీ ప్రకటించారు. పెట్టుబడులు బాగా తక్కువ ఉన్న, సాంకేతికంగా బాగా వెనుకబడి ఉన్న దేశం నేపాల్. సాంకేతిక పురోగతి సాధించేంత వరకు విదేశీ పెట్టుబడులను ఆహ్వానించడం తప్పనిసరే కావచ్చు.

ఆర్థిక రంగంలో సోషలిస్టు లక్ష్యానికి భిన్నమైన ఈ రాజీలకు సిద్ధపడే విజ్ఞత ప్రదర్శించిన వారు, రాజకీయ రంగంలో సోషలిస్టు భావనలో భాగం కాక తప్పని రాజకీయ ప్రజాస్వామ్యం విషయంలో అదే విజ్ఞత ప్రదర్శించడం లేదన్న అభిప్రాయం నిజమైతే అది దురదృష్టకరమే. ఆ సందేహం మాత్రం బలంగా కలుగుతున్నది. పరిపాలించినంత కాలం పోరాట దశలో అలవాటయిన పద్ధతులతో సాగించుకోవడం, మళ్లీ ఎన్నికలొస్తే అదే పద్ధతులలో గెలిచే ప్రయత్నం చేయడం, అది సాధ్యం కాకపోతే రాజకీయ వ్యవస్థ నుండి వైదొలగి 'మమ్మల్ని కొనసాగనివ్వలేదు' అన్న నింద వేయడం - ఈ ఎత్తుగడ నేపాల్ మావోయిస్టుల మనస్సులలో ఉందా? అందుకోసమేనా 'ప్రజాసైన్యాన్ని' రద్దు చేయడానికి నిరాకరిస్తున్నారు?

*ప్రజాతంత్ర వారపత్రిక*
*18 మే 2008*

# లాల్‌గఢ్: ఎవరి బాధ్యత ఎంత?

లాల్‌గఢ్ ఉదంతం ఏ అర్థంలోనూ ముగింపుకు రాలేదు. పరిపాలనా వ్యవస్థను అక్కడ తిరిగి స్థాపించే పోలీసు చర్య ముగింపుకు రాబోతున్నదనీ, చివరి దశ మొదలయిందనీ పశ్చిమ బెంగాల్ ప్రభుత్వము, పారామిలటరీ దళాల అధికారులు అనగా వింటున్నాం. ఇప్పటివరకు ఈ పోలీసు చర్యలో భయపడినంతగా రక్తపాతం జరగలేదు గానీ 'చివరిదశ'లో ఎటువంటి వార్తలు వినవలసి వస్తుందోనన్న ఆందోళన లేకపోలేదు. అయితే కొత్తగా ఠాణా అప్పగించబడ్డ ఎస్.ఐలాగ ఉత్సాహపడుతున్న హోంమంత్రి చిదంబరం గాని, పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం గాని కోరుకున్న ఈ ముగింపు లభించినా కూడ అది వేరే ఏ అర్థంలోనూ లాల్‌గఢ్‌కు ముగింపు కాదు. ఆ రాష్ట్ర పాలకులు, ప్రత్యేకించి సి.పి.ఎం నాయకులు ఇప్పటికైనా గ్రహించవలసిన సత్యాలు కొన్ని ఉన్నాయి. ఇవి నందిగ్రాం సమయంలోనే వెలికివచ్చాయి గానీ ఇప్పుడు మరింత స్పష్టం అయినాయి. ముప్పై ఏళ్ళకు పైగా వామపక్ష పార్టీలు ఆ రాష్ట్రాన్ని అవిచ్ఛిన్నంగా పరిపాలించిన క్రమంలో కొన్ని బలమైన అవలక్షణాలు పాలనా యంత్రాంగానికీ పాలక పార్టీలకూ అంటుకున్నాయి. ఆ రెండింటికీ తేడా చాలావరకు చెరిగిపోవడం మొదటి అవలక్షణం. ఇది సి.పి.ఎంకు ప్రత్యేకించి వర్తిస్తుంది. పాలక పార్టీయే ప్రభుత్వం, ప్రభుత్వమే పాలకపార్టీ అన్న స్థితి వచ్చింది. కోల్‌కతాలోనే కాదు,

జిల్లాలలో సహితం సి.పి.ఎం స్థానిక నాయకులు తాలూకా ఆఫీసు, పోలీసు స్టేషన్లతో మొదలుపెట్టి అన్ని కార్యాలయాలనూ శాసించడం రివాజు అయింది. ఈ ఫిర్యాదు కనీసం ఒక దశాబ్ద కాలంగా ఆ రాష్ట్రానికి ఎప్పుడు పోయినా వింటున్నాం. అయితే అది నందిగ్రాంతో ప్రజల నిరసన రూపంలో బయటికొచ్చింది. లాల్‌గఢ్‌లో దాని ఛాయలు బలంగా ఉన్నాయి. లాల్‌గఢ్‌లో గడచిన మూడు నాలుగు నెలల కాలంలో మావోయిస్టులూ వారి అండ ఉన్న ఉద్యమకారులూ సి.పి.ఎం కార్యకర్తలను ఏరి ఏరి చంపిన ఘటనలు కేవలం రాజకీయ హత్యలు కావనీ, వాటిలో పాలనా యంత్రాంగం పట్ల నిరసన కూడ ఇమిడి ఉందనీ గుర్తించడం అవసరం. అయినప్పటికీ అటువంటి హత్యలు అన్యాయమనీ, పైగా అవి నిరసనోద్యమాన్ని బలహీనపరుస్తాయే తప్ప బలం కల్పించవన్న విమర్శకు తావు ఉంటుందన్నది వేరే విషయం.

తామే పాలనా యంత్రాంగమై వ్యవహరించే సి.పి.ఎం కార్యకర్తలు రాష్ట్ర ప్రభుత్వ విధానాల అమలును తమ కర్తవ్యంగా మీద వేసుకోవడం, వాటిని వ్యతిరేకించే వారిపైన భౌతిక దాడులకు పాల్పడడం తరచుగా జరుగుతుంటుంది. నందిగ్రాంలో సెజ్‌ను వ్యతిరేకించిన వారిపై సి.పి.ఎం కార్యకర్తలు భౌతికదాడులు చేయడంతోనే సమస్య మొదలయింది. ఇది తప్పని సి.పి.ఎం నాయకత్వమే అంగీకరించక తప్పని పరిస్థితి ఇవాళ వచ్చింది. ఇంకనైనా ఆలస్యం చేయకుండ వారు తమ తప్పును గ్రహిస్తారో లేదో చూడాలి. మూడు దశాబ్దాలుగా వారు ఆ రాష్ట్రంలో అవిచ్ఛిన్నంగా గెలుస్తూ ఉండడానికి కారణాలేమిటన్న చర్చ ఎప్పుడొచ్చినా, కౌలురైతులకు (బర్గాదారులకు) భద్రత కల్పించారనీ, 73వ రాజ్యాంగ సవరణ కంటే ముందే పంచాయతీలకు బలం కల్పించారనీ చెప్తుంటారు. ఇవి ఎప్పటి విషయాలో! ఆ తరువాత ఏం చేశారు? ఆ పైన ఏం చేశారు? లాల్‌గఢ్‌లో ఆదివాసులు తామే రోడ్లు వేసుకున్నారనీ చెరువులు తవ్వుకున్నారనీ వింటున్నాం. మూడు దశాబ్దాల వామపక్షాల పాలన తరువాత ఒక ఆదివాసీ ప్రాంతంలో వేయడానికి రోడ్లు, తవ్వడానికి చెరువులూ ఇంకా ఎందుకు మిగిలి ఉన్నాయి? పశ్చిమ బెంగాల్‌లోని ఆదివాసులకు సి.పి.ఎం నేతృత్వంలోని ప్రభుత్వం తగినంత చేయకపోవడం వల్లనే లాల్‌గఢ్‌లో అసంతృప్తి చెలరేగిందని సి.పి.ఐ నాయకుడు బర్దన్ మొన్న అన్నారు. ఆ రాష్ట్రంలో అధికారం పంచుకుంటూ బయటకు వచ్చి సి.పి.ఎంను విమర్శించడంలోని నిజాయితీ ఎంత అని వారిని అడగవచ్చును గానీ, ఈ విమర్శ నిజమే కదా? కనీసం ఆ రాష్ట్రంలోని ఆదివాసీ ప్రాంతాలను కేంద్ర

ప్రభుత్వం చేత షెడ్యూల్డు ప్రాంతాలుగా ప్రకటింపజేయడానికి ప్రయత్నించిన దాఖలాలు కూడ లేవు. (ఈ విమర్శ వామపక్ష పార్టీలు పదే పదే అధికారానికొస్తున్న కేరళకు కూడ వర్తిస్తుంది.) ఆ గుర్తింపు ఉంటే కొన్ని హక్కులు స్వతహాగా వస్తాయి. కొన్ని కల్పించడం సులభం అవుతుంది.

కాగా, లాల్‌గఢ్ ఆదివాసీ పోరాటానికీ మావోయిస్టులకూ మధ్య నున్న సంబంధం ఇప్పటికీ స్పష్టంగా లేదు. ఎవరికి నచ్చిన చిత్రం వాళ్లు ఊహించు కుంటున్నారు. ఇతరులను అంగీకరించమంటున్నారు. ఆదివాసీ పోరాటం మొత్తం మావోయిస్టుల సృష్టి అనేది కేంద్ర 'ఇంటెలిజెన్స్' అని పిలవబడే వ్యవస్థ అభిప్రాయం. ఈ విషయం గ్రహించకపోవడం పశ్చిమ బెంగాల్ పాలకుల తెలివితక్కువతనం అని వారి విమర్శ. ఆ రాష్ట్రంలోని 18 జిల్లాల్లో 17 ఏదో ఒక మేరకు మావోయిస్టుల ప్రభావంలో ఉన్నాయనీ, కేవలం తూర్పు, పశ్చిమ మెదినీపూర్‌లు (మిడ్నపూర్ అని అందరూ అంటున్న జిల్లాలు), పురూలియా, బంకూరాలకే వారి ప్రభావం పరిమితమయిందన్న సి.పి.ఎం పాలకుల అభిప్రాయం హ్రస్వదృష్టి అనీ వారి నింద. మావోయిస్టులు కూడ తమ నాయకత్వంలోనే ఆ ఉద్యమం నడుస్తున్నదన్న అభిప్రాయం బహిరంగంగా కలిగిస్తున్నారు (అది నిజమైనా కూడ దానిని బహిరంగపరచడంలోని విజ్ఞత ఎంత?). దీనికి పూర్తిగా భిన్నంగా, పోలీస్ అత్యాచారాలకు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్న ఆదివాసీ ప్రజా ఉద్యమ నాయకుడు ఛాత్రధర్ మహతో 'మాకు మావోయిస్టులతో ఏ సంబంధం లేదు. వారి ఆలోచనలు వేరు, మావి వేరు' అంటున్నాడు. ఇది ఆత్మరక్షణలో చేసిన ప్రకటనే అనుకున్నా అతనిని తప్పు పట్టలేము. అయితే ఇదే వ్యాఖ్య వేరే కారణంగా చేస్తున్న మేధావులూ చాలామంది ఉన్నారు. లాల్‌గఢ్‌లో ఆదివాసులు స్వయంపాలన నెలకొల్పి తమ బాగోగులు తాము నిర్ణయించుకుంటున్నారని ఈ వ్యాఖ్య అంటుంది. అందులో భాగంగా, పొరుగున ఉన్న సల్బోనిలో ఆదివాసులకు ఇస్తామని హామీ ఇచ్చిన 4500 ఎకరాల ప్రభుత్వ భూమిని జిందాల్ వారి స్టీల్ ఫ్యాక్టరీకి రాష్ట్ర ప్రభుత్వం కట్టబెట్టగా దానికి వ్యతిరేకంగా ఆందోళన చేపట్టారనీ, ఈ స్వయం పాలన ఆకాంక్షను మావోయిస్టులు కబ్జా చేసుకొని లాల్‌గఢ్‌ను విముక్త ప్రాంతంగా చూపించి ప్రజా ఉద్యమ స్థానంలో సాయుధ దళాల గెరిల్లా పోరాటాన్ని ప్రవేశపెట్టారని ఈ వ్యాఖ్య అంటుంది. మావోయిస్టులను తీవ్రంగా ఖండిస్తూ, ఆదివాసీ స్వయం పాలనా పోరాటాన్ని ప్రశంసిస్తుంది. ఇది నిజమయితే ఈ మాటలు అనడానికి సందేహించ నవసరం లేదుగానీ ఇందులో నిజాన్ని బయటపెట్టాలన్న ఆరాటం కంటే

మావోయిస్టుల ఉనికికి, వారి రాజకీయాలకు చోటు నిరాకరించాలన్న ఆరాటమే ఎక్కువగా కనిపిస్తోంది.

అది అవాస్తవికమైన, అహేతుకమైన వైఖరి. భారత ప్రజాస్వామ్యం వేరే లక్ష్యాల సంగతి అటుంచి, అది భారత రాజ్యాంగ ఆదర్శాలను సహితం ఒనగూర్చుతుందన్న కచ్చితమైన భరోసా ఇచ్చే స్థితిలో ఎవ్వరూ లేనప్పుడు రాజ్యాంగం నిర్దేశించిన రాజకీయ వ్యవస్థకు వెలుపల ప్రత్యామ్నాయాలను అన్వేషించే ప్రయత్నాలను అసలే కూడదనడం అవాస్తవికమైన వైఖరి.

అయితే ఈ గుర్తింపుతో పాటు మావోయిస్టులు జవాబుదారీతనాన్ని కూడ స్వీకరించవలసి ఉంటుంది. లాల్‌గఢ్ ఆదివాసీ పోరాటంతో వారికి సంబంధాలు తొలి నుంచి ఉన్నాయన్నది స్పష్టమే. అందులో వారి పాత్ర ఉన్న విషయమూ స్పష్టమే. అయితే 4500 ఎకరాల కోసం ఆదివాసీ ప్రజలు ఉమ్మడిగా ఆందోళన చేస్తున్న నేపథ్యంలో బుద్ధదేవ్ భట్టాచార్యపైన హత్యా ప్రయత్నానికి పాల్పడడం ఏపాటి విజ్ఞత గల చర్య? దానితో మొదలయిన ఘటనలే కదా ఒకదానితో ఒకటి జత అయి ప్రస్తుత పరిస్థితికి దారి తీశాయి? లాల్‌గఢ్‌లో దిగిన కేంద్ర పారా మిలటరీ బలగాలు ఆదివాసీ ప్రజల పోరాట ఫలాలను చిదిమేసి పూర్వస్థితికి తీసుకొస్తే దానికి బాధ్యులెవరు? ఒక రకంగా ఈ చర్య పొరుగున ఉన్న ఒరిస్సా రాష్ట్రంలోని కంధమాల్ జిల్లాలో లక్ష్మణానంద సరస్వతి హత్యతో పోల్చదగ్గది. స్థానిక పరిస్థితులు చాలా భిన్నమైనవి కాబట్టి పర్యవసానాలు ఒకే రకంగా లేవుగానీ, రెండూ అనాలోచితమైన చర్యలే. అక్కడ ప్రతిచర్య వల్ల క్రైస్తవులు ప్రత్యక్షంగా భారీ మూల్యం చెల్లించగా, ఇక్కడ ప్రతిచర్య వల్ల ఆదివాసులు వేరే రూపంలో చాలా మూల్యం చెల్లించబోతారు. ఈ మాటలు అంటే 'తప్పంతా మావోయిస్టుల పైనే పెడుతున్నారు' అన్న ఎదురుదాడి తప్ప వేరే జవాబు రాదు. ఎవరి మీద ఎంత తప్పు పెట్టాలో అంత పెట్టే విజ్ఞత సమాజంలో లేకపోలేదని మావోయిస్టులు గుర్తించే రోజు వస్తే వారి నాయకత్వాన్ని అనుసరిస్తున్న ప్రజలకు వారు మేలు చేసినవారవుతారు. లేకపోతే కన్నీటి గాథలు మళ్లీ మళ్లీ పునరావృతమవుతూనే ఉంటాయి.

*ఆంధ్రజ్యోతి దినపత్రిక*
*1 జూలై 2009*

# ఈ వేట ఆపమని నినదిద్దాం

'గ్రీన్‌హంట్' మొదలయింది. హోం మంత్రి చిదంబరం సెప్టెంబర్‌లో మొదలుపెడతామని చెప్పి నవంబర్‌కు వాయిదా వేసిన మావోయిస్టుల 'ఏరివేత' కార్యక్రమం ఇప్పుడు మొదట అనుకున్నట్టుగా సెప్టెంబర్‌లోనే ప్రారంభమయింది. ఛత్తీస్‌గఢ్ నుంచి వచ్చే వార్తల విశ్వసనీయత స్వల్పమే కాబట్టి ఎంత మంది కోబ్రాలు దంతెవాడ జిల్లాలోకి ప్రవేశించారు, కేంద్రం ఎన్ని బెటాలియన్ల పారా మిలటరీని పంపింది, కాల్పులలో ఇప్పటికి ఇటువైపూ అటువైపూ ఎంతమంది చనిపోయారు ఇత్యాది విషయాలపై పత్రికలు ఇస్తున్న గణాంకాలు పూర్తిగా సత్యాలు కాకపోవచ్చును. సిబ్బంది సంఖ్య తెలుసుకోవడం కొంచెం ప్రయత్నం చేస్తే అసాధ్యం కాకపోవచ్చును గానీ మరణాల గురించి ఆ మాట అనలేం. మరణానికి సాక్షి మృతదేహం. కానీ ఛత్తీస్‌గఢ్ పాలకులు తమ వారి మృతదేహాలను మాత్రమే స్వాధీనం చేసుకొని పంచనామా, పోస్ట్‌మార్టం నిర్వహించి కుటుంబ సభ్యులకు అప్పగిస్తారు. మావోయిస్టులు, వారి సానుభూతిపరుల మృతదేహాలను అడవి జంతువులకు వదిలేసి రావడం తరచుగా జరుగుతుంది. ఒక సంవత్సరం క్రితం వరకు ఎప్పుడూ అదే జరిగేది. ఈ మధ్య కొన్ని సందర్భాలలో వారి మృతదేహాలను కూడ తీసుకొచ్చి పంచనామా చేస్తున్నట్టున్నారు. చనిపోయిన వారు సాయుధ నక్సలైట్లు కాక గ్రామీణ ప్రజలయితే, వారి మృతదేహాలను అడవిలోనే వదిలేయడం పాలకుల దృష్టిలో తెలివయిన పని. నిజంగా సాయుధ కార్యకర్తలయినా కూడ,

ఆ విద్రోహుల శవాలకు ఇన్ని మర్యాదలు, దానికోసం తమకింత శ్రమ అనవసరం అన్న అభిప్రాయం ఛత్తీస్‌గఢ్ పాలనా యంత్రాంగంలో ఉన్నట్టుంది. శ్రీలంకలో ఎల్‌టిటిఇపైన జరిగిన పోరులో చనిపోయిన తమిళుల మృతదేహాలకు జరిగిన పంచనామాలో వారిని చిత్రహింసలు పెట్టి చంపిన దాఖలాలున్నాయని బయట పడిన తరువాత, పంచనామా చేయకుండ ఖననం చేయొచ్చునని ఆ దేశ ప్రభుత్వం ఆర్డర్ జారీచేసింది. మన ప్రభుత్వాలు అటువంటి ఆదేశాలు జారీ చేయడానికి రాజ్యాంగం అడ్డం రావచ్చును కాబట్టి అలిఖిత ఆదేశాల ద్వారా ఛత్తీస్‌గఢ్ పాలకులు దానిని అమలుచేస్తున్నారు.

మీడియా ఆ ఛాయలకు రాకూడదని ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం తాఖీదు జారీచేసిందని కూడ పత్రికలు చెప్తున్నాయి. 'గ్రీన్‌హంట్'లో వేటాడబడుతున్నది సాయుధులా లేక వారి వెంబడి ఉన్న ఆదివాసులా అన్నది బయటపడకుండ ఉండడానికి ఈ ఆంక్ష సహితం అవసరం అని రమణ్‌సింగ్ ప్రభుత్వం భావించినట్టుంది. ఈ ఆంక్షను ధిక్కరించే ధైర్యం మీడియాకు ఉంటే గెలవగలరు. ఎందుకంటే పత్రికా స్వేచ్ఛ భావ వ్యక్తీకరణ స్వేచ్ఛలో భాగం అని సుప్రీంకోర్టు రాజ్యాంగం రాసిన తొలినాళ్లలోనే వ్యాఖ్యానించింది. దానిని రాజ్యాంగం ఆమోదించిన పరిమితుల మేరకు, అదీ చట్టం చేసి నియంత్రించవచ్చును గానీ ఏ కారణం చూపించకుండ జీవోల ద్వారా మీడియాను నిషేధించే అధికారం ప్రభుత్వానికి లేదు. తుపాకులు పట్టుకొని అడ్డం నిలబడ్డ కోబ్రాలతో రాజ్యాంగాన్ని గురించి వాదించి ప్రాణాలతో బయటపడడం సాధ్యమని కాదు గానీ, కనీసం ఈ ఆంక్ష చట్టరీత్యా అక్రమం అని తెలుసుకోవడం అవసరం. లేకపోతే మీడియాను రానివ్వం అని ప్రభుత్వాలు ఒకదాని తరువాత ఒకటి నిషేధాలు పెట్టడం మొదలుపెడితే ప్రజాస్వామ్యానికి చాలా నష్టం. లాల్‌గఢ్‌లో వామపక్ష ప్రభుత్వం మొదలుపెట్టిన దానిని ఇప్పుడు ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం కొనసాగిస్తున్నది. అయితే ఈ విషయంలోనూ శ్రీలంక ఇన్స్‌పిరేషన్ ఉన్నట్టుంది. ఎల్‌టిటిఇపైన పోరు జరిగేటపుడు చివరి మూడు నెలల్లో శ్రీలంక పాలకులు మీడియాను దేశ ఉత్తర ప్రాంతానికి రానివ్వలేదు. ఆ దశలో 20 వేల మంది సాధారణ తమిళ పౌరులు చనిపోయారని ఐక్యరాజ్య సమితి అధికారులు ఆంతరంగిక ఉత్తర ప్రత్యుత్తరాలలో చెప్పుకున్న విషయాన్ని చూస్తే శ్రీలంక పాలకుల ఉద్దేశ్యం అర్థం అవుతుంది.

శ్రీలంక ప్రస్తావన ఇప్పటికి రెండుసార్లు వచ్చింది. మూడవసారి వస్తేగానీ కథ పూర్తి కాదు. ఎల్‌టిటిఇ సైనిక పతనం తరువాత ఇండియా పాలకులకొక

ధైర్యం వచ్చింది. మిలిటెంట్ రాజకీయ పోరాటాలతో శాంతిచర్చలు, రాజకీయ పరిష్కారాలూ అక్కరలేదనీ, గట్టిగా పూనుకుంటే వారిని భౌతికంగా ఏరివేయవచ్చుననీ ఇప్పుడు మన పాలకులు కూడ నమ్ముతున్నారు. ఇప్పటికే దేశ ఆంతరంగిక భద్రతకు ప్రధాన ప్రమాదం అని ప్రకటించబడ్డ మావోయిస్టులను ఏరివేయాలన్న సంకల్పం దీనితో బలపడింది. దేశ ఆంతరంగిక భద్రతకు మావోయిస్టుల కంటే పాలక పార్టీల అవినీతి, అక్రమ పరిపాలన, అసమానతలను వికృతంగా పెంచుతున్న ఆర్థిక విధానాలు ఎక్కువ ముప్పు కాదా అని సాధారణ మానవులకు సహితం సందేహం రావొచ్చు. కానీ ప్రస్తుతం హోం మంత్రిగా ఉన్న మన మాజీ ఆర్థిక మంత్రి, దేశ 'అభివృద్ధి' విధానకర్తలలో ఒకడు అయిన చిదంబరానికి తెలిసిన విషయమేమిటంటే ఆంతరంగిక భద్రత సంగతి ఎట్లాగున్నా మధ్య భారత అడవి ప్రాంతాలలోని అపారమయిన ఖనిజ సంపదను వెలికి తీసి 'అభివృద్ధి' వనరుగా వినియోగించే ప్రయత్నానికి మావోయిస్టుల ఉనికి అడ్డం కాగలదని. మావోయిస్టులు తమకు ప్రాబల్యం ఉన్న ప్రాంతాలలో బడా పెట్టుబడిదారుల ఉనికికీ విస్తరణకూ అన్ని సందర్భాలలోనూ అడ్డుపడలేదుగానీ, అడ్డుపడగలరన్న భయం వల్ల పెట్టుబడిదార్లు ముందుకు రాకపోవచ్చునని ఆ ఆందోళన.

అన్నీ కలిసి మావోయిస్టుల ఏరివేత ప్రక్రియకు దారితీసాయి. భారీగా పారా మిలటరీని, గెరిల్లా తరహా శిక్షణ పొందిన కోబ్రాలను దించి భౌతికంగా మావోయిస్టులను తుదముట్టిస్తాం అని చిదంబరం టూత్‌పేస్ట్ చిరునవ్వు చెదరకుండ చేస్తున్న సవాలు అమలుకావడం మొదలయింది. ఈ ఏరివేతకు అర్థం ఆదివాసుల హననం కాగలదని నిన్న మొన్న దంతెవాడ కాల్పుల గురించి అరకొరగా వస్తున్న వార్తలు తెలుపుతున్నాయి. అయితే మావోయిస్టులూ అదే భాష మాట్లాడుతున్నారు. తమ తడాఖా చూడమని ప్రభుత్వానికి ఎదురు సవాలు విసురుతున్నారు. అబుజ్‌మఢ్‌లో పారామిలటరీని దించుతాం అని చిదంబరం ప్రకటించిన రెండవ రోజే రాజ్‌నంద్‌గాంలో వారు పోలీసులను పెద్ద సంఖ్యలో చంపారు. సాయుధ పోరాట మార్గాన్ని ఎంచుకున్నవారు యుద్ధం వచ్చినప్పుడు యుద్ధం చేయక తప్పదు గానీ ప్రజల మధ్య బతుకుతూ యుద్ధాన్ని ఆహ్వానించే పనులు చేయకూడదు. నివారించడానికి ఎంత చేయగలిగితే అంత చేయాలి. ఏం చేయవచ్చునంటే చాలా చర్చ పెట్టుకోవచ్చును గానీ, అసలు ఆ వైఖరి ఉందా అనేది ప్రశ్న. మావోయిస్టు నాయకులకు ఇటువంటి ప్రశ్నలు నచ్చవు. 'మీరు ఎవరి పక్షం?' అని అడుగుతారు. రాజకీయ పక్షపాతాన్నే కాక విలువల పక్షపాతాన్ని కూడ గుర్తించేట్టయితే మేము

న్యాయం పక్షం అని జవాబు చెప్పవచ్చు. న్యాయం ఎక్కువ భాగం ప్రజల కోసం పోరాడేవారి వైపే ఉంటుంది గానీ, వారు ప్రజల క్షేమం కంటే తమ రాజకీయ లక్ష్యాన్ని ప్రధానంగా ఎంచినప్పుడు అది అన్యాయం అనక తప్పదు.

'ప్రభుత్వం మాత్రం ఎంతకాలం చూస్తూ ఊరుకుంటుంది' అని అడిగే వారూ ఉంటారు. ప్రజల అవసరాల కోసం మిలిటెంట్ పోరాటాలు చేయడం వేరు, రాజ్య సార్వభౌమత్వాన్నే సాయుధంగా సవాలు చేయడం వేరు. మొదటిదాని పట్ల కొంత ఉదారంగా ఉండగల పాలకులు రెండవదాని పట్ల ఉండలేరని అంటారు. మావోయిస్టులయినా రేపు అధికారానికి వస్తే ఇంతకంటే భిన్నంగా నడుచుకుంటారా అని ప్రశ్నిస్తారు. ఇది న్యాయమైన ప్రశ్నేగానీ, ఎటువంటి సవాలునైనా ప్రజాస్వామికంగానే ఎదుర్కోవాలనేది ప్రజాతంత్రవాదులివ్వగల ఏకైక సమాధానం. దీనికి మార్గం చెప్పమని కోరుతూ 11వ ప్రణాళికా సంఘం ఒక నిపుణుల కమిటీని నియమించగా మావోయిస్టుల వల్ల ప్రజలు ఏ హక్కులు, ఏ స్వతంత్రం, ఏ జీవనావకాశాలు పొందారో అవి నీ సార్వభౌమాధికారాన్ని వినియోగించి నువ్వే కల్పించడం ఒక్కటే వారిని ప్రజాస్వామికంగా ఎదుర్కొనే మార్గం అవుతుందని వారు చెప్పడం జరిగింది. మన్మోహన్ సింగ్ గానీ చిదంబరం గానీ ఆ నివేదిక చదివిన దాఖలాలు లేవు.

చివరిగా, దంతెవాడ జిల్లాలోని సంఘర్షణ ఎప్పటిలాగే భద్రాచలం డివిజన్‌లో ప్రతిధ్వనించడం మొదలయింది. చింతూరు నుంచి వాజేడు దాకా పోలీసులు ఆదివాసులను బలవంతంగా పోలీస్ స్టేషన్‌కు రప్పించి, అక్రమంగా నిర్బంధించి, తీవ్రంగా హింసించి 'బైండోవర్' చేస్తున్నారు. చర్ల పోలీసులు చేతులూ కాళ్లూ కట్టి కొక్కానికి వేళ్లాడదీసి చితకగొట్టిన ఆర్. కొత్తగూడెం కాలనీవాసి కొమురం నరసింహారావు, మళ్లీ ఏం చేస్తారో అన్న భయానికి ఈ నెల 7వ తేదీన తన ఊరి సమీపంలో ఆత్మహత్య చేసుకోవడంతో ఈ విషయం బయటి ప్రపంచానికి తెలిసింది. ఇక్కడే పరిస్థితి ఇట్లా ఉంటే దంతెవాడలో ఎట్లా ఉంటుందో ఊహించుకోవచ్చు. అందుకే ప్రభుత్వం ఈ వేట ఆపాలని అందరమూ నినదించడం అవసరం. మావోయిస్టులూ ఆ దిశగా ఒత్తిడి పెంచే పద్ధతిలో నడుచుకోవాలని కోరడమూ అవసరం.

*ఆంధ్రజ్యోతి దినపత్రిక*
*23 సెప్టెంబర్ 2009*

# ప్రజాస్వామికంగానే జవాబు చెప్పండి

**ప్రశ్న: నక్సలైట్ సమస్యను ప్రభుత్వం ఏ రకంగా పరిష్కరించాలని మీరు భావిస్తున్నారు?**

జ : చాలాకాలం నుంచి మన దేశంలో ప్రభుత్వాలు నక్సలైట్ సమస్యను సామాజిక ఆర్థిక సమస్యగా గుర్తిస్తున్నాము, సామాజిక ఆర్థిక భూమిక ఉన్న రాజకీయ ఉద్యమంగా గుర్తిస్తున్నాము అని చెప్పడమే కాక దానికి తగ్గట్టుగా స్పందిస్తామని, రాజకీయ పరిష్కారం కోసం వెతుకుతున్నామని చెపుతూనే ఉన్నారు. 11వ ప్లానింగ్ కమిషన్ దీనిపై ఒక నిపుణుల కమిటీని కూడ వేసింది. దాంట్లో నేను కూడ ఒక సభ్యుడ్ని. మమ్మల్ని ఒక నివేదిక ఇమ్మని అడిగారు.

'పోలీసుల్ని, పారామిలటరీని ఉపయోగించి అణచివేసే ప్రయత్నం చెయ్యడం వలన నష్టమే ఎక్కువ జరిగింది. ప్రజల మీద చాలా హింస జరిగింది. ప్రభుత్వానికీ ప్రయోజనమేమీ రాలేదు. పోలీసులు చాలామంది చనిపోయారు. మావోయిస్టులూ చనిపోయారు. మరి ప్రత్యామ్నాయ మార్గమేమిటి? ప్రభుత్వం వాళ్లకు ప్రజాస్వామికంగా ఏ రకంగా జవాబు చెప్పాలి?' అని అడిగారు. ఒక వివరమైన నివేదిక ఇచ్చాం. అందులో మేము ప్రధానంగా చెప్పిందేమిటంటే ప్రజలకు మావోయిస్టుల వల్ల కొన్ని హక్కులు, కొంత రక్షణ, ఆత్మగౌరవం లభిస్తున్నాయి. వాటిని మీ రాజ్యాధికారాన్ని, చట్టాన్ని, రాజ్యాంగాన్ని ఉపయోగించి మీరే వాళ్లకు కల్పించండి. అదే ప్రజాస్వామిక మార్గం

అవుతుందని చెప్పాం. కాని ఈ ప్రభుత్వాలు అవి వినవు ఎందుకంటే ఒకటి - ఇవ్వాళ వాళ్ళు దేశ అభివృద్ధి కోసం అనుసరిస్తున్న వ్యూహాలకు ఇది ఆటంకం అవుతుంది. రెండవది - ఆ గ్రామీణ ప్రాంతాలలోని ఈ పాలక పార్టీల మనుషులు ఎవరు, వారి నాయకులు ఎవరు అనంటే అక్కడి ప్రజానీకానికి హక్కులు లేకపోవడం వల్ల బాగుపడుతున్నవారు, వారి హక్కులు హరించి బాగుపడుతున్న వాళ్ళు. కాబట్టి ఆ పనులు చేయాలనంటే తమ పార్టీ క్యాడర్‌నూ, స్థానిక నాయకులనూ వాళ్ళు వ్యతిరేకం చేసుకోవాల్సి ఉంటుంది. దానికి తెలుగుదేశం పార్టీ గానీ, కాంగ్రెస్ పార్టీ గానీ, బి.జె.పి గానీ, ఏ పార్టీ గానీ సిద్ధంగా ఉండదు. ఇవీ వాస్తవాలు. మేము హక్కుల సంఘాలుగా ప్రభుత్వాలకు ఇవ్వగల సలహా వారు ఆ ప్రజలకు చేస్తున్న మేలును మీరు మీ అధికారం ద్వారా చేయమని. కానీ మా నివేదికను పూర్తిగా పక్కన పెట్టి కోబ్రాల పేరుతో ఒక యాంటి నక్సలైట్ ఫోర్స్‌ను తయారు చేసి వారిని ఏరివేసే ప్రయత్నం ఛత్తీస్‌గఢ్‌లో మొదలుపెట్టారు.

ప్రశ్న: **మావోయిస్టులు అభివృద్ధిని నిరోధిస్తున్నారు అనే ఆరోపణ ఎంతవరకు నిజమంటారు?**

మావోయిస్టులకు నేనేమీ వకాల్తా పుచ్చుకోవడం లేదు గానీ ఈ ప్రశ్నను నేను 2006లో దంతేవాడ పోయినప్పుడు అక్కడి కలెక్టర్‌ను అడిగాను. 'మీరు చేసే అభివృద్ధికి మావోయిస్టులు అడ్డుపడుతున్నారు అంటున్నారు. మీరేమంటారు' అని అడిగితే 'మేము అంత అభివృద్ధేమీ చేయడం లేదు లెండి వాళ్ళు అడ్డుపడటానికి' అన్నారాయన. వాస్తవానికి మావోయిస్టుల మీద పెట్టవలసిన విమర్శలు రెండు ఉన్నాయి. ఒకటి, రోడ్లు ఉంటే పారా మిలటరీ వస్తుంది, పోలీసులు వస్తారని వాళ్ళు రోడ్లు తవ్వేశారు చాలా చోట్ల. తమ రక్షణ కోసం వాళ్లు చేసిన ఈ పని వలన ప్రజలకు నష్టం జరిగింది. రెండవది గ్రామీణ ప్రాంతాలలోని స్కూళ్ళు, సోషల్ వెల్ఫేర్ హాస్టళ్లను - ఎక్కువేమీ లేవు. అక్కడక్కడే ఉన్నాయి - పారామిలటరీ, పోలీసులు క్యాంపులుగా వాడుకుంటున్నారని వాటిని పేల్చేశారు. ఇవి రెండూ తప్పు. వీటిని తప్పనిసరిగా వ్యతిరేకించాలి.

అయితే అటువైపు నుంచి చూస్తే ప్రభుత్వం ఏమి అభివృద్ధి చేసిందని వీళ్ళు అడ్డు పడ్డారనే ఆరోపణ వేస్తున్నారు అనే ప్రశ్న వస్తుంది. ఛత్తీస్‌గఢ్‌లో అయినా, జార్ఖండ్‌లో అయినా, ఒరిస్సాలో అయినా, మన రాష్ట్రంలో అయినా ప్రభుత్వాలు ఆదివాసీ ప్రాంతాలలో గ్రామగ్రామానికి స్కూల్ కడతాం, రోడ్లు వేస్తాం, ఆసుపత్రులు

పెడతాం, యువకులకు శిక్షణ ఇచ్చి ఉద్యోగాలు కల్పిస్తామని చెప్పి పనులు మొదలుపెట్టి ఉంటే అది అభివృద్ధే. దానికి మావోయిస్టులు అడ్డుపడి ఉంటే మీరూ నేనూ ఏమీ అననక్కరలేదు, జనమే వాళ్ళను అక్కడి నుంచి తరిమివేస్తారు. అది జరగలేదు, ప్రభుత్వాలు ఆ పనులు చెయ్యలేదు. నిజానికి అక్కడ మావోయిస్టు ఉద్యమం మొదలయ్యేంతవరకు అభివృద్ధి చేస్తున్నామా లేదా అనే ప్రశ్న కూడ వాళ్లు వేసుకోలేదు. వాళ్ళకు పట్టణాలు సరిపోయాయి, పెద్ద పెద్ద నగరాలు సరిపోయాయి. గ్రామీణ ప్రాంతాలు, ముఖ్యంగా ఆదివాసీ ప్రాంతాలు వాళ్ళ లెక్కలోకి రాలేదు. వీళ్ళు వచ్చిన తరువాత వీళ్ళ మీద నింద వేయడానికి ఆ మాట అంటున్నారు. వీళ్ళ వైపు లోపాలు ఉన్నాయి, నేను కాదనడం లేదు గానీ, అభివృద్ధికి అడ్డుపడుతున్నారు అనేటువంటి నింద వేయడం మాత్రం సరయినది కాదు.

ప్రశ్న: **ఛత్తీస్‌గఢ్‌లో ఎన్.ఎం.డి.సి వేస్తున్న రోడ్లను మావోయిస్టులు ధ్వంసం చేశారు కదా!**

అప్పుడప్పుడు వాళ్ళ నిరసన కార్యక్రమాలలో భాగంగా ఎన్.ఎం.డి.సి వాళ్ల క్రేన్లవీ పేల్చేశారేమోగానీ ఇతరత్రా వాళ్లు అడ్డం పడిందేమీ లేదు. బైలదిల్లా గనులు నడుస్తూనే ఉన్నాయి. ఎన్.ఎం.డి.సి నడుస్తూనే ఉంది. నాల్కో వారి బాక్సైట్ పరిశ్రమా నడుస్తూనే ఉంది. భారీ పరిశ్రమలు వేటికీ వీళ్ళెప్పుడూ అడ్డుపడలేదు. ప్రభుత్వరంగ పరిశ్రమలే కాదు, ప్రైవేటు పెట్టుబడిదారుల కంపెనీలకు కూడ మావోయిస్టులు పెద్దగా అడ్డం రాలేదు. వాళ్ళు ప్రధానంగా దృష్టి పెట్టింది గ్రామీణ ప్రాంతాలలో ఆదివాసులపైన అణచివేత ప్రయోగించే వాళ్ళ మీద. వాళ్ళను చంపడం గానీ, బెదిరించడం గానీ, తరిమివేయడం గానీ చేశారు. ఆదివాసీ గ్రామాలలో కమిటీలు వేసి వాళ్ళ గ్రామాలను వాళ్ళు చక్కదిద్దుకునేటట్టు చేశారు. కొన్ని చోట్ల చెరువులు తవ్వించారు. ఇటువంటి కొన్ని మంచి పనులు చేశారు. ముప్ఫై సంవత్సరాలుగా మేము మావోయిస్టులను చూస్తున్నాము. వాళ్ళు చేసే వాటిలో తప్పులు చాలా ఉండవచ్చును గానీ అట్టడుగు వర్గాల ప్రజానీకానికి ఒక ఆత్మస్థయిర్యాన్ని కల్పించిన రాజకీయ ఉద్యమంగా మాత్రం దానిని గౌరవించాలి. వాళ్ళు పరిశ్రమలకు అడ్డు పడ్డారనడానికి బలమైన ఆధారాలు ఏమీ లేవు.

ప్రశ్న: **వారికి రాజకీయ మిత్రులు ఎందుకు లేరు?**

రాజకీయ మిత్రులు లేకుండా ఏమీ పోరు గానీ, ఆ విషయంలో వాళ్ళ మీద తరచుగా వచ్చే విమర్శ ఏమిటంటే - వాళ్ళు ఎంచుకున్నటువంటి పోరాట

మార్గం వలన ఎటాగూ కొందరు శత్రువులు - బడా పెట్టుబడిదారులో, భూస్వాములో, రాజకీయ నాయకులో - ఉంటారు. దానిని మించి వాళ్ళు తమ తొందరపాటు చర్యల వలన ఇంకా ఎక్కువ మందిని తయారు చేసుకున్నారనే విమర్శ ఉంది. ఉదాహరణకు చాలా సందర్భాలలో ఏమి జరుగుతూ ఉంటుందంటే ఒక ఆటంకాన్ని తొలగించుకునేటప్పుడు - కొడితే పోయేదానికి, చంపితే పోయేదానికి వేరే మార్గాలు ఎందుకు అనేటువంటి వైఖరిని వాళ్ళు ప్రదర్శిస్తూ ఉంటారు. వేరే రూపాలలో సమస్యను పరిష్కారం చేసుకోవాలంటే ఓపిక కావాలి. చాలా ప్రయత్నం కావాలి. తంతే, చంపితే సమస్య తీరిపోవచ్చు. అది తాత్కాలిక ఉపశమనాన్ని ఇస్తుందేమో గానీ మరింత మంది శత్రువులను తయారు చేస్తుంది. ఆ రకంగా వాళ్ళు అనవసరమైన శత్రువులను తయారు చేసుకున్నారేమోననే అభిప్రాయం కూడ ఉంది వాళ్ళ మీద.

**ప్రశ్న: కాంట్రాక్టర్లతో కుమ్మక్కయి రోడ్లు పేల్చివేస్తున్నారు అనే ఆరోపణ కూడ ఉంది. వ్యవస్థను వ్యతిరేకించే వారు వ్యవస్థలో భాగమైన కాంట్రాక్టర్లతో కుమ్మక్కు అవ్వడం ఎంతవరకు సమంజసం?**

వాళ్ళు చెప్పే జవాబు ఏమిటంటే మేము కుమ్మక్కు కావడం లేదు, కాంట్రాక్టర్ల డబ్బయినా గవర్నమెంటు డబ్బయినా ప్రజల సొమ్మే కాబట్టి ప్రజల కోసం మేము దాన్ని తీసుకుంటున్నాం, అది వాళ్ళు సృష్టించిన సంపద కాదు అని. కాంట్రాక్టర్ల దగ్గర డబ్బులు తీసుకొని వాళ్ళు వేసే రోడ్లను పేల్చేస్తే, మళ్ళీ వాళ్ళకు ఇంకొక కాంట్రాక్టు వస్తుందనే, ఆ రకమైన లాలూచీ వాళ్ల మధ్య ఉందని మేమేమీ అనుకోవడం లేదు. అయితే ఆ ప్రాంతాలలో బతికే కొంచెం చదువుకున్న వాళ్ళు, టీచర్లు చెప్పేటువంటి ఒక సీరియస్ అభియోగం ఏమిటంటే కొంతమంది బాగా డబ్బున్న వాళ్ళు చేసే అక్రమాలను, అవినీతిని మావోయిస్టులు గానీ, ఇతర నక్సలైట్ పార్టీలు గానీ ప్రశ్నించరు, ఎందుకంటే వాళ్ళకు ఫండ్ దొరుకుతుందని అంటారు. ఇది కొన్ని సందర్భాలలో వాస్తవికం అనిపిస్తుంది. కాని అదే పనిగా ఎవడో కాంట్రాక్టు తీసుకుంటాడు, వీళ్ళు రోడ్డు పేల్చేస్తారు, అతను మళ్ళీ కాంట్రాక్టు తీసుకుంటాడు అనే రకమైన లాలూచీ ఉందని నేనేమీ అనుకోవడం లేదు. బహుశా ఫండ్ ఇచ్చాడు కాబట్టి ప్రస్తుతానికి చూసీ చూడనట్టు పోదాం, భవిష్యత్తులో ఎప్పుడైనా చూసుకోవచ్చు అనే వైఖరి వాళ్ళలో ఉండి ఉండొచ్చు.

**ప్రశ్న: మావోయిస్టులు దేశ అంతరంగిక భద్రతకు ప్రధాన ప్రమాదమని ప్రభుత్వం అంటోంది కదా!**

ఈ మధ్య మన్మోహన్‌సింగ్, చిదంబరం పదే పదే ఆ అర్థరహితమైన ప్రకటన చేస్తున్నారు. దేశ ఆంతరంగిక భద్రతకు మావోయిస్టులే ప్రధాన శత్రువు అనడం నాన్‌సెన్స్. దేశ ఆంతరంగిక భద్రతకు ప్రధాన ప్రమాదం ఏదైనా ఉంటే అది దేశపాలకుల పాలనా నీతి. వాళ్ళు అసమానతలు పెంచుతున్నారు, పేదరికం పెంచుతున్నారు. దానివల్ల వచ్చేటువంటి ఆగ్రహం, దానివల్ల వచ్చేటువంటి అలజడులు - ఇవీ దేశ ఆంతరంగిక భద్రతకు ప్రధానమైనటువంటి ప్రమాదం. అంతే తప్ప మావోయిస్టులు ఆ రకమైనటువంటి ప్రమాదమని నేనేమీ అనుకోవడం లేదు. మావోయిస్టుల గురించి భిన్న అభిప్రాయాలు ఉంటాయి. వారిని పూర్తిగా మెచ్చుకునే వాళ్ళు ఉంటారు, పాక్షికంగా వాళ్ళను అభినందిస్తూ విమర్శించే వాళ్ళు ఉంటారు. ఏదేమైనా ఒక రాజకీయ ఉద్యమంగా వారిపై ఉండే విమర్శకు అర్థం ఉంది తప్ప ఆంతరంగిక భద్రతకు వాళ్ళే ప్రధానమైన ముప్పు అనేది పూర్తిగా అర్థరహితమైనటువంటి వైఖరి.

అయితే దీన్ని వాళ్లు పదే పదే ఎందుకు అంటున్నారు అంటే దీంట్లోని సామాజిక ఆర్థిక అంశాన్ని వాళ్ళు చూడదలచుకోలేదు కాబట్టి. దాన్ని వాళ్ళు ఒక రాజకీయ ఉద్యమంగా చూడదలచుకోలేదు కాబట్టి. అణచివేతనే ఏకైక విధానంగా వాళ్లు అనుసరించదలచుకున్నారు. దానికి సిద్ధాంతపరమైనటువంటి ఒక సమర్థన ఇవ్వాలనుకున్నారు. అది ఏమిటీ అనంటే ప్రధాన శత్రువు కాబట్టి వాళ్ళను అణచివేయడం తప్పనిసరి అనే పద్ధతిలో మాట్లాడుతున్నారు. ప్రభుత్వానికి కూడ బాగా తెలుసు తాము చెప్పేది వాస్తవం కాదని.

*29 సెప్టెంబర్ 2009*

*గ్రీన్‌హంట్ మీద ‘లోకల్ టీవీ’ కోసం అరుణారవికుమార్ చేసిన ఇంటర్వ్యూలో కొంత భాగం.*

# పర్స్పెక్టివ్స్ ఎందుకోసం

**మా**నవజాతి భవిష్యత్తును గురించి ఇవ్వాళ చాలా చర్చ జరుగుతూ ఉంది. ఏ రకమయిన అసమానతగానీ, అణచివేతగానీ లేని సమాజం కావాలని అభ్యుదయవాదులందరూ కోరుకుంటారు. కానీ ఆ సమాజ స్వరూప స్వభావాలను గురించి ఏకాభిప్రాయం మట్టుకు అభ్యుదయవాదులలో సర్వత్రా లేదు. మార్క్స్ రచనలతో ఒక ప్రామాణికమయిన రూపం తీసుకున్న చర్చ ఈనాటికీ ముగియలేదు. అణచివేతలోనూ అసమానతలోనూ కొత్త కోణాలను చరిత్ర ముందుకు తెచ్చేకొద్దీ చర్చ మరింత వాడిగా సాగుతూ ఉంది. మరింత జటిలం అవుతూ ఉంది. కొత్త కోణాలలో కొన్ని నిజానికి చాలా పాతవే కావడంతో వాటిని ఇన్నాళ్ళూ ఎందుకు చూడలేకపోయామన్న విమర్శ చర్చకు కొంత వేడిని కూడా చేరుస్తూ ఉంది.

ఆ చర్చలో అనేక రకాల దృక్పథాలు గల వ్యక్తులు పాల్గొంటున్నారు. అనేక ఉద్యమాలు పాల్గొంటున్నాయి. అసమానతకూ, అణచివేతకూ కొత్త కోణాలను ఆవిష్కరించేవారు, ఇప్పటికే ఉన్న విప్లవ సిద్ధాంతాలు వాటిని ఆకళింపు చేసుకోలేవనే వారు, అసలు కొత్త కోణాల ఆవిష్కరణే నిరుపయోగమయిన ప్రయాస అనుకునేవారు, ఇప్పటికి ఉన్న సిద్ధాంతాలే సామాజిక జీవితంలోని అన్ని పార్శ్వాలనూ అవగాహన చేసుకోగలవనుకునే వారు, అసలు 'సిద్ధాంతం', 'నిర్మాణం' అనేవే మానవజాతి వికాసానికి అవరోధం అనుకునే వారు, అభ్యుదయం కోసం ఇప్పటిదాకా జరిగిన ప్రయత్నమంతా వృథా అనుకునేవారు, దాని మంచి చెడుల నుండి గుణపాఠాలు తీసుకోగలమనుకునేవారు, రాజకీయ ఆచరణలో నిమగ్నం అయినవారు, ఆచరణతో నిమిత్తం లేనివారు...ఇంకా అనేకులు ఇవాళ మానవ భవితవ్యాన్ని గురించిన ఈ చర్చలో పాల్గొంటున్నారు.

ఈ చర్చకు సంబంధించి 'పర్స్పెక్టివ్స్'కు ఒక దృక్పథం ఉంది. మానవ సమాజం గురించీ దాని భవిష్యత్తు గురించీ బుద్ధుడి నుండి ఈనాటిదాకా అనేకులు ఊహలు చేశారు. సిద్ధాంతాలు చేశారు. ఎవ్వరూ కాదనలేని ఆదర్శాలు మన ముందుంచారు. ఆ ఆదర్శాలను సాధించే మార్గాలను ప్రతిపాదించారు. ఈ అన్వేషణకు శాస్త్రీయ ప్రాతిపదిక కల్పించి నేలమీద నిలబెట్టింది మార్క్సిజం. మార్క్స్ రచనలు చేయడం మొదలు పెట్టిన తరువాత చర్చ యావత్తూ ఆయన

ప్రతిపాదించిన అధ్యయన చట్రం చుట్టూ పరిభ్రమిస్తూ ఉంది. అంగీకరించేవాళ్ళూ, సవరించేవాళ్ళూ, తిరస్కరించే వాళ్ళూ అందరూ దానినే ప్రమాణంగా స్వీకరించారు. ఇవ్వాళ తూర్పు యూరప్, సోవియట్ రష్యా, చైనా దేశాలలో వస్తూన్న మార్పుల ఫలితంగా చెలరేగుతున్న చర్చ స్వభావం కూడా ఇందుకు భిన్నంగా లేదు. ఇకమీదట ఉండబోతుందని మేము అనుకోవడం లేదు.

ఇప్పటికీ సిద్ధాంతం ఆచరణలకి సంబంధించిన సమస్యలని మార్క్సిజం అధిగమించిందని చెప్పలేం. పాత సమస్యలు పరిష్కరించుకునే క్రమంలో కొత్త సవాళ్ళు మార్క్సిజం ముంగిట కొస్తున్నాయి. కొత్త నిర్వచనాలు, కొత్త ప్రతిపాదనలు, ప్రత్యామ్నాయాలు రూపొందుతున్నాయి. సామాజిక పరివర్తన కోసం జరుగుతున్న మొత్తం చర్చలో భాగమే మార్క్సిజం గురించిన చర్చ కూడా. ఈ చర్చలో అన్ని కోణాలకూ అన్ని పోకడలకూ వేదిక కల్పించాలని 'పర్ స్పెక్టివ్స్' భావిస్తూ ఉంది. ఆర్థిక పరిమితుల వల్ల అన్ని పుస్తకాలు ప్రచురించ వీలుకాకున్నా, ఆ దిశగా చర్చను ప్రతిపాదించే పుస్తకాలను ప్రచురించాలనుకుంటున్నాం.

అణచివేతనూ, అసమానతనూ వ్యతిరేకించేది ఏదయినా ప్రజాస్వామిక దృక్పథమే. మౌలికంగా అభ్యుదయ దృక్పథమే. ఆపైన ఎన్ని తేడాలున్నా వినదగినదే, చర్చించదగినదే, అధ్యయనం చేయదగినదే. ***'నూరు పూలు వికసించనీ, వేయి ఆలోచనలు సంఘర్షించనీ'*** అని మావో ఒక చారిత్రక సందర్భంలో ఇచ్చిన పిలుపుకు ఈ నిర్దిష్టమయిన అర్థంలో సార్వత్రిక ప్రాతిపదిక ఉందని 'పర్ స్పెక్టివ్స్' భావిస్తూ ఉంది. ఆ అవగాహనతో ప్రచురణలు చేపడుతోంది. ప్రజాస్వామిక స్వభావం కలిగిన సమర్థవంత మయిన రచనలను ఎక్కువగా తెలుగులో, వీలున్నప్పుడు ఇంగ్లీషు, హిందీలో కూడా ప్రచురించడం ద్వారా కొనసాగుతున్న 'గ్రేట్ డిబేట్'కు దోహదం చేయాలని మా సంకల్పం.

మే
1999

**కె. బాలగోపాల్**
**పర్ స్పెక్టివ్స్**
సామాజిక శాస్త్రం / సాహిత్యం
హైదరాబాదు

# 1988 నుంచి 2017

# పర్‌స్పెక్టివ్స్ ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| ★ 1. | Probings in the Political Economy of Agrarian Classes and Conflicts | May 1988 | by K. Balagopal<br>Ed. G. Haragopal |
| ★ 2. | సహచరులు | జూలై 1989 | వరవరరావు |
| ★ 3. | పతంజలి భాష్యం | జూలై 1989 | కె.ఎన్.వై. పతంజలి |
| ★ 4. | సృజన సంపాదకీయాలు | జనవరి 1990 | వరవరరావు/సాహితీ మిత్రులు |
| ★ 5. | అభివృద్ధి వెలుగునీడలు | మే 1990 | ఆర్.ఎస్.రావు |
| ★ 6. | కఠోర షడ్జమాలు | తొలి ముద్రణ 1990<br>మలి ముద్రణ 1996 | వసంత కన్నబిరాన్ |
| ★ 7. | మతవర్గ తత్వం | ఫిబ్రవరి 1991 | ఎడిటర్స్ : హరి, జి. హరగోపాల్ |
| 8. | ఇలా మిగిలేం | తొలి ముద్రణ 1991<br>రెండవ ముద్రణ 1993<br>మూడవ ముద్రణ 2012 | చలసాని ప్రసాదరావు |
| ★ 9. | పరాధీన భారతం | తొలి ముద్రణ 1992<br>మలి ముద్రణ 1993 | ఎ.బి.కె. ప్రసాద్ |
| ★ 10. | డంకెల్ దుశ్శాసనం | జూన్ 1993 | నూర్ భాషా |
| ★ 11. | దినదినగండం | సెప్టెంబర్ 1993 | అనువాదం : కోదండ రామిరెడ్డి |
| ★ 12. | మన చలం | మే 1994 | ఎడిటర్ : కృష్ణాబాయి |
| ★ 13. | Towards Understanding Semi Feudal Semi Colonial Society | Jan 1995 | by R.S. Rao<br>Ed. D. Narasimha Reddy |
| ★ 14. | ఏడోసారా కథ | జూలై 1995 | బుర్ర రాములు |
| ★ 15. | శాక్కో-వాంజెట్టి | నవంబర్ 1995 | బి. చంద్రశేఖర్ |
| ★ 16. | బంగారమ్మ కథ | జనవరి 1996 | అనువాదం : కృష్ణాబాయి |
| ★ 17. | కార్టూన్ కబుర్లు | సెప్టెంబరు 1996 | మోహన్ |
| 18. | నాకో పిస్తోల్ కావాలి | అక్టోబర్ 1996 | అనువాదం :<br>చలసాని ప్రసాదరావు |

| | | | |
|---|---|---|---|
| 19. | సాహిత్యంలో వస్తు శిల్పాలు | మార్చ్ 1997 | త్రిపురనేని మధుసూదనరావు |
| ★ 20. | కల్లోల కథా చిత్రాలు | డిసెంబర్ 1997 | కె. బాలగోపాల్<br>ఎడిటర్ : చలసాని ప్రసాద్ |
| ★ 21. | ఆంధ్రప్రదేశ్ ఆర్థిక సంస్కరణలు / ప్రపంచబ్యాంక్ ఎజెండా | మార్చ్ 1998 | ఎడిటర్ : డి. నరసింహారెడ్డి |
| ★ 22. | మూడు దశాబ్దాల నక్సల్బరీ గమ్యం-గమనం | తొలి ముద్రణ: ఆగస్ట్ 98<br>మలి ముద్రణ: అక్టోబర్ 98 | ఎడిటర్స్ : ఎస్. సుధాకర్, ఎం. కోదండరాం |
| ★ 23. | పరాధీన భారతంలో దారితప్పిన రూపాయి | డిసెంబర్ 98 | ఎ.బి.కె. ప్రసాద్ |
| ★ 24. | శారద నవలలు (ఏది సత్యం, మంచీ-చెడు, అపస్వరాలు) | ఆగస్ట్ 99 | శారద (ఎస్. నటరాజన్) |
| ★ 25. | సింగరేణి | నవంబర్ 2000 | ఎం.డి. మునీర్ , ఎం.డి. అన్వర్ |
| ★ 26. | ఖాదర్ లేడు | మే 2001 | మహమ్మద్ ఖదీర్ బాబు |
| ★ 27. | ప్రమాదంలో ప్రజారోగ్యం | ఫిబ్రవరి 2002 | డా॥ ఎస్. తిరుపతయ్య<br>డా॥ పి. జగదీశ్వర్ |
| ★ 28. | ఎన్జీవోల కథ | జనవరి 2003 | బి. చంద్రశేఖర్ |
| ★ 29. | జాగ్తే రహో | జూన్ 2003 | చలసాని ప్రసాదరావు<br>ఎడిటర్ : డి. వెంకట్రామయ్య |
| ★ 30. | ఉదయగీతిక (రెండవ కూర్పు తొలిముద్రణ) | డిసెంబర్ 2003 | రచన: యాంగ్ మో<br>అనువాదం : ఎన్. వేణుగోపాల్ |
| ★ 31. | వరల్డ్ సోషల్ ఫోరం ఆర్థిక రాజకీయాలు | జనవరి 2004 | **RUPE (MUMBAI)**<br>అనువాదం : బి. చంద్రశేఖర్ |
| ★ 32. | ఎర్రమందారాలు (రెండవ కూర్పు తొలి ముద్రణ) | మే 2005 | రచన: లోకువాంగ్-పిన్<br>యాంగ్ యీ-యెన్<br>అనువాదం : డా॥ టి.నళిని |
| 33. | నూరేళ్ళ తెలుగు నవల (1878-1977) | తొలి ముద్రణ: ఆగస్ట్ 2007<br>రెండవ ముద్రణ: డిసెంబర్ 2015 | సహవాసి<br>సంపాదకులు: డి. వెంకట్రామయ్య |

| | | | |
|---|---|---|---|
| 34. | అల్లంరాజయ్య సాహిత్యం -**1** మూడు నవలలు- (కొలిమంటుకున్నది, ఊరు, అగ్నికణం) | జనవరి 2008 | అల్లం రాజయ్య సంపాదకులు-వరవరరావు |
| 35. | విభిన్న | ఆగష్టు 2008 | హరిపురుషోత్తమరావు |
| 36. | పతంజలి భాష్యం (రివైజ్‌డ్) | మార్చ్ 2009 | కె.ఎన్.వై.పతంజలి |
| 37. | మృగన | ఏప్రిల్ 2009 | విమల |
| 38. | రాజ్యం - సంక్షేమం | అక్టోబర్ 2010 | కె. బాలగోపాల్ |
| 39. | అల్లం రాజయ్య సాహిత్యం-**2** సృష్టికర్తలు (కథలు) | ఏప్రిల్ 2011 | అల్లం రాజయ్య సంపాదకులు-వరవరరావు |
| 40. | సంభాషణ | జులై 2011 | కె. శ్రీనివాస్ |
| 41. | దళిత | మొదటి ముద్రణ: అక్టోబర్ 2011 రెండవ ముద్రణ: నవంబరు 2016 | కె. బాలగోపాల్ |
| 42. | జాజిమల్లి | మొదటి ముద్రణ: డిసెంబర్ 2011 రెండవ ముద్రణ: ఏప్రిల్ 2012 | మల్లీశ్వరి |
| 43. | త్రిపుర (కథలు) | డిసెంబర్ 2011 | త్రిపుర |
| 44. | ప్రాణహిత | మొదటి ముద్రణ: జులై 2012 రెండవ ముద్రణ: సెప్టెంబర్ 2012 | అల్లం నారాయణ |
| 45. | మనిషి మార్క్సిజం | మొదటి ముద్రణ: అక్టోబర్ 2012 రెండవ ముద్రణ: మార్చ్ 2013 మూడవ ముద్రణ: నవంబరు 2016 | కె. బాలగోపాల్ |

| | | | |
|---|---|---|---|
| 46. | కొమురం భీము (నవల)<br>అల్లంరాజయ్య సాహిత్యం-**3** | మొదటి ముద్రణ:<br>జనవరి 2013<br>రెండవ ముద్రణ:<br>అక్టోబర్ 2016 | సాహు<br>అల్లం రాజయ్య<br>సంపాదకులు-వరవరరావు |
| 47. | సింహాలపేట (కథలు) | మార్చ్ 2013 | రమణజీవి |
| 48. | రిజర్వేషన్లు -ప్రజాస్వామిక దృక్పథం | మొదటి ముద్రణ:<br>అక్టోబర్ 2013<br>రెండవ ముద్రణ:<br>ఫిబ్రవరి 2014<br>మూడవ ముద్రణ:<br>డిసెంబరు 2016 | కె. బాలగోపాల్ |
| 49. | వసంతగీతం (నవల)<br>అల్లంరాజయ్య సాహిత్యం-**4** | డిసెంబర్ 2013 | అల్లం రాజయ్య<br>సంపాదకులు-వరవరరావు |
| 50 | LEADERS BEYOND<br>MEDIA IMAGES | డిసెంబర్ 2013 | K. Balagopal<br>Ed. G. Haragopal |
| 51. | స్వేచ్ఛారావం<br>(సామాజిక రాజకీయ వ్యాసాలు) | జులై 2015 | జి. హరగోపాల్ |
| 52. | ఆదివాసులు:<br>వైద్యం సంస్కృతి అణచివేత | అక్టోబర్ 2015 | కె. బాలగోపాల్ |
| 53. | ఆదివాసులు:<br>చట్టాలు-అభివృద్ధి | అక్టోబర్ 2016 | కె. బాలగోపాల్ |
| 54. | తల్లి చేప (కథలు)<br>అల్లంరాజయ్య సాహిత్యం-**5** | ఏప్రిల్ 2017 | అల్లం రాజయ్య<br>సంపాదకులు-వరవరరావు |
| 55. | నక్సలైట్ ఉద్యమం వెలుగునీడలు | మే 2017 | కె. బాలగోపాల్ |

★ ప్రతులు లేవు


**Perspectives**

***Social Sciences / Literature***

**Publishing *for* Change**



**Naxalite Udyamam**
**Veluguneedalu**
essays in telugu
Reflections on Naxalite Movement - K. Balagopal

బాలగోపాల్ మొత్తం ఆలోచనా క్రమాన్ని వడబోస్తే మానవ సమాజ ప్రగతికి, ఉద్యమాలకు, విప్లవపోరాటాలకు ఒక నైతిక, తాత్విక పునాది ఉండాలని, ఆ పునాది విస్తృతమయ్యే క్రమంలోనే సామాజిక సంబంధాలలో ఉన్నతమైన మానవీయ విలువలు వ్యవస్థీకృతం కావాలని ఆయన ప్రగాఢంగా వాంఛించినట్టు అర్థమవుతుంది. ఈ విలువల విస్తరణకు కావలసిన భౌతిక పునాది మార్పును సంపూర్ణంగా సమర్థిస్తూనే ఆ మార్పు కోసం జరుగుతున్న అన్ని ప్రయత్నాలు కూడా మానవ చైతన్యాన్ని పెంచే దిశగా ఉండాలని, భౌతిక పునాదిలో మార్పు దానికదే మానవ చైతన్యాన్ని పెంచదని, అది ఒక మేరకు మానవ చైతన్యాన్ని ప్రభావితం చేసినా ఆ ప్రభావం ఉన్నత విలువల వ్యవస్థీకరణకు దోహదపడకపోతే వచ్చిన మార్పు స్థిరపడదని, అది స్థిరపడకపోతే సమాజ ప్రగతి ఆటుపోటులకు గురై మనం సాధించుకోవాలన్న లేదా సాధించుకున్న ఉన్నత సమాజం ప్రమాదంలో పడుతుందని, ఆ చారిత్రక అనుభవం సోషలిస్టు సమాజాల పతనం మనకు అందించిందని ఆయన అవగాహన. ఈ పుస్తకంలోని వ్యాసాలను ఈ చట్రం నుండి అర్థం చేసుకొని విశ్లేషించవలసిన అవసరం ఉందని ప ర్ స్పె క్టి వ్స్ భావిస్తున్నది.

– జి. హరగోపాల్

ప ర్ స్పె క్టి వ్స్

Perspectives
Social Sciences/Literature
Publishing *for* Change
₹ 200/-

ISBN 978-93-81172-12-4
9 789381 172124